# వివేచన

## పరిశోధన పత్రిక

రెండవ సంచిక



సంపాదకుడు

బి. రామరాజు

సహాయ సంపాదకులు

సి. నారాయణరెడ్డి

జి. వి. సుబ్రహ్మణ్యం

డిసెంబరు 1977



తెలుగు శాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము

హైదరాబాదు

# VIVECHANA

Research Journal in Telugu

Department of Telugu, University College of Arts,
Osmania University, Hyderabad–500 007.

*Edited by* : **Prof. B. Rama Raju**
Head, Department of Telugu
Osmania University.

*Assisted by* : **Prof. C. Narayana Reddy**
**Dr. G. V. Subrahmanyam**

December, 1977

Copies 500

Price : Rs. 10–00

Printed at : Madhavi Art Printers. Kutbiguda,
Hyderabad-500 027

Released in Feb. 1978

*For Copies* :
The Head, Department of Telugu,
University College of Arts,
Osmania University,
Hyderabad–500 007.

# వి వే చ న

## పరిశోధన పత్రిక

తెలుగుశాఖ - ఉస్మానియా విశ్వవిద్యాలయము

రెండవ సంచిక | విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ | డిసెంబరు 1977

## హ రి వి ల్లు

పరిశోధన పత్రికా ప్రచురణం అధ్యాపకుల్లో పరిశోధన ప్రవృత్తిని పెంపొందింపజేస్తుం దనటానికి ఈ వివేచన రెండవసంచిక నిదర్శనం. ఉస్మానియావిశ్వవిద్యాలయంలో తెలుగుశాఖనుండి ఇప్పటికి 50 మంది పరిశోధకులు పిహెచ్.డి. డిగ్రీలను, 17 మంది ఎం. ఫిల్., డిగ్రీలను పొందినారు. ఈ విషయం ఈ శాఖలో పనిచేస్తున్న అధ్యాపకుల, విద్యార్థుల పరిశోధనా సక్తిని చెప్పక చెప్పుతున్నది. పరిశోధనడిగ్రీతోనే జిజ్ఞాస పరిసమాప్తి కారాదు. నిజాని కది నిరంతర సత్యాన్వేషణకు ప్రస్తావనగా పరిణవిల్లాలి. పరిశోధన-ఒక వినూత్న దర్శనాన్నో, ఒక మౌలికాంశ ప్రతిపాదనాన్నో, ఒక సమన్వయదృక్పథాన్నో, ఒక విశిష్ట విశ్లేషణాన్నో, ఒక వివరణాత్మక వ్యాఖ్యానాన్నో, ఒక అపరిష్కృతాంశ పరిష్కారాన్నో సాధించవలె. సిద్ధాంత ప్రతిపాదనలో సిద్ధహస్తుడైన రచయితగా పరిశోధకుడు ప్రకాశించవలె. విశ్వవిద్యాలయ పరిశోధక విద్వాంసుల నుండి ప్రజలు అటువంటి ప్రమాణాలను ఆశిస్తారు. వారిఆశలకు ఆదర్శాలుగా నిలవటమే వీరి రచనల పరమార్థం!

ఈ లక్ష్యంతో-మావిశ్వవిద్యాలయ ప్రాంత కళాశాలల్లో పనిచేస్తున్న అధ్యాపకుల నందరినీ ఉన్నత పరిశోధన ప్రమాణాలు గల వ్యాసాలను వ్రాసి వివేచనకు పంపండి-అని ప్రార్థించినాము. కొందరు తమకృషిని కేంద్రీకరించి తమతమరంగాలలో మేలుబంతులైన అంశాలమీద వ్యాసాలువ్రాసి ఈసంచికకు రూపం తీర్చిదిద్దినారు. విషయ వైవిధ్యం ఈసంకలనంలోని ప్రత్యేకత. ప్రతిపాద్యాంశస్వభావాలనుబట్టి వ్యాసాల్లో భాసించే ప్రక్రియాశిల్పం ఈ సంచిక వ్యక్తిత్వం. వ్యాకరణశాస్త్రానికీ, అలంకారశాస్త్రానికీ సంబంధించిన వ్యాసా

లోకయెత్తు; అముద్రిత గ్రంథ పరిచయం. తాళపత్ర వ్రాతప్రతుల్లోని విశేషాంశాల విశ్లేషణం, భాషాప్రయోగ విశేష వివేచనం, కావ్య ప్రక్రియాసమాలోచనం, చారిత్రకాంశ సమీక్షణం-మొదలైన ప్రక్రియల నాశ్రయించి వెలసిన వ్యాసాలు మరోయెత్తు. వింగడిస్తే ఈ భేదం; కలిపిచూస్తే హరివిల్లు.

మొదటిసంచికలో విశ్వవిద్యాలయానుబంధ కళాశాలలలోని అధ్యాపకులే పాల్గొన్నారు; ఈ సంచికలో జంటనగరాలలోని కళాశాలల అధ్యాపకులు కూడా రచనలు చేసినారు. వచ్చే సంచికకైనా జిల్లాలలోని కళాశాలాధ్యాపకులు కూడా తమవ్యాసాలను తప్పక అందిస్తారని ఆశిస్తున్నాము.

ఈ సంవత్సర నివేదికలో తెలుగుశాఖ పరిశోధనరంగంలో సాధించిన ప్రగతిని సమీక్షించినాము; రాష్ట్రంలో తెలుగుకు ప్రభుత్వభాషాస్థాయి ఏర్పడింది; కాబట్టి. బోధనభాషగా దానిని రూపొందించటం లోనూ, రెండవ భాషగా దాన్ని తప్పక విశ్వవిద్యాలయ విద్యార్థులందరూ అభ్యసించేటట్లు చేయటంలోనూ తీసికొనవలసిన చర్యలపట్ల మా సర్వసభ్యసమావేశం చూపిన నిర్మాణాత్మకమైన ఉద్యమవైఖరిని ఉల్లేఖించినాము; అంతర్విశ్వవిద్యాలయ ఆంధ్రాధ్యాపక సదస్సు ఏర్పడవలెనన్న ప్రగాఢమైన కాంక్షను వెలిబుచ్చినాము. భావికాలంలో తెలుగువారి కృషి ఫలితంగా ఆ ఆదర్శాలు ఎటువంటి రూపాలు దిద్దితీర్చుకొంటాయో పరిశీలించి చూడవలసి ఉన్నది.

ఈ సంచికా ప్రచురణానికి అనుమతించటమే కాకుండా, ఆర్థికసహాయాన్ని అందించిన ఉస్మానియా విశ్వవిద్యాలయానికీ, విశేషించి ఉపాధ్యక్షులు ఆ జి. రామిరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

వ్యాసరచయితలకు, ముద్రాపకులు - మాధవీ ఆర్ట్ ప్రింటర్సు వారికి మా ధన్యవాదములు.

బి. రామరాజు.

# వివేచన - వీచికలు

# షోడశి

## వ్యాసకర్తల పరిచయం

1. కులశేఖరరావు, ఎమ్. డా॥ — ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్సు కళాశాల తెలుగుశాఖలో రీడరుగా పనిచేస్తున్నారు. ఆంధ్రవచన వాఙ్మయ ఉత్పత్తి వికాసాలపై పరిశోధనచేసి 1964 లో పిహెచ్.డి., డిగ్రీ పొందినారు. 'కావ్యానుశీలనం' 'రుచిరాలోకం' మొదలైన వ్యాససంకలనాలను వెలువరించినారు. 'సింహగిరి వచనాల'ను పరిష్కరించి మొదటిసారి ప్రచురించినారు. సంశోధితాంధ్ర మహాభారత సంపాదకవర్గ సభ్యులు. సాహిత్య విమర్శ, పరిశోధన—అభిమానవిషయాలు.

2. కృష్ణకుమారి, నాయని, డా॥ — ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్సు కళాశాల తెలుగుశాఖలో రీడర్. 'జానపద గేయగాథలు' అన్న విషయంపై సిద్ధాంతవ్యాసం వ్రాసి 1970 లో పి హెచ్. డి. డిగ్రీ పొందినారు. 'పరిశీలనము' – వ్యాససంపుటి. 'కాశ్మీరదీపకళిక' (యాత్రారచన-ప్రకటించినారు. జానపద సాహిత్యం, ఆధునికాంధ్ర సాహిత్యం, ఆధునిక భాషాశాస్త్రం – వీటికి సంబంధించిన అంశాలపై వ్యాసాలు వ్రాస్తున్నారు. కవయిత్రి, రచయిత్రి, జానపద సాహిత్య పరిషత్తు అధ్యక్షురాలు. కళలు, సాహిత్యం అభిమాన విషయాలు.

3. గోపాల్ (గోపి)ఎన్. హైద్రాబాదులోని నానక్‌రాం భగవాన్‌దాసు సైన్సు కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. 'ప్రజాకవివేమన' అనే అంశం మీద ప్రస్తుతం పరిశోధన చేస్తున్నారు. 'తంగెడుపూలు' కవితా సంపుటిని ప్రచురించినారు. అభిమాన విషయాలు కవిత, నవత్వం.

4. గోపాలకృష్ణారావు, కే. డా॥ — హైద్రాబాదు సాయంకళాశాల తెలుగు విభాగంలో రీడరుగా పనిచేస్తున్నారు. 'ఆంధ్రశతక వాఙ్మయము ఉత్పత్తి వికాసాలు' అన్న విషయం మీద పరిశోధన చేసి 1965లో

పిహెచ్. డి., డిగ్రీపొందినారు. తెలుగుభాషపై ఉర్దూపారశీకాల ప్రభావాన్ని గురించి గ్రంథంవ్రాసి ఆంధ్ర సాహిత్యఅకాడమీ బహుమానాన్ని పొందినారు ఎన్నోవ్యాసాలు వ్రాసినారు. ఉర్దూ పారశీక సాహిత్యాలను, తెలుగుసాహిత్యాన్ని తులనాత్మకంగా పరిశీలించే ప్రవృత్తి వీరిఅభిరుచి. ఉత్తమ విమర్శకులు.

5. తిరుపతయ్య వి. వి. – హైద్రాబాదులోని ఉస్మానియావిశ్వవిద్యాలయ సైఫాబాదు సైన్సుకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు 'అచ్చతెనుగు-యయాతి చరిత్రము' అనే అంశంమీద పరిశోధన చేస్తున్నారు. ఆంధ్రాధ్యాపనం అభిరుచి.

6. నారాయణ రెడ్డి సి డా॥ — ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రాచార్యులు. ప్రసిద్ధాధునికాంధ్రకవులు. పద్య, గేయ, వచన కవితా ప్రక్రియల్లో సిద్ధహస్తులు, 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయము-ప్రయోగము-అనే సిద్ధాంతవ్యాసం వ్రాసి 1962లో పిహెచ్. డి. డిగ్రీ పొందినారు. మీరట్ విశ్వవిద్యాలయం వీరికి గౌరవ డి. లిట్ పట్టాన్నిచ్చి గౌరవించింది. 'నవ్వనిపువ్వు' రచించిననాటి నుండిప్రతియేటా ఒక కవితాసంకలనం వెలువరిస్తున్నారు. రాష్ట్ర, కేంద్ర సాహిత్య అకాడమీ బహుమాన గ్రహీతలు. 'వ్యాసవాహిని' వారిసాహిత్య వ్యాససంకలనం. నాగార్జునసాగరం, కర్పూరవసంత రాయలు, ఋతుచక్రం, మంటల్లో మానవుడు మొదలైన కావ్యాలెన్నో ప్రసిద్ధ రచనలు. సినీగేయరచనం, సాహిత్యాధ్యాపనం అభిమానవిషయాలు. వీరు కవులు, వక్తలు, విమర్శకులు.

7. భారతి, రావి, డా॥–హైద్రాబాదులోని రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి మహిళాకళాశాలలో ఆంధ్రోపన్యాసకురాలుగా పనిచేస్తున్నారు. 'కృష్ణదేవరాయయుగ ప్రబంధాలలోని భాష' అనే అంశంమీద పరిశోధనచేసి 1975 లో పిహెచ్. డి. డిగ్రీని పొందినారు. ఆంధ్ర భాషాసాహిత్యాల అధ్యయన అధ్యాపనాలు అభిమానాంశాలు.

8. యశోదారెడ్డి, పి. డా॥–హైదరాబాదు సాయంకళాశాల తెలుగు విభాగంలో రీడరుగా పనిచేస్తున్నారు. 'తెలుగులో హరివంశముల' మీద

సిద్ధాంతవ్యాసం సమర్పించి 1969 లో పిహెచ్ డి. డిగ్రీ పొంది నారు. ఆగ్రావిశ్వవిద్యాలయం గౌరవ డి· లిట్. బిరుదాన్నిచ్చి సత్కరించింది. 'కావ్యానుశీలనం' వంటి వ్యాససంపుటులనూ, పారిజాతాపహరణకావ్య విమర్శనూ. పీఠికలనూ, వ్యాసాలనూ, సాహిత్య చరిత్రాంశాలనూ, కథలనూ ప్రచురించినారు. ఉపన్యా సకురాలుగా విమర్శకురాలుగా ప్రసిద్ధినందినారు. శ్రీకృష్ణతత్త్వం, సాహిత్యసేవ అభిమాన విషయాలు.

రాజేశ్వరశర్మ, అమరేశం, డా॥- హైదరాబాదు సాయంకళాశాల తెలుగు విభాగంలో రీడరుగా పనిచేస్తున్నారు. 'ఆంధ్రవ్యాకరణ వికాసం' అన్న సిద్ధాంతవ్యాసం వ్రాసి 1970 లో పిహెచ్.డి., డిగ్రీని పొందినారు. అహోబలపండితీయవ్యాఖ్య వ్రాసినారు. ప్రాకృత సంస్కృతాంధ్ర వ్యాకరణ సంప్రదాయాల్లో కృషిచేసినారు. వ్యాసాలు వ్రాసినారు నన్నెచోడుని కవిత్వం మీద ఒకగ్రంథం రచించినారు. వేదంవారి నాటకాలను సమీక్షించినారు. విమర్శ కులు, పరిశోధకులు. వ్యాకరణశాస్త్రం అభిమానాంశం.

10. రామరాజు, బి. డా॥ -ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్య క్షులు, ఆచార్యులు. 'తెలుగు జానపద గేయసాహిత్యం'మీద పరి శోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగులో మొదటి పిహెచ్.డి· పట్టాన్ని 1956లో పొందినారు. మరుగుపడిన మాణి క్యాలు, తెలంగాణాపల్లెపదాలు, ఉర్దూ – తెలుగు నిఘంటువు, Folk Tales of Andhra Pradesh, Folk-lore of Andhra Pradesh మొదలైన గ్రంథాలను ప్రచురించినారు. ప్రసన్నయాదవ నాటకప్రబంధము, రాఘవాభ్యుదయము, శివరాత్రి మాహాత్మ్యము మొదలైనతెలుగుకావ్యాలను, వసుచరిత్ర, శృంగార శేఖరభాణము, జాంబవతీ పరిణయము, రామాయణసారతిలకము మొదలైన సంస్కృత గ్రంథాలను పరిష్కరించి పీఠికలు వెలయించినారు. ఎన్నో అనువాదాలూ, పరిశోధన వ్యాసాలూ రచించినారు· మడికి సింగన పద్మపురాణ సంశోధిత ప్రతిని సిద్ధంచేస్తున్నారు· ఆంధ్ర మహాభారత సంశోధిత ప్రతి సంపుటాలలో కొన్నింటికి సంపాదక

వర్గసభ్యులుగా ఉన్నారు. కాలగర్భంలో నిద్రపోతున్న తాళపత్ర గ్రంథాలనువెలికి తీసి పరిష్కరించి లోకానికి పరిచయంచేయటం విస్మృతసాహిత్యమైన జానపద వాఙ్మయంలోని మెఱుగులకు వెలుగులు కల్పించటం అభిమాన విషయాలు. పరిశోధకులు, విమర్శకులు, వక్తలు, వచనరచయితలు.

11. రామానుజాచార్యులు, యస్. జి. డా॥ –హైదరాబాదులోని ఆంధ్రప్రాచ్య కళాశాలలో ఉపన్యాసకులు, 'ఆంధ్రాలంకారశాస్త్ర సాహిత్యం' మీద పరిశోధన చేసి 1977 లో పిహెచ్. డి. డిగ్రీ పొందినారు. సాహిత్య కార్యక్రమ నిర్వహణం వీరి అభిరుచి.

12. శివప్రసాద్, ముదిగొండ డా॥ – హైదరాబాదు సాయంకళాశాల తెలుగు విభాగంలో రీడరుగా పనిచేస్తున్నారు. 'ఆధునికాంధ్ర కవిత్వముపై ఉద్యమముల ప్రభావము' అను అంశంపై పరిశోధనచేసి 1971లో పిహెచ్.డి. డిగ్రీని పొందినారు. బసవవచనాలను అనువదించినారు. బసవేశ్వరజీవితంమీద, రచనలమీద పరిశోధన చేస్తున్నారు. కవి, కథానికారచయిత, వక్త, విమర్శకుడు.

13. శ్రీహరి, ఆర్ – ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. 'భాస్కరరామాయణము–విమర్శనాత్మక పరిశీలనము' అనే అంశంమీద పరిశోధన చేస్తున్నారు. సంకేతపదకోశం, వ్యాకరణపదకోశం. లఘుసిద్ధాంత కౌముది – అనే గ్రంథాలను ప్రకటించినారు. వ్యాకరణశాస్త్రం, భాషాశాస్త్రం అభిమానవిషయాలు.

14. సీతాకల్యాణి, వి. డా॥–ఉస్మానియా విశ్వవిద్యాలయ మహిళాకళాశాలలో ఆంధ్రోపన్యాసకురాలుగా పనిచేస్తున్నారు. ఆంధ్రసాహిత్యంలోని చారిత్రకకావ్యాల మీద పరిశోధన చేసి 1973 లో పిహెచ్. డి. డిగ్రీని పొందినారు. చక్కని వచనశైలి వ్రాయగల రచయిత్రి.

15. సుజాతారెడ్డి, ముదిగంటి, డా॥–హైదరాబాదులోని రాజాబహద్దర్ వెంకట రామారెడ్డి మహిళాకళాశాలలో ఆంధ్రోపన్యాసకురాలుగా పనిచేస్తు

న్నారు. మను–వసుచరిత్రల తులనాత్మకపరిశీలన మనేఅంశంమీద పరిశోధనచేసి 1976లో పిహెచ్ డి., డిగ్రీని పొందినారు. పశ్చిమ జర్మనీలోని టుబింగ్ టెన్ యూనివర్శిటీ గ్రంథాలయంలోని ఓరి యంటల్ విభాగంలో లైబ్రేరియన్‌గా రెండేళ్ళు పనిచేసినారు. సాహిత్యం, సాహిత్యశాస్త్రం అభిమాన విషయాలు.

16. సుబ్రహ్మణ్యం. జి. వి. డా॥–ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్సు కళా శాల తెలుగుశాఖలో రీడరు. 'మార్కండేయపురాణము – ప్రబంధ కథామూలము' అన్న అంశంమీద పరిశోధనచేసి 1969లో పిహెచ్.డి. డిగ్రీ పొందినారు. 'సారస్వతసౌరభము' 'నవ్యా లోకము' 'పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు' మొదలైన గ్రంథాలు ప్రచురించినారు. 'ఆంధ్రసాహిత్యంలో వీరరసము'అనే గ్రంథానికి రాష్ట్రసాహిత్య అకాడమీ బహుమానం లభించింది. విమర్శ వ్యాసాలు, పీఠికలు వ్రాస్తున్నారు. యువభారతి ప్రచురణలకు ప్రధాన సంపాదకులు. విమర్శకుడు, వక్త, ఉపాధ్యాయుడు, పరిశోధకుడు. అలంకారశాస్త్రం, నాటకసాహిత్యం అభిమాన విషయాలు.



# ఉస్మానియా విశ్వవిద్యాలయము
# తెలుగు శాఖ

- ప్రచురణలు -

1. సంశోధిత ఆంధ్రమహాభారతము – 8 సంపుటాలు

ఒక్కొక్క సంపుటం వెల రూ 15–00

2. వివేచన

(ప్రతి సంవత్సరం ప్రచురింపబడే పరిశోధన పత్రిక)

1976 – మొదటి సంచిక రూ. 10–00

1977 – రెండవ సంచిక రూ. 10–00

మొత్తం సెట్టుకొంటే 33$\frac{1}{3}$% కమీషను ఇవ్వబడుతుంది.

'భారతం' సంశోధిత కావ్యపాఠం

'వివేచన' పరిశోధన వ్యాస పీఠం

—o—

# అప్పకవీయములోని ప్రాకృత వ్యాకరణ సూత్రములు

—డా. అమరేశం రాజేశ్వరశర్మ

అప్పకవీయము ప్రథమాశ్వాసమునందు తద్భవస్వరూపమును గూర్చి చెప్పు సందర్భమున ప్రాకృత వ్యాకరణ సూత్రములు కొన్ని యుదాహరింపఁ బడి యున్నవి. వానినిగూర్చి పరిశీలించుట యీ వ్యాస విషయము.

ప్రాకృతభాషకు వరరుచి హేమచంద్ర వాల్మీకి ప్రభృతు లెందఱో వ్యాకరణములను వ్రాసియున్నారు. వాల్మీకి రచితములని చెప్పఁబడు సూత్రములకు మొదట వృత్తిని రచించి ప్రసిద్ధినందినవాఁడు త్రివిక్రముఁడు. త్రివిక్రమునివలననే వాల్మీకి గ్రంథమునకు ప్రచారము వచ్చుటచేత కొందఱు త్రివిక్రముఁడే యీ సూత్రములను రచించెనని చెప్పుదురు. త్రివిక్రమవృత్తియం దొకచోట "కేచిత్తు—'కేవలాన స్త్రర్వయోర్ణ వరణవరిణ' ఇత్యేక మేవ సూత్రమాహుః', తన్మతే ఉభావప్యుభయార్థౌ" (త్రివి. 76 పు) అని యితరుల యభిప్రాయము నందు రెండు సూత్రములను గలిపి యొక సూత్రముగా భావించుట కానవచ్చుచున్నదని చెప్పుటచేత త్రివిక్రముఁడే సూత్రకారుఁడనుట పొసగదని మఱికొందఱి యభిప్రాయము. త్రివిక్రముని తరువాత మఱికొంతమంది కూడ నీ సూత్రములకు వృత్తులు వ్యాఖ్యలు రచించినారు. షడ్భాషాచంద్రికయనుపేర వ్యాఖ్య రచించిన లొల్ల లక్ష్మీధరుఁడు తెలుఁగువాఁడు. ప్రాకృతమణిదీపమను పేరఁగల వ్యాఖ్య చిన్నబొమ్మభూపాలకృతముగాఁ జెప్పఁబడియున్నది. ఈ మూఁడును అప్పకవికి ముందుగా వచ్చిన వ్యాఖ్యానములే. ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యాతగా సుప్రసిద్ధుఁడైన యెలకూచి బాలసరస్వతీ మహోపాధ్యాయుఁడును నీవాల్మీకి ప్రాకృత వ్యాకరణ సూత్రములకు 'షడ్భాషావివరణ' మనుపేర వ్యాఖ్యను రచించియున్నాఁడు. ఇది ముద్రితము కాదు. దీని లిఖితప్రతియొకటి అడయారు గ్రంథాలయమునందు భద్రపఱుపఁబడి యున్నది. షడ్భాషా

చంద్రిక షడ్భాషా వివరణము, త్రివిక్రమవృత్తి యను వ్యాఖ్యలు అప్పకవికిఁ బరిచితములయియున్నట్లు ఆతని పూర్వగ్రంథనామ సంగ్రహ వచనము (అప్ప. 1. 5.) వలన స్పష్టమగుచున్నది. ప్రాకృత మణి దీపమును గూర్చి యీ వచనమునఁ జెప్పఁ బడకపోవుటచే దాని నాతఁ డెఱుఁగఁ డని యెంచవలసి యున్నది. ఇట్లే వరరుచి ప్రాకృత ప్రకాశమును గూర్చియు నప్పకవి యీ వచనమునఁ బేర్కొనక పోవుటచే దానిని గూడ నాతఁ డెఱుఁగఁ డని చెప్ప వలయును. హేమచంద్ర ఫక్కికను బేర్కొని దానిని తా నెఱుఁగుదు నని సూచించినను అప్పకవి దానినుండి తన గ్రంథమునందు సూత్రముల నుదాహరించినవాఁడు కాఁడు.

అప్పకవీయమునం దుదాహరింపబడిన ప్రాకృత వ్యాకరణ సూత్రము లన్నియు వాల్మీకి ప్రాకృత వ్యాకరణములోనివే. ఒక్క అప్పకవీయముననే కాదు, తెలుఁగు వ్యాకరణకర్తలలో చాలమంది యుపయోగించిన ప్రాకృత వ్యాకరణము వాల్మీకీయమే. ఆంధ్రశబ్ద చింతామణికర్త, వికృతివివేకకారుఁడు, త్రిలింగ శబ్దానుశాసనకర్త యగు నథర్వణాచార్యుఁడు, మండ లక్ష్మీనరసింహా చార్యుఁడు, అహోబలపతి, బాలసరస్వతి, తాతంభట్టు, మంచెళ్ల వాసుదేవుఁడు మొదలగు నాంధ్ర వైయాకరణుల కందఱకును నీ వాల్మీకి ప్రాకృత వ్యాకరణ పరిచయము మిక్కుటముగా నుండెనని వారి రచనలను చూచినచో స్పష్టము కాఁగలదు. ఇంతే కాదు. ప్రతాపరుద్రయశోభూషణమునకు వ్యాఖ్యయగు రత్నాపణమునందు కుమారస్వామి సోమపీథి యుదాహరించిన ప్రాకృత వ్యాకరణసూత్రము లన్నియు వాల్మీకి ప్రాకృత వ్యాకరణములోనివే. కనుక ఆంధ్రదేశము నందు బహుళప్రచారములో నున్న ప్రాకృత వ్యాకరణము వాల్మీకిదే యని చెప్పవలెను. వాల్మీకి వ్యాకరణ వ్యాఖ్యాతలు కూడ చాలమంది తెలుఁగువారై యుండుట గమనింపఁదగి యున్నది. కనుక అప్పకవి వాల్మీకి సూత్రములను మాత్రమే యుదాహరించుట అప్పటికాలపు సంప్రదాయమున కనుగుణముగానే యున్నదని చెప్పవలెను.

కాని యిటీవలి కాలమున నేమి కారణముననో కాని వాల్మీకి ప్రాకృత వ్యాకరణ ప్రచారము ఆంధ్రదేశ పండితుల యనాదరమునకు పాత్రమయినది. విద్యార్థులును వరరుచి ప్రాకృత వ్యాకరణమును చదువ నారంభించినారు. దీని వలన వాల్మీకి సంప్రదాయము పఠన పాఠనముల నుండి దూరమయినది.

అందువలన వాల్మీకి వ్యాకరణ సూత్రములు ఆంధ్ర లక్షణ గ్రంథోదాహృతము లన్నియు సంస్కరణ భాగ్యమునకు నోచుకొనక తప్పుల కుప్పలుగా మిగిలి పోయినవి. ఆహోబల పండితీయము నందలి వాల్మీకి సూత్రములను నేను పరిష్కరించి ప్రకటించువఱకుఁ బండితులు పాఠము చెప్పునప్పు డెవరి కిష్టము వచ్చినరీతిని వారు దిద్దుచు పాఠములు చెప్పుచుండిరి. ఆ గ్రంథమున కిప్పుడాస్థితి తప్పినది. నేను షడ్భాషాచంద్రికాది గ్రంథములను బరిశీలించి అహోబలపతి గ్రంథస్థసూత్రములను పరిష్కరించినాను. ఇట్లే మంచెళ్ల వాసుదేవకవి రచించిన వైకృత చంద్రికను గూడ నిటీవల నేనును, శ్రీమాన్ యన్. సి. యస్. వేంకటా చార్యులుగారునుకలిసి పరిష్కరించి ప్రకటింపించినాము[1]. అప్పకవీయమునందలి ప్రాకృత వ్యాకరణసూత్రములకు మాత్ర మింతవఱకు నెవ్వరు నిట్టిప్రయత్నము చేసినట్లు కానరాదు. కనుక నా యీ ప్రయత్నము భావిగ్రంథ ముద్రాపకుల కుపయోగ పడవలె నని కోరుచున్నాను.

తెలుగుభాషలోని తద్భవములలో మూఁడువిధము లున్నవి. కొన్ని సంస్కృత మూలము నుండి నేరుగా తెలుఁగునందుఁ గొన్ని మార్పులు చెంది సంస్కృత భవములుగా నేర్పడు శబ్దములు. మఱికొన్ని ప్రాకృతములోనికి సంస్కృతభవములుగా ప్రవేశించి యవి మఱల ప్రాకృత సమములుగా తెలుఁగు లోనికి ప్రవేశించును. ఇవి సాంకేతముగా ప్రాకృతసమము లని వ్యవహరింపఁ బడును. అయినను ఇవికూడ సంస్కృత భవములే. ఇవి కాక ప్రాకృత భవములుగాఁ గూడఁ గొన్ని ప్రాకృతశబ్దములు తెలుఁగులోనికి వచ్చినవి. ఇవి మూఁడవతెగకుఁ జెందినవి. ఈ మూఁడుతెగలకుఁ జెందిన శబ్దములకును మూలము సంస్కృత శబ్దములే కనుక ఇవియన్నియు సంస్కృత భవములే. అయినప్పుడు వీని నన్నింటి నొకే తెగగా నేల చెప్పరాదని యడుగవచ్చును. దీనికి సమాధానముగానే అప్పకవి ప్రథమాశ్వాసము నందు ప్రాకృత వ్యాకరణ సూత్రముల నుదాహరించి వివరించుట.

1. వైకృత చంద్రిక—ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ అండ్ రీసర్చి ఇన్స్టిట్యూట్ వారిచేఁ బ్రకటింపఁబడినది.

"ప్రకృతులను రెంట రెండు రూపములు నమరు
తద్భవములు ప్రత్యేక మాంధ్రంబు లగుచుఁ
జంద్రునకుఁ జందురుం డని సంస్కృతమునఁ
జందుఁ డని ప్రాకృతమున నీచందమునను" (అప్ప. 1-85.)

సంస్కృత చంద్ర శబ్దభవము లయిన రెండు రూపములు తెలుఁగులో నున్నవి 'చందురుఁడు' ఇది సంస్కృత భవము. 'చందుఁడు' ఇది ప్రాకృతసమము. 'చందో' అని దీనికి ప్రాకృతమున వ్యవహారము. ఈ ప్రాకృతరూప మెట్లేర్పడునో వివరించుట కప్పకవి మూఁడు ప్రాకృతవ్యాకరణ సూత్రముల నిచ్చి వివరించినాఁడు. (అప్ప. 31, 32పు.) సముద్రమునకు ప్రాకృతరూపము 'సముద్దో'. తెలుఁగున సముద్ర శబ్ద వికృతి 'సంద్రము'. దీనికి ప్రాకృత సంస్కారము తగులలేదన్నమాట. లక్ష్మి శబ్ద వికృతి ప్రాకృతమునందు 'లచ్చి' యనునది. దీని వికృతి తెలుఁగున 'లచ్చి'. ఇది సంస్కృతభవ ప్రాకృత శబ్దవికృతి యన్నమాట. లక్ష్మియే తెలుఁగులోనికి వికృతిగా వచ్చినచో 'లకిమి' యని కావలసియుండె నని యప్పకవి యభిప్రాయము. (అప్ప. 34పు.) ఈవిధముగా మఱికొన్ని శబ్దములను గూడ నప్పకవి ససూత్రముగా సాధించి యుదాహరించినాఁడు.

నిజమునకు ఈ తత్సమతద్భవ శబ్దములలో మఱికొన్ని తెగలు కూడ నున్నవి. ప్రాకృతభాషయందు మహారాష్ట్రి శౌరసేని, మాగధి, పైశాచి, అపభ్రంశము చూళికా పైశాచియని యాఱుభేదము లున్నవి ఈ యాఱింటినుండియుఁ దెలుఁగులోనికి తత్సమ తద్భవములుగా శబ్దములు ప్రవేశించినవి. అనఁగా నీ పన్నెండు విధముల శబ్దములును సంస్కృత వికృతులును వెఱసి పదమూఁడు విధములగు సంస్కృత భవములు తెలుఁగులో నేర్పడిన వన్నమాట ఈ వివరములను బరిశీలించుట యొక డాక్టరేటు పట్టమునకు సరిపడినంత కృషి. అది యొక మౌలికాంశ పరిశోధనము కూడ. మన వ్యాకరణకర్తలు తత్సమ పరిచ్ఛేదములను రచించిరే కాని తద్భవపరిచ్ఛేదములను వ్రాసినవారు కారు. తత్సమములందును వారు చూపిన దొక్క సంస్కృతసమములను గూర్చి మాత్రమే. సంస్కృత ప్రాకృతముల నుండియే కాదు. ఏ భాషనుండి శబ్దములు వచ్చినను నవి మఱల సమములుగానో భవములుగానో వచ్చుచుండును.

ఆంగ్లములోని హాస్పిటలుకు వికృతి 'ఆసుపత్రి' ప్రసిద్ధముగదా! 'రోడ్డు' మొదలగునవి సమములుగా వచ్చినవికూడఁ గలవు. ఇట్లే కడమభాషల పదములను గూర్చికూడఁ బరిశీలించుట శాస్త్రీయమయిన విధానము. ఇఁక ప్రస్తుత విషయమునకు వత్తము.

అప్పకవి మొత్తము పదునాల్గు వాల్మీకి వ్యాకరణ సూత్రములను వృత్తితో సహితముగా నుదాహరించి వివరించి యున్నాఁడు. ఈ పదునాలిగింటిలో "శేషాదేశ స్యాత్రహోచోఖో:, క్ష:, శషసాశ్చ:, నోణ నో: పైశాచ్యామ్" అను నాలుగు సూత్రములు మాత్రమే తప్పులు లేకుండ ముద్రితములయి యున్నవి. కడమ పది సూత్రములును అపపాఠములతో ముద్రితములయి యున్నవి. వాని సాధుపాఠములను జూపుటకు ముందుగా నిఁకొక్క విషయము నిట ప్రస్తావించవలసి యున్నది.

అప్పకవి ప్రాకృత వ్యాకరణ సూత్రములను వృత్తితోఁ గూడ నుదాహరించె నంటినిగదా! ఈ వృత్తులు త్రివిక్రముని ప్రాకృత వ్యాకరణ వృత్తియందుఁగాని లక్ష్మీధరుని షడ్భాషాచంద్రికలోఁగాని అప్పయదీక్షితుని ప్రాకృత మణిదీపమునందుఁగాని యున్నవి కావు. కనుక ఈ వృత్తుల నాతఁడు బాల సరస్వతి వాల్మీకి సూత్రములకు రచించిన వ్యాఖ్య షడ్భాషా వివరణము నుండి తీసికొని యుండెనేమో యనునదే యది. షడ్భాషా వివరణము ముద్రింపఁ బడలేదు. దీని ప్రతి అడయారు గ్రంథాలయమునం దున్నదని యిదివఱకే వచించితిని గదా! దానిని సంపాదించి ప్రకటించుటకుఁ బ్రయత్నించుట ధర్మము.[2] షడ్భాషా వివరణములోనుండి గ్రహింపలే దని పరిశీలించిన తరువాత తేలినచో అప్పకవియే స్వయముగా వానిని రచించి చేర్చుకొన్నాఁ డని చెప్పవలసి యుండును.[3] ఇందు కొక ఆధారముకూడఁ గానవచ్చుచున్నది. "క్ష:"

---

2. ఈ వ్యాసమును నేను జదివినప్పుడు ఆచార్య శ్రీ బి. రామరాజుగారు ఈ కార్యక్రమమునకయి నన్ను ప్రోత్సహించుటయే కాక నేను మదరాసుకు వెళ్ళి షడ్భాషా వివరణముప్రతిని వ్రాసి తెచ్చికొనుటకు వీలుగా విశ్వవిద్యాలయాధికారులకు సిఫారసు చేసినారు. తత్ఫలితముగా అడయారు లైబ్రరీ ప్రతికి నేనొక ప్రతిని వ్రాసి తెచ్చుకొన్నాను. దీనిని బరిష్కరించి ప్రకటింపవలయునని ప్రయత్నించుచున్నాను.

3. పరిశీలింపగా నొకటి రెండు సూత్రములందు మాత్రమే అప్పకవి షడ్భాషా వివరణ వృత్తులను గ్రహించినట్లు కానవచ్చినది. కడమవాని వృత్తులు అప్పకవి స్వయముగా వ్రాసినట్లు కానవచ్చుచున్నది.

(వాల్మీ. 1. 4. 8.) అను సూత్రమునకు అప్పకవి "క్షస్య ఛస్స్యాత్" అని వృత్తి వ్రాసి తదనుగుణముగానే తెలుఁగర్థము వ్రాసినాడు. దీనికి 'క్షస్య ఖో భవతి' అని త్రివిక్రముఁడును "క్షస్య ఖల్ స్యాత్" అని లక్ష్మీధరుఁడును; 'క్షస్య ఖః స్యాత్' అని అప్పయ దీక్షితుఁడును వృత్తులు వ్రాసి 'క్షయః-ఖఓ' అను దానిని త్రివిక్రమ లక్ష్మీధరులును 'క్షణః ఖణో' అనుదానిని అప్పయ దీక్షితులును ఉదాహరణములుగా నిచ్చిరి. కనుక అప్పకవివృత్తి పైవృత్తి కారుల వృత్తులకు భిన్నముగా నుండుటయేకాక అర్థమును గూడ భిన్నముగాఁ జెప్పుచున్నది. "క్షః" అను సూత్రములోనికేకాక తరువాత మూఁడు సూత్రములలోనికిఁ గూడ 'ఖల్' అనువృత్తిగా వచ్చుచుండుటచేత అప్పకవి ఈ సూత్రవృత్తి ప్రమాదజనితమని చెప్పక తప్పకున్నది.

ఇఁక అప్పకవీయములో తప్పుగా ముద్రితములయి యున్న సూత్రముల నీ క్రింద నుదాహరింతును.

| ముద్రితపాఠము | సరియైనపాఠము |
|---|---|
| i. కగచజటడతదపబమఃకః పశోరుపర్యుద్రే | కగటడతదపఃకఃపోశోరుపర్యుద్రే [4] |
| ii. రవలామధశ్చ | లవరామధశ్చ [5] |
| iii. మనయానామ్ | మనయామ్ [6] |
| iv ద్యర్యోర్జః | ద్యయ్యర్యాం జః [7] |
| v. దస్తస్యశౌరసేన్యామఖావచోస్తాః | దస్తస్య శౌరసేన్యామఖావచోస్తోః [8] |
| vi. శోస్సత్. | శషోస్సః [9] |
| vii. గజడదబఘఝఢధభాంకచటతపాః ఖఛఠథఫాః, | గజడదబ ఘఝఢధభాం కచటతప ఖఛఠథఫాల్. [10] |

4. వాల్మీ. 1–4–77. షడ్భా. చం. 15 పు.
5. వాల్మీ. 1–4–78 షడ్భా. చం. 14 పు.
6. వాల్మీ. 1–4–79. షడ్భా. చం. 13 పు.
వాల్మీ. 1–4–24. షడ్భా. చం. 35 పు.
వాల్మీ. 3–2–1. షడ్భా. చం. 247 పు.
వాల్మీ. 3–2–47 షడ్భా. చం. 258 పు. "శోస్సల్" అని వివరణము.
10. వాల్మీ. 3–2–65 షడ్భా. చం. 262 పు.

అప్పకవీయములోని ప్రాకృత వ్యాకరణ సూత్రములు

| ముద్రిత పాఠము | సరియైన పాఠము |
|---|---|
| viii. అచోస్త్రావ ఖౌఖఛఠథఫాం గఘుదధ బభాః. | అచోస్త్రవో ఖౌకఖతథపఫా గఘ దధబభాన్.[11] |
| ix. ఆదేర్యో జః. | ఆదేర్జః[12] |
| x. క్షః | క్షః కః[13] |

పై సూత్రములలోని యపపాఠములు పరిష్కర్తలు సరిగాఁ జూడక పోవుటచేత దొరలినవే కాని యప్పకవి స్వయముగా వేసినవికావు. నేను సాధుపాఠములుగా నిచ్చినవి త్రివిక్రమ వృత్తి, షడ్భాషాచంద్రిక, ప్రాకృత మణిదీపములను సంప్రదించి యిచ్చిన పాఠములు. వీనిని పండితు లుపయోగించుకొందురనియు ముద్రాపకు లిటుపై ముద్రించునప్పుడు సరిగాఁ బరిష్కరింపించఁగలరనియు భావించుచు దీనిని ముగింతును.

11. వాల్మీ. 3-3-2 షడ్భా. చం. 267 పు.
12. వాల్మీ. 1-3-74. షడ్భా చం. 81 పు.
13. వాల్మీ. 3-2-33. షడ్భా. చం. 254 పు.

# బిరుదు గద్య

—డా॥ ఎమ్. కులశేఖరరావు

కావ్యరచనా సంప్రదాయములు అనేకములు సంస్కృతములోనివి తెలుగు లోనికి ప్రవేశించినవి. ప్రాచీన కాలమున తెలుగు కవులు, రచయితలు, కావ్యమునకు రూపురేఖలు దిద్దుటయందు సంస్కృత కావ్యకర్తలను, లక్షణకారులను ఆదర్శముగా గ్రహించి, వారి అడుగుజాడల యందే అనుగమించిరి. మన కావ్యములందు కాన్పించు వృత్త రచనను పరిశీలించినను, చంపూ మార్గముపై దృష్టి సారించినను, ఈ విషయము స్పష్టమగును. ఇట్లు చెప్పుటవలన, ఆంధ్ర కవులు స్వతంత్ర ప్రవృత్తి కలిగినవారు కారు అని చెప్పుట కాదు. సంస్కృత కావ్య రీతులపై నాధారపడుచునే, ద్విపదవంటి స్వతంత్ర రచన చేపట్టి, ఒక పరిమితమైన పరిధిలో తమ స్వాతంత్ర్యమును వ్యక్తము చేసికొనిరి.

తెలుగు పద్య కావ్యములు సంస్కృత సాహితీ సంప్రదాయములను, లక్షణములను అనుసరించిన విధముగానే, ఆంధ్ర వచన కావ్యములుకూడ చాల సందర్భములందు, సంస్కృత గద్యకావ్య పద్ధతులను పుణికి పుచ్చుకొన్నవి, సంస్కృత గద్యమువలెనే, తెలుగు వచనము, చూర్ణిక, వృత్తగంధి, ఉత్కలికా ప్రాయ మిత్యాదిగా విభాజ్యమగుట, సంస్కృతము నందువలె తెలుగు భాషలో రచయితలు స్తుతి వచనములను రూపొందించుట; గీర్వాణభాషలోవలె తెలుగున చంపూకావ్యరచన చేయుట; మున్నగు విషయములను, దానికి ఉదాహరణములుగా చెప్పవచ్చును. సంస్కృత గద్య భేదములలో బిరుదు గద్యము అను ఒక విశేష గద్యమును, లక్షణకారులు, రచయితలు పేర్కొని ఉన్నారు; అట్టి బిరుదు గద్యను గురించి, తెలుగు కవుల దృష్టియెట్టిది ? ఆంధ్ర లక్షణకారులు దీనిని యే విధముగా నిర్వచించిరి ? ఈ గద్య విశేషమునకు తెలుగు సాహిత్యమునగల స్థాన మెట్టిది ? అను నంశములను చర్చించుటయే యీ వ్యాసోద్దేశ్యము.

బిరుద పదము విరుద అను పదమునకు రూపాంతర మనియు, a laudatory Poem – Panegyric on a prince in prose or verse

అను నర్థముల నిచ్చుచు, మోనియర్ విలియమ్స్ పండితుడు మిథిలాభూపతిపై స్తుతిపూర్వకముగా చెప్పిన రఘుదేవుని బిరుదావళి అనుకావ్యమును లక్ష్యముగా పేర్కొనినాడు. ఈ నైఘంటికుడు బిరుదము అను దానిని, గద్యముకాని, పద్యముకాని, అని చెప్పియుండుటచేత, గద్యముతో దానికి సంబంధమున్నదని స్పష్టమైనది.

సంస్కృత లక్షణకారులలో ప్రముఖుడైన సాహిత్య దర్పణకారుడు 'గద్యపద్యమయీ రాజస్తుతిః బిరుద ముచ్యతే' అని యీ బిరుదమును నిర్వచించెను. రాజస్తుతిప్రధాన మని. దానిని పద్యమునగాని గద్యమునగాని చెప్పవచ్చునని గద్యపద్యములు కావచ్చునని ఈ లక్షణకారుని అభిప్రాయము. దీనికి లక్ష్యముగా, బిరుదమణిమాలా అను కావ్యమును పేర్కొనెను. దీనినిబట్టి యొక విషయము స్పష్టమగుచున్నది. బిరుదము కేవలము, పాఠ్యముగా చెప్పెడి సముదాయము కాదనియు. దీనికి రచనయను సంప్రదాయమున్నదనియు, 'బిరుదమణిమాలా' అనునది లక్ష్యమనియు తెలియవచ్చును. మోనియర్ విలియమ్స్ పండితుడు కూడ బిరుదావళి అను కావ్యమును సూచించుటను ఇచట గమనించవలె.

దీనిని గురించి విద్యానాథుడు తన ప్రతాపరుద్ర యశోభూషణమున నిట్లు చెప్పియున్నాడు—

> వర్ణమానాంక బిరుద వర్ణన ప్రచురోజ్జ్వలా
> వాక్యాడంబర సంయుక్తా సా మతా బిరుదావళీ.

దీనికి,ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణకర్త కీ. శే. చెలమచర్ల రంగాచార్యులవా రిట్లు అనువదించియున్నారు.

> కావ్యవర్ణుండైన కమనీయచరితు- భవ్యబిరుదంబులు బ్రచురమై గ్రాలు
> వరుస నాడంబరవాక్యసంగతుల-సరసప్రవృత్తి నెలంగ బిరుదావళి యగు
>
> ఆ. 2. పేజి. 173.

సాహిత్యదర్పణములో చెప్పిన లక్షణములకంటె, విద్యానాథుడు చెప్పిన లక్షణమున నించుక భేదము కాన్పించుచున్నది. రాజ స్తుతి, గద్య పద్యములలో

చేయవలయునని సాహిత్య దర్పణకారుడు చెప్పగా, విశ్వనాథుడు రాజప్రశంసను గురించి మౌనము వహించెను. వర్ణ్య మానుడెవడైనను కావచ్చును అని యీతని అభిప్రాయమువలె కనిపించును. 'కావ్యవర్ణ్యుడైన కమనీయ చరిత్రుఁడు' అని ఆంధ్రానువాదకుడు వ్రాయుట దానికి స్పష్టతను కలిగించుచున్నది కావ్యమున రాజునే స్తుతి చేయవలయునను నిర్బంధము లేదు కదా; సాహిత్య దర్పణమున లేని మరొక విశేషము, విద్యానాథుడు చెప్పినది వాక్యాడంబరము. అనగా, కేవలము ఒకనిని కావ్యమున వర్ణించుట బిరుదావళి కాదనియు, శబ్దాలంకార సహితముగా నుండెడు వాక్యసముదాయమే బిరుదావళియనియు మనము గ్రహించ వచ్చును. ఇది గద్యమే కానక్కరలేదు అను విషయము కూడ గమనించవలె.

ఇప్పుడు మనము ఆంధ్ర వాఙ్మయమున ఈ బిరుదావళికి ఎట్టి ప్రాముఖ్యమున్నదను విషయమును పరిశీలింతము. సంస్కృత ప్రతాపరుద్ర యశోభూషణము ననుసరించి, తెలుగులో నరసభూపాలీయమును రచించిన మూర్తికవి బిరుదావళిని గురించి యిట్లు లక్షణము చెప్పి యున్నాడు.

'ఆ చక్రవాళ లక్షణ
సూచితమై బిరుద భరిత శుభవాఙ్మయమై
ఆచక్రవాళ విపుల
క్ష్మాచక్రమునందు బిరుదుగద్యము వొల్చున్.'

ఇది ప్రతాపరుద్ర యశోభూషణము నందలి లక్షణమునకు కేవలము అనువాదము కాదని మీరీవరకే గ్రహించి ఉందురు. అచట బిరుదావళి యని యుండగా, మూర్తికవి దీనిని బిరుదుగద్య యని మార్చెను. అనగా ఈ రచనా విభేదముయొక్క పరిధిని సంకుచిత పరచెనన్నమాట. ఇది 'బిరుద భరితముగా' నుండుటయు ననుటలో 'కావ్యవర్ణ్యుండైన కమనీయ చరిత్రు'ని స్తుతి ప్రధానమని చెప్పుట యిందు మూలలక్షణకారునితో నిత దేకీభవించుచున్నాడు. ఇతడు చెప్పిన మరియొక విశేషము, ఇది శుభవాఙ్మయమై యుండవలయునని. మన వాఙ్మయ మంతయు లోకకల్యాణమును ప్రతిపాదించు శుభప్రదమైన కావ్యజాలమే. కాని, ఈ బిరుదుగద్య కేవలము కొన్ని వాక్యముల సమూ

హము కాదు. కావ్య ప్రక్రియవంటిది అను భావమిందు సూచితమైనది. శుభమైన వాక్కులతో నిండినది. 'శుభ వాఙ్మయము' అను దానికి అర్థము చెప్పకూడదా యను ప్రశ్న తప్పక జనించును. కాని, మూర్తికవి ఈ ప్రశ్నమునకు ప్రత్యుత్తర ప్రాయమైన అంశమును సూచించియే యున్నాడు. ఈ బిరుదుగద్యము 'ఆ చక్రవాళ లక్షణ సూచితమై' యుండ వలయునని ప్రారంభముననే చెప్పి యుండుట యిది చక్రవాళ లక్షణమును పోలిన లక్షణము బిరుదుగద్యమునకు కూడ నుండునని యాతని యభిప్రాయము. చక్రవాళ మనునది యొక కావ్య భేదము. దాని లక్షణమును మూర్తికవియే యిట్లు చెప్పి యున్నాడు.

> "ముక్త పదగ్రస్తంబై – సక్తాదిమ పద్యమై ససంబోధనమై
> ప్రోక్తమగు చక్రవాళము – ముక్త మహో (దీర) శబ్ద
> మోహన మగుచున్."

మొదట నొక పద్యము కలిగినదియు, ముక్తపదగ్రస్తమును, సంబోధన సహితమును నగు కావ్యము చక్రవాళము ఇది ప్రోక్తప్రాయమగు కావ్యము మొదట నొక పద్యమని లక్షణము చెప్పుటచేత, మిగిలిన కావ్యము గద్యమయమే. అందుచేతనే దీనికి బిరుద గద్యతో సంబంధము కలదని చెప్పుట. ఈ గద్యము ససంబోధనము గాకుండ కలయునట. మహోదారశబ్ద మోహనముగా నుండవలయునట. అందుచేత ప్రారంభపద్యమును వదలించో బిరుదు గద్యమునకు చక్రవాళమునకు ఏకవాక్యత కుదిరి, అవి పరస్పర సాదృశ్యము కలిగిన కావ్యభేదము లగుచున్నవి.

నరసభూపాలీయమున బిరుదుగద్యకు లక్షణమేకాని లక్ష్యము లేదు.

బిరుదుగద్యను గురించి ప్రముఖ ఆంధ్రలక్షణకారుడు అప్పకవి యిట్లు తెలిపియున్నాడు—

> 'క్షితి మహారాష్ట్రి భాషచే చెప్పబడెడు
> ధీకరోక్తులు బిరుదులై పెక్కు దనరు
> వాని బిరుదావళి యొనర్ప వలయు నంద్రు
> బుధులు సంబుద్ధి పద్యముల్ పొసగ గూర్చి

'సలలిత కావ్య గుంభనల సర్వ విభక్తుల, దీవనంబులన్
జెలువుగ పద్య మొక్కటి రచించిన పిమ్మట గౌడరీతి సం
కలిత చతుష్క షట్క దళ గద్యము లెన్మిదియుం బదారునిం
పలరగ గూర్చి పేర్చి బిరుదావళి చెప్పగ నొప్పు నెంతయున్.'

అప్పకవి చెప్పిన యీ లక్షణమును చూడగా బిరుద గద్య కేవలము గద్యకావ్యము కాదని తెలియవచ్చుచున్నది. ఎందుచేత ననగా; ప్రప్రథమమున సర్వవిభక్తులతో నాశీర్వాద రూపమగు నొక పద్యమును చెప్పవలసియుండునని యీతడు విధించెను. తరువాత గౌడీరీతిలో నాలుగు, లేక ఆరు, లేక యెనిమిద, లేక పదునారు బిరుదు గద్యలు తత్త్రప్రతాప భుజ విక్రమాదుల వర్ణించుచు చెప్పవలెను. ఈ బిరుదములు మహారాష్ట్రభాషామయములని అప్పకవి చెప్పుట విచిత్రముగా నున్నది. మహారాష్ట్రపదములు, వాక్యములు తెలుగు బిరుదుగద్యలో ఎట్లు ప్రవేశించును? అను ప్రశ్నము ఈ లక్షణమునకు క్లిష్టాన్వయమును కలిగించుచున్నది. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగా రీ సమస్యను ఇట్లు పరిష్కరించిరి. 'మహారాష్ట్రభాష యనునది యుపలక్షణము. ఏదేశభాషయం దున్నను, నా బిరుదములను నాంధ్ర సంస్కృతములలోనికి మార్చక, యదేవిధమున వ్యవహరింపవలెను. జగనొబ్బగండ, మూరురాయర గండ, ఉభయరగండ, గండభేరుండాది బిరుద పదములను అట్లే వ్యవహరింపవలెను. వానిని అనువదించరాదు." శ్రీ శాస్త్రిగారి యీ అభిప్రాయము సముచితముగానే కాన్పించుచున్నది.

అప్పకవి బిరుదగద్యము లక్షణమున చెప్పిన గద్య మెట్లుండవలెను? అను ప్రశ్నకు సమాధానమును చెప్పవలసియున్నది. ఈ గద్యము గౌడీరీతిలో నుండుట యొకటి, చతుష్క షట్కదళ గద్యము లుండుట రెండవది. ఇవి యెనిమిది కాని, పదునారు కాని యుండుట మూడవది. ఈ విశేషములు చూడగా లక్షణకారులు చెప్పిన ఉత్కలికా ప్రాయమను గద్యభేదము ఈ లక్షణమునకు సరిపోవుననిపించుచున్నది. దీర్ఘసమాసములుగల గద్యమును ఉత్కలికా ప్రాయమందురు. ఉత్కలిక యను గద్యవిశేషము, ఉదాహరణ కావ్యములం దుండును. దానికి సమానముగా నుండునదే ఉత్కలికాప్రాయము,

ఇన్ని విశేషములు మనకు తెలియవచ్చినను, అప్పకవి చెప్పినది లక్ష

ణమే కాని, అందు లక్ష్యము నుదాహరించలేదు. అందుచేత, బిరుదుగద్య, తెలుగులో ఇటులుండును, అని నిర్దుష్టముగా మనము నిరూపించుట సాధ్యము కాకున్నది. ఐనను, ఏదో ఒక పద్ధతియందు. బిరుదుగద్య రచన యుండి యుండు ననుటలో సందేహములేదు.

ఆంధ్రసాహిత్యమునందు వచనైక కావ్యముల సంఖ్య ప్రాచీన కాలమున చాల స్వల్పము. మహాభారతాది చంపూగ్రంథములందే, మనకు ప్రామాణిక వచన రచన కాన్పించుచున్నది. అందుచే దానియందే ఈ బిరుదుగద్యను వెదకుకొనవలసి యుండునేమో. నన్నయ వ్రాసిన మహాభారతభాగమున, కథా మధ్యభాగములందు సమాసాఢ్యమైన ఉత్కలికాప్రాయమనదగు వచనము లున్నవి. కాని, వానిని బిరుదుగద్యము లనుట సమంజసముకాదు ఇవి, స్తుతి ప్రధానములు కావు. ఇతరలక్షణములును వీనికి పట్టవు. కాని, ఈ పద్యములు, వాని తరువాత వచ్చెడి చిన్నగద్యము పరిశీలించదగినవే.

ఉ. రాజకులాగ్రగణ్య, మృగరాజపరాక్రమ, రాజరాజ, వి
భ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ, ఘో
రాజి ముఖోపలబ్ధ విజయ ప్రమదాశ్రిత బాహుదండ, ని
స్తేజితవైరివీర, కులదీప, మృదప్రియ, విష్ణువర్ధనా.

క. ఆదిక్షత్ర చరిత్రధ – రాదేవాశీః పరంపరావర్ధిత ని
త్యోదయ సత్యోదిత విమ – లాదిత్య తనూజ విక్రమాదిత్యనిభా.

తోటకము : నిరవద్య నరేశ్వర నిత్యనిరం-తర ధర్మమతీగుణధామ జగ
త్పరిపూరితకీర్తి విభాసివిభా-కరతేజ నృపోత్తమ కాంతినిధీ !

ఇది సకల సుకవి వినుత నన్నయభట్ట ప్రణీతంబయిన......

ఇవి ఆదిపర్వ ప్రథమాశ్వాసాంతమునందలి పద్యగద్యములు. ఇవి గౌడీ రీతిలో నున్నవి. సంబోధనాంతముగా నున్నవి. కొంతవర కాశీర్వాదపూర్వకముగా నున్నవి. ఉత్కలికాప్రాయమైన చిన్నగద్యమున్నది. రాజు చేసిన ఘనకార్యములను పద్యములు చెప్పగా, కవిగౌరవమును గద్యము వక్కాణించు

చున్నది. బిరుదుగద్య మనునది తెలుగుభాషలో స్వతంత్రముగా వ్రాయుటలేదు కాబట్టి, కావ్యరచనా సంప్రదాయ ప్రథమాచార్యుడు, వాగనుశాసనుడు నైన నన్నయభట్టు, ఆ బిరుదుగద్యను తన కావ్యమున నిట్లవతరింప చేసినాడని యెందుకు చెప్పకూడదు ? సంస్కృతభాషలో వెలువడిన కావ్యములలో ఆశ్వాసాంతగద్యలు వ్రాయుటకాని పద్యములను సంబోధనాంతముగా లిఖించుటకాని, సంప్రదాయముగా లేదని తెలియవచ్చుచున్నది. అచట లేని నూతన సంప్రదాయము, ఆశ్వాసాంత గద్య పద్యములు, బిరుదుగద్యకు రూపాంతరముగా అవతరించిన వనుటలో వింత యేమియు కాన్పించుటలేదు. ఇట్టి బిరుదుగద్యలు, అన్ని ఆశ్వాసాంతములలో మహాభారతమునందే కాదు. మొన్నమొన్నటివరకు వెలువడిన కావ్యములం దంతటను రచితమై యున్నది. ఈ రచన ప్రధాన కావ్యరచనకు భిన్నమై ప్రత్యేక శైలిని, పద్ధతిని కలిగియుండి, ప్రధాన కావ్యశరీరమునకు ఏ మాత్రమును సంబంధమును కలిగి లేకుండుటచే ఇదియే తెలుగునందలి బిరుదుగద్యమని చెప్పుటకు బలమును కలిగించుచున్నది.

నన్నయ, తనను గురించి చాల స్వల్పముగా చెప్పెడు స్వభావము కలవాడు కాబట్టి, కొన్ని శబ్దములందే గద్యమును రచించియున్నాడు. అందుచేత ఛందోరహిత భాగము చాల చిన్నదిగా కాన్పించును కాని, తరువాతివారగు ప్రబంధకవులలో ఈ గద్యరచన పరిణతిని పొందినది. చూడుడు : "శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది నంది సింగయామాత్య పుత్ర, కౌశికగోత్ర పవిత్రసుజన విధేయ, తిమ్మన నామధేయ......" ఇత్యాది ఇంతేకాదు. సంబోధనాంతమైన పద్యరచనయందును పరిణతి కాన్పించును.

> 'దయమానాక్షివిలోక ః లోకహితకృత్ప్రారంభ ః రంభా కుచ
> ద్వయ దుర్గాధిపతి ద్విషత్పతిత గాధావ్యక్తదోస్సార ః సా
> రయశస్సాంద్ర దిశాంత ః శాంతహృదయారజ్యన్నయాచార ః చా
> రయుతోపాయ విచార ః చారణగణ ప్రస్తూయమానోదయా ;'

అప్పకవి నిర్దేశించిన లక్షణమగు ముక్తపదగ్రస్తమను నియమము కూడ ఈ పద్యమున ఆసాంతము పాటింపబడినది. బిరుదుగద్యవంటి చక్రవాళమున కూడ ముక్తపదగ్రస్తమైన పద్యముండుట లక్షణబద్ధమేకదా !

ఇటువంటి గద్యపద్యములు ఆంధ్రకావ్యప్రబంధములందు బహుళముగా కాన్పించునని విజ్ఞులకు నేను చెప్పనక్కర లేదనుకొందును. ఒక్కమాట, సాహితీ సమరాంగణ సార్వభౌముడు తన ఆ ముక్తమాల్యదాకావ్యములో ఆశ్వాసాంతములో గద్యము వ్రాయలేదు. ఆ ప్రయోజనమును పద్యములతోనే సాధించినాడు.

ఈ బిరుదుగద్య సంప్రదాయము సాహిత్యముతోనే అంతముకాలేదు. సమాజమునందును ఇది ప్రముఖస్థానమునే ఆక్రమించినది. సాహిత్యము సమకాలీన సమాజమును ప్రభావితము చేయుట సామాన్యమేకదా! ఆంధ్రదేశమున కులీన వ్యవస్థ నెలకొని యున్నప్పుడు, రాజుల ఆస్థానములలో నున్న వందిమాగధులు, సార్వభౌముల బిరుదములను, వారు చేసిన ఘనకార్యములను సభాముఖమున నిత్యము పఠించెడివారు. ఇప్పు డా రాజకీయ వ్యవస్థ లేదు వందిమాగధు లదృశ్యమైనారు. వారి బిరుదపాఠములు గాలిలో కలిసిపోయినవి.

అయినను, ఇట్టి బిరుదావళికి సన్నిహితముగా నుండెడి రచనము, ఆనాడు రాజులు. వారి సామంతులు ప్రకటించిన శిలాతామ్రశాసనములందు కనిపించుచున్నది. ఈ వాక్యములు చూడుడు.

"......రుద్రదన రేంద్ర సుపుత్రుండును, సదారాధిత త్రినేత్రుండును. విబుధజన వసంతుడును, రమణీయ సీమంతినీ జయంతుండును, సకల జన మనోరంజనుండును, నరాతిరాజ మదభంజనుండును, శరణాగతరాజ శరణ్యుండును, వినుతాఖిలరాజపరేణ్యుండును, ధైర్యామర సానుమంతుండును, తురగరేవంతుండును సత్యహరిశ్చంద్రుండును, విభవామ రేంద్రుండును నైన గణపతిదేవ మహీనాథునకుం......"

—ఉప్పరపల్లిశాసనము

శాసనరచనమునందు కాకతీయుల కాలములో ప్రారంభమైన యీ బిరుదు గద్య సంప్రదాయము తరువాత కొనసాగి, రెడ్డిరాజులు, విజయనగర ప్రభువులు వేయించిన శాసనములందును బహుళముగా కాన్పించును.

సంస్కృత లక్షణకారులవలె, ఆంధ్రలాక్షణికులు, బిరుదు గద్య లక్షణమును మాత్రము చెప్పి, లక్ష్యము చెప్పలేదని మనము విచారించనవసరము లేకుండునట్లుగా, మన సాహిత్యమునందును, మన శిలాతామ్రశాసనములందును, ఈ బిరుదుగద్య రచనాసంప్రదాయము స్పష్టముగా దర్శన మిచ్చుచున్నది. *

# మనుచరిత్రలో భావికత్వము

—డా. శ్రీమతి ముదిగంటి సుజాతా రెడ్డి

భావికత్వమును గూర్చి మొట్టమొదట ప్రసంగించిన ఆలంకారికుడు-భామహుడు. అతడు భావికత్వమును ఇట్లు వివరించినాడు.

'భావికత్వ మితి ప్రాహుః ప్రబంధవిషయం గుణమ్
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థా భూతభావినః'
(కావ్యా. 3-53)

భూత భవిష్యత్తులు ప్రత్యక్షములో వలె దర్శింపబడినట్లయిన అది భావికత్వము. ఈ భావికత్వము ఏదో ఒక్క పద్యమున గాని సన్నివేశమున గాని ఉండునది కాదు. భావికత్వము ప్రబంధవిషయగుణ మని భామహుని మతము. అనగా అది ప్రబంధమునంతటను కనిపించునట్టిది. ప్రబంధ విషయగుణముగా భామహునిచే భావింపబడిన భావికత్వము ఉద్భటునిచే అలంకారమాత్రముగా అంగీకరింపబడినది. ఉద్భటుడు "భామహవివరణ" మును వ్రాసినవాడు. అది ఈనాడు అలభ్యము. అది పేరునుబట్టి ఒకవేళ భామహుని కావ్యాలంకారమునకు వివరణరూప గ్రంథము కావచ్చును. భామహుని కృతికి వివరణమును వ్రాసిన ఉద్భటుడు తన మరొక అలంకార గ్రంథమైన కావ్యాలంకార సార సంగ్రహమున భావికత్వమును భావికమను పేర అలంకారమాత్రముగా గ్రహించుచు భామహుని నిర్వచనమునే అంగీకరించి ఇట్లు వివరించినాడు.

'ప్రత్యక్షా ఇవ యత్రార్థా దృశ్యంతే భూతభావినః
అత్యద్భుతాః స్యా త్తద్ వాచానాకుల్యేన భావికమ్,'
(కావ్యా. సా. సం. 6-73)

భూతభవిష్యత్తులు ప్రత్యక్షములోవలె ఎట కన్పట్టునో అది భావికాలంకారము. ఉద్భటుని తరువాత రుయ్యకుడు భావికమును అలంకార మనుటను

పూర్తిగా సమర్థించుచు తర్క-వితర్కములచే ఈ వాదమునకు పుష్టిని ఒసగినాడు. మమ్మట విశ్వనాథాదులును భావికమును అలంకారముగానే గ్రహించి వివరించిరి.

భామహుడు భావికత్వమును ప్రబంధ విషయగుణముగా అంగీకరించినను దానిని అలంకారముల వివరణమున తృతీయ పరిచ్ఛేదముననే వివరించినాడు. ఈ కారణముచేతనే కాబోలు ఉద్భటుడు భావికత్వమును భావికమను పేరుతో అలంకార మాత్రముగా గుర్తించు ప్రమాద మేర్పడినది.

"తద్భావికమితి ప్రాహుః ప్రబంధ విషయం గుణమ్"
(కావ్యాదర్శము 2-364)

అని దండియు భావికత్వమును భావికమను పేరుతో భామహుని వలెనే "ప్రబంధ విషయం గుణమ్" అని అంగీకరించినను దానిని అలంకారముల సరసనే ద్వితీయ పరిచ్ఛేదమున వివరించినాడు. భామహుడుగాని దండి గాని ఉద్భటాదుల వలె భావికత్వమునకు లక్షణోదాహరణమును ఈయకపోవుటచే వారు దానిని అలంకార మాత్రముగా కాక కావ్యమంతటికిని సంబంధించిన గుణ విశేషముగా అంగీకరించిరనుట స్పష్టము. కావ్యమంతటిని ఉదాహరించుట సాధ్యము కాదుకదా, ఉద్భటుడు భావికమునకు భామహుడు ఒసగిన నిర్వచనమునే అంగీకరించుచు దానికి అలంకార స్థానమును ఇచ్చినాడు. ఉద్భటాదులచే అలంకార మాత్రముగా అంగీకరింపబడి నిలిచి పోయిన భావికత్వము తన ప్రాధాన్యమును కొంతవరకు కోల్పోయి విమర్శకుల దృష్టినుండి మరుగు పడిపోయినది.

భూతభవిష్యత్తులను ప్రత్యక్షమాణ మొనర్చుటకై తోడ్పడునట్టి కారణ విశేషములను భామహుడు ఈ క్రింది విధముగా పేర్కొనినాడు.

'చిత్రోదాత్తాద్భుతార్థత్వం కథాయాః స్వభినీతతా
శబ్దానాకులతా చేతి తస్యహేతుం ప్రచక్షతే.' (కావ్యా. 3-54)

1) చిత్రమయమైన ఉదాత్తాద్భుతార్థములు 2) కథలో సుబోధకత్వము 3) అనాకులమైన ప్రసన్న పదావళి—ఇవి భావికత్వము యొక్క నిష్పాదక విశేషములు. పైమూడింటిలో ఉద్భటుడు రెండింటినే గ్రహించినాడు.

1) అత్యద్భుతమైన వాణి 2) శబ్దానాకులత (కావ్యా. సా. సం. 6-73). ఉద్భటుడు భావికత్వమును అలంకార మాత్రముగా గ్రహించుటచే కథలో సుబోధకత్వముండవలెనను హేతువు యొక్క అవసరము లేకపోయి నది. రుయ్యక మమ్మటాదులు ఉద్భటుని కారణవిశేషములనే గ్రహించిరి. ఉద్భటుని కావ్యాలంకార సారసంగ్రహమునకు వ్యాఖ్య వ్రాయుచు ప్రతీహా రేందురాజు భామహుని యొక్క భావికత్వ నిర్వచనము గల శ్లోకములను ఉద్ధ రించి భావికత్వమునకు సహాయకములగు విశేషకారణములను చక్కగా వివరిం చినాడు. కవి వర్ణ్యవస్తువు చిత్రమయము (చమత్కారకరము), అద్భుతము, ఉదాత్తము అయియుండవలెను. కాని అతినీరసము, అనద్భుతము, అనుదాత్తముగా ఉండుటకు వీలులేదు. ఇట్టి వర్ణ్యవస్తువును కవి అనాకులమైన ప్రసన్న పద సమూహసహాయమున వర్ణింపవలెను. శబ్దానాకులత్వమును వివరించుచు ప్రతీ హారేందురాజు తన అభిప్రాయమును ఇట్లు వెలిబుచ్చినాడు. "తత్ర వాచామ నాకులతా వ్యస్తసంబంధ రహిత లోకప్రసిద్ధ శబ్దోపనిబంధాత్ ఝుటిత్యర్థ ప్రతీతికారితా" (కావ్యా. సా. సం. 408 పుట) కవి ప్రయుక్త పదములు ప్రసన్నములు, లోకప్రసిద్ధములై ఉండవలెను. వానిచే అర్థము వెంటనే పాఠక హృదయములకు గోచరమగును ఆ విధముగా గోచరమైన భావములను పాఠక సహృదయుడు తన హృదయభావానురూపములుగ అనుభవించును. అనగా తన భావములనే కవి ప్రతిబింబింప జేసినట్లుగ సహృదయుడు భావించును. కవి భావములతో సహృదయుని భావములు అభిన్నములై కవి వర్ణిత వస్తుసము స్తము ఆతనికి కనులముందే కన్పట్టి ప్రత్యక్షమాణమగును.

భామహుడు పై రెండు విశేషములనే గాక కావ్యవస్తువును ప్రత్యక్ష మాణమొనర్చు మరొక విశేషమును "కథాయాః స్వభినీతతా" అని పేర్కొని నాడు. కథ యొక్క స్వభినీతత అనగా కథయొక్క సుబోధకత్వమని అర్థము. సుబోధకమైన కథ అనుట నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తిని స్మరింప జేయుచున్నది.

మను చరిత్రలో పై భావికత్వ మను ప్రబంధ విషయగుణమెంత వరకు కలదో పరిశీలించుట ప్రస్తుత విషయము. చిత్ర, అద్భుత, ఉదాత్తార్థములను కవి వర్ణింపవలెననుట భామహ ఉద్భటాదులు అంగీకరించిన భావికత్వమునకు హేతుభూతమైన మొదటి విశేషము. మను చరిత్ర ఇతివృత్తమే ఉదాత్తమైనది.

అది స్వారోచిషుడను మనువు యొక్క పుట్టుక కథ. కథారంభము ప్రవరుని వంటి ఉదాత్తపాత్రవర్ణనముతో ఆరంభమైనది. ప్రవరుడు సిద్ధుని సహాయమున హిమాలయములను చేరుకొని, అట చిక్కుకొనిపోయి వరూథినిని చూచుట, వారిరువురి నడుమ జరిగిన సంవాదము, అందు శాంతమూర్తి ప్రవరునికే విజయము కలుగుటచే ఐహికభోగములపై మోక్షకాంక్ష విజయము పొందినట్లుగా వర్ణించుట మొదలగు కథాఘట్టములు అద్భుతములు, ఉదాత్తములు. ప్రబంధాంతమున గల స్వారోచిషజననము మొదలగు సమస్త వృత్తాంతములు చిత్రమయములు (చమత్కార జనకములు), అద్భుతములు, ఉదాత్తములు. భావపక్షమును గ్రహించినను మను చరిత్రలోని పెద్దనగారి ప్రతి ఉక్తి, భావములు ఉదాత్తములైనవే. అనుదాత్తములు, అనవసరములైన వర్ణనలు, భావములు పెద్దనలో ఎచ్చటను మచ్చునకైనను కనిపింపవు.

ఉదాత్తములైన వర్ణనలను భావములను అనాకులమైన పద ప్రయోగముతో పెద్దన రసిక హృదయుల ముందుంచినాడు. శబ్దానాకులత్వ మనిన లోక ప్రసిద్ధములైన ప్రసన్న పదములని అర్థము కదా! ఈ రెండును ప్రసాదగుణాంతర్గములే. "ప్రసాదవత్ ప్రసిద్ధార్థమ్" అని దండి. ప్రసాదగుణమే గాక అర్థవ్యక్తి, మాధుర్య గుణములు శబ్దానాకులత్వాంతర్గములే, "అర్థవ్యక్తిః పదానామ్ ఝటిత్యర్థ సమర్పణమ్" అనగా ఝట్టున అర్థస్ఫురణ కావించుటయే అర్థవ్యక్తి. ఝట్టున అర్థస్ఫురణ కావలెనన్న కవితలో ప్రసిద్ధ పదముల కూర్పు, భావాక్లిష్టత ఉండవలెను. ప్రసిద్ధ ప్రసన్న పదముల కూర్పు, భావాక్లిష్టతలను మనుచరిత్రలో అడుగడుగునను చూడవచ్చును. ఇక శిరీషకుసుమపేశలమైన పెద్దన కవితలో చక్కని విడి పదములు గల సరసవాక్యముల రచన గల మాధుర్యగుణమునకును కొరత లేదు. ఈ శైలీగుణములన్నియు పెద్దన కావ్యమున ఝటిత్యర్థస్ఫురణను, తన్మూలమున వర్ణితవస్తుభావములను ప్రత్యక్షమాణమొనర్చుటకును తోడ్పడుచున్నవి.

భామహుడు పేర్కొనిన కథ యొక్క సుబోధకత్వము సైతము మనుచరిత్రలో కలదు. పురాణకవులలో ప్రసన్న కథా కలితార్థయుక్తికి నన్నయ ఎంతటి ప్రసిద్ధుడో ప్రబంధకవులలో పెద్దన అంతటి ప్రసిద్ధుడు. పెద్దన

"అతుల పురాణాగమేతిహాస కథార్థ స్మృతియుతు"డే కాక కథాకథన నిపుణుడు కూడ. సరసమైన సన్నివేశముల కూర్పుతో పెద్దన కథను ప్రసన్న మార్గమున సుబోధకముగా ఎక్కడను అనవసరమైన, క్లిష్టమైన సన్నివేశములు లేకుండ ఔచితీవంతముగా నేర్పుతో నడపినాడు. సంవాద శైలితో కూడిన సన్నివేశములతో మను చరిత్ర కథ రూపకము వలె సాగి పోవును. సంవాదములను రచించు సందర్భమున పెద్దన సహజమైన సరస మైన మాటల పొందికను ప్రదర్శించును సంవాదములలో పాత్రానుగుణమైన భావములసొంపు కలదు. ఉదాహరణకు ద్వితీయాశ్వాసములోని ప్రసిద్ధమైన ప్రవరవరూథినీ సంవాదమును గ్రహింప వచ్చును. ఈ సన్నివేశమున పెద్దన రచించిన అర్థవ్యక్తి ప్రసాదగుణములతో కూడిన మరియు పాత్రల శీలానుగుణములైన సంభాషణల భావములు పాఠక సహృదయుని భావముల తోడ అభిన్నములై ఆ పాత్రలు ముందు నిలిచి సంభాషించుచున్నట్లుగా శ్రవణగోచరము లగుచున్నవి. పెద్దనకవి, తన హృదయాభిప్రాయములనే ప్రతిబింబింపజేసినట్లుగా పాఠక సహృదయుడు భావించి కవితో తాను అభి న్నత్వమును చెందును. దానితో ప్రతి సంభాషణ ప్రత్యక్షముగా వినిపించి ఆనందమును కలిగించును. ఇట్టివే సిద్ధ ప్రవర సంవాదము, వరూథినీమాయా ప్రవరుల సంవాదములు, స్వరోచీమనోరమల ప్రథమ సమాగమము, స్వరోచీ వనదేవతల సంవాదము మొదలగు ఘట్టములు. సంవాదములను రచించునపుడు పెద్దన వాచికాభినయముతో పాటు ఆయా పాత్రల ఆంగికాభినయమును విడువక వర్ణించుట ఒక ప్రత్యేకత. ఉదాహరణకు—ప్రవరుడు "ఈషదంకురిత హసన గ్రసిష్ణుగండయుగళుం"డగుచు సిద్ధునితో మాట్లాడును.

"తన కనుఁగవమెరుగు లుబ్బఁ దాటంకములున్
జనుఁగవయు నడుము వడఁకగ
వనిత సెలవివాఱ నవ్వె......''

వరూథిని ప్రవరునితో "ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు" అని నర్మగర్భముగా పలుకును.

"నిస్పృహత దెలుపు నొక్క చిరునవ్వు"నవ్వి ప్రవరుడు వరూథినితో "ఈ పాండిత్యము నీకుఁదక్క మరి యెందేఁ గంటిమే" అని ఎత్తి పొడుచును.

"కొప్పు సవరించి యొడల్ దీపింప నతనిఁ జుఱచుఱఁ గోపమునన్ జూచి వరూథిని ప్రవరుని ఉపాలంభించును. "కన్నుఁగవ ధవళరుచుల్ గావిగొన నేడ్చి వరూథిని ప్రవరుని నిందించుటకు పూనుకొనును. ఇట్లు అనేక ఘట్టములందు పెద్దన సరళ సుందరశైలిలో ఆంగికాభినయములను సహజముగా వర్ణించి సంభాషణలను శ్రవణగోచర మగునట్లు చేయుటయే గాక ఆయా పాత్రల రూపవిశేషములను పాఠకులకు దృష్టిగోచరమగునట్లు చేయుచు రూపకదర్శనానందము నొసగుచున్నాడు. పెద్దన అంగికాభినయమునే కాక ఆహార్యాదులను వర్ణించి పాత్రలను పాఠకుల ముందు ప్రత్యక్షముగా తెచ్చి నిలుపును. "తత నితంబాభోగ ధవళాంశుకములోని యంగదట్టపు, గావిరంగు పలన..." (2-27) "అర్ధచంద్రుని తేట నవఘళించు లలాటపట్టిఁ దీర్చిన గంగమట్టితోడ..." (3-71) "విసుమానములు గాగ వసతోడఁ బెనవెట్టి నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాడు..." (4-79) "శిఖిపింఛదళ పరిష్కృతములె సేమంతి విరుల తీరగు శిరోవేష్టనములు..." (6-44).

మరియు 6-5, 6-88 పద్యములలో గల ఆహార్యాది వర్ణనములచే పాత్రలు రూపుధరించి పాఠకుల ముందు నిలబడుచున్నవి. అట్లే పెద్దన పాత్రల సాత్త్వికభావములను సైతము సహజ సరళ శైలిలో వర్ణించును. పెద్దన వర్ణించు సాత్త్వికభావములు పాఠక సహృదయునకు రససాక్షాత్కారమును సులభముగా చేయుచున్నవి

"మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతన్. జొనుపన్ గోర్కులు క్రేళ్ళు ద్రిప్ప..." (2-30) అను పద్యమున ప్రవరుని గాంచుచున్న వరూథినిలోని శృంగారభావములు వర్ణింపబడినవి.

"వాడిన మోముఁదమ్మి తెలివాలిక కన్నులు విన్నఁవోవ..." (3-
ఇందు విరహావస్థలో ఉన్న వరూథిని విషాదభావము వర్ణింపబడినది.

"కాంచి కలక్వణత్కనకకాంచికయై యెదురేఁగి యప్పు డక్కాంచన కేతకీ కుసుమగాత్రి..." (3-89) కనబడదు అనుకున్న ప్రవరుని తనముందే చూచినప్పటి వరూథిని యొక్క అద్భుత భావము ఈ పద్యమున వర్ణింపబడినది.

"అనినం జిత్తము జల్లనన్ సౌరుగు నయ్యంభోజపత్రాక్షి లోచన
గోళంబులఁ జిమ్మలై—" (3-136)

అను పద్యమున (మాయా) ప్రవరుడు సెలవు తీసుకొన్నప్పటి వరూథిని దుఃఖము వర్ణింపబడినది.

"అనినం గన్నులు జేవుఱింప నధరం బల్లాడ వేల్లత్పునః
పునరుద్య ద్భ్రుకుటీ..." (5-18)

ఈ పద్యమున ఇందీవరాక్షునిపై ముని ప్రకటించిన కోపావేగము వర్ణింపబడినది. పెద్దన పాత్రల హృదయసంబంధి భావములను ఝటిత్యర్థ స్ఫురణ చేయగల పదములలో వర్ణించి పాఠకుల సహృదయములలో రస సాక్షాత్కారము వెంటనే జరుగునట్లు చేయును.

పెద్దనకు అర్థవ్యక్తి, ప్రసాదగుణములు గల సరళశైలిచే దృశ్యములను వస్తువులను, ఇతి వృత్తములను పాఠకులకు ప్రత్యక్షమాణమొనర్చు ప్రతిభ కలదు. శబ్దానాకులత్వముచే ఒక దృశ్యమును పాఠకులచే ప్రత్యక్షములోవలె నెట్లు ఈ క్రింది పద్యమున దర్శింపజేసినాడో చూడుడు—

'చూచి ఝుళంఝుళ త్కటక సూచితవేగ పదారవిందయై
లేచి కుచంబులున్ దుఱుమ లేనడు మల్లల నాడ నయ్యెడన్
బూచినయొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకన ప్రభా
వీచికలన్ దదీయపదవీకలశాంబుధి వెల్లి గొల్పుచున్' (2-29)

పై పద్యమున ఒక్క సమాసము లేదు. ఝటిత్యర్థస్ఫురణ కావించు శబ్దానాకులత వెల్లివిరిసి కనిపించుచున్నది. పెద్దన సరసమైన వర్ణన వరూథిని నడకను, విలాసమును, లజ్జను ప్రత్యక్షమాణము చేయుచున్నది. వరూథిని కటకములు ఝుళంఝుళమని మ్రోగుచుండగా పోకనునుబోదియ మాటున చేరుట పాఠకులచే రంగస్థలముపై వలె ప్రత్యక్షముగా కవి దర్శింపజేయుచున్నాడు. "ఝుళంఝుళ"మను శబ్ద ప్రయోగము కటకముల మధురధ్వనులను పాఠకులకు ప్రత్యక్ష మొనర్చుచున్నదనిన అతిశయోక్తి కాదు. సహృదయులకు ప్రత్యక్షములో జరుగుచున్నట్లుగా స్ఫురింపజేయు దృశ్య వర్ణనలు గల

పద్యములు మనుచరిత్రలో అనేకములు కలవు. అదే విధముగ పెద్దన ఏ వస్తువును ఏ వృత్తాంతమును వర్ణించినను అది పాఠకులకు అక్షిగోచరమగునట్లు గానే వర్ణించును ద్వితీయాశ్వాసము, పంచమాశ్వాసములోని హిమాలయ మందరగిరుల వర్ణనము, చతుర్థాశ్వాసములోని వేట, పంచమాశ్వాసములోని స్వరోచీ రాక్షసుల యుద్ధము. చతుర్థాశ్వాసములోని మనోరమకథ, పంచమాశ్వాసములోని ఇందీవరాక్షుని శాప వృత్తాంతము, షష్ఠాశ్వాసములోని కళావతి కథ మొదలగునవి కొన్ని ఉదాహరణలు

చతుర్విధాభి నయములతో రూపకము ప్రేక్షకుల ముందు ప్రదర్శింపబడి వారి హృదయములలో రస సాక్షాత్కారమును చేయును. ఉదాత్తార్థములు, సుబోధకమైన కథ, శబ్దానాకులత్వములతో సాధింపబడు భావికత్వము శ్రవ్య కావ్యమును పాఠకులకు ప్రత్యక్షమాణమొనర్చుచు రస సాక్షాత్కారమునకు తోడ్పడును. భూత భవిష్యత్తులను ప్రత్యక్ష మొనర్చుటకై కవికి భావనాశక్తి, పద ప్రయోగ నైపుణి ఉండవలెను. కావ్యమున సమస్త వస్తు వర్ణనలను పాత్రలను భావములను ప్రత్యక్షీకరింపజేయు భావికత్వము ఏ ఒక్క పద్యమున ఉండునది కాక కావ్యమంతటికిని అది ఒక అలంకారము. అట్టి భావికత్వము మనుచరిత్రలో సర్వత్ర వ్యాప్తమై కనిపించును. మనుచరిత్ర తరువాత ముద్దు పలుకులతో కూడిన ముక్కు తిమ్మనార్యుని పారిజాతాపహరణమున భూత భవిష్యత్తులను ప్రత్యక్షమాణముచేయు భావికత్వము కనిపించును. ఈ రెండు ప్రబంధములు బహుళ జనాదరణ పొంది అలరించుటకు భావికత్వమను ప్రబంధ విషయగుణమే ప్రధాన కారణము. అందులో మనుచరిత్రకు భావికత్వము అన్నిటికన్న మించిన అలంకారమై ఒప్పుచు మనుచరిత్రను "మను" ప్రబంధముగా చేయుచున్నది.

*

# ఏకదిన ప్రబంధం

— డా॥ బి. రామరాజు

తెలుగువారికి ఆశుచిత్రకవిత్వాల మీద అభిమానం కొంచెం ఎక్కువ. ప్రాచీనకాలంనుండి ఈనాటి వరకు మన తెలుగు కవులు ఇటువంటి కసరతులు చేస్తునే ఉన్నారు దీనికి కారణం మన సాహిత్యం చాలావరకు రాజాశ్రితం కావటమే అనుకుంటాను. రాజులకూ మంత్రులకూ వారి నాశ్రయించుకొన్న మంత్రిదండనాథులకూ సాహిత్య వినోదం కల్పించటానికి మన పూర్వకవుల్లో కొందరు ఈ ప్రక్రియలను బాగా సాధన చేసిఉంటారు. వీళ్ళ సాధనలు కేవలం తెలుగు కవిత్వానికే పరిమితం కాలేదు. సంస్కృతరచనలు చేసిన తెలుగు వాళ్ళు కూడా తమ పాండితీప్రతిభలకు తార్కాణంగా ఈ వినోదాలు ప్రదర్శించినవారున్నారు. అటువంటివారిలో ఏకదినప్రబంధకర్త ఆలూరి సూర్యనారాయణ వాజపేయయాజి ఒకడు.

రెండవ వెంకటపతిరాయలు విజయనగరసామ్రాజ్యం పాలిస్తున్న (1586–1614) కాలంలో రాయవేలూరును లింగమనాయకుడనే సామంతుడు ఏలుతుండేవాడు ఆతని తండ్రి చినబొమ్మనృపాలుడు (1549–1579) కవి పండితపోషకుడేకాక స్వయంగా గొప్ప గాయకుడు కవి. జయదేవుని గీతగోవిందం వలె ఆతడు రామాయణం ఆరుకాండలు వివిధరాగతాళాలతో గేయాలు, మధ్యమధ్యన శ్లోకాలు కూర్చి సంగీతరాఘవమనే కృతిని సంతరించినాడు. అప్పయదీక్షితులవారిని చాలాకాలం పోషించినాడు. చినబొమ్మనాయకుని కొడుకు లింగయనాయకుడు కూడా మేటి పరాక్రమశాలి; కవిపండితులపాలిటి కల్పతరువు. శిథిలమైపోయిన విజయనగరసామ్రాజాన్ని మళ్ళా ఒక కొలికికి తెచ్చిన ప్రతాపశాలి రెండవ వెంకటపతిరాయలు. అంతటి రాయలనే ఎదిరించి యుద్ధమిచ్చినవాడు లింగమనాయకుడు. వేలూరుకోట విజయనగరసైన్యాలకు కొరుకుడు పడకపోతే, దామెర్ల కరిచెన్ననాయకుడనే విజయనగరసామంత సైనికాధికారి మోసంచేసి ఆ కోటను పట్టుకుంటాడు. అంతటితో ఈ నాయకుల పాలనం వేలూరులో అంతరించిపోతుంది.

లింగయనాయకుని ఆస్థానంలో కవులు పండితులు గాయకులు నర్తకులు అప్పుడప్పుడు విద్యాగోష్ఠులు జరిపేవారు. అట్టివారిలో ఆలూరి సూర్యనారాయణ యజ్వ కొలికిపూస. ఒకనాటి విద్యాగోష్ఠిలో మాటమీదమాట వచ్చి కవిపండితులు పంతాలాడుకుంటారు. ప్రభువు సమక్షంలో ఆస్థానసభ్యులిచ్చిన ఇతివృత్తం స్వీకరించి సూర్యనారాయణయజ్వ ఒక్కనాడే ఒకప్రబంధం సంస్కృతంలో వ్రాస్తానని శపథం చేస్తాడు. చేసిన శపథం మేరకు అశువుగా నన్నూటముప్పై శ్లోకాలతో నాలుగుసర్గల కావ్యం ఏకధాటిగా చెప్పుతాడు. ఈ కావ్యంలోని ఇతివృత్తం అర్జునుడు ద్రౌపదీవిషయమైన సమయభంగం చేసినందుకు తీర్థయాత్రలకై పోయి ఉలూచీచిత్రాంగదా సుభద్రలను వివాహంచేసుకొని రావటం. కవి మాత్రం దీనికి ఏకదినప్రబంధమని పేరు పెట్టుకున్నాడు. ఇది అముద్రితం.

ఆలూరివారి కుటుంబం వైదికకర్మలకూ పాండిత్యానికీ కాణాచి. సూర్యనారాయణ వాజపేయం చేసినవాడు. ఆతని తలిదండ్రులు జ్ఞానాంబా యజ్ఞేశ్వర మహాగ్నిచిత్తులు. ఆ మహాగ్నిచిత్తు మహోపాధ్యాయ బిరుదాంచితుడు కూడా. ఈ విషయాలన్నీ కవి తన ఆశ్వాసాంతపద్యాల్లోను గద్యల్లోను చెప్పుకున్నాడు.

ప్రథమసర్గలో ఇంద్రప్రస్థవర్ణనం, ధర్మరాజు కీర్తిప్రాభవాలూ, పరిపాలనం, అర్జునుడు సమయభంగం చేసినందుకు తీర్థయాత్రలకై బయలుదేరటం, గంగనుండి పాతాళానికి పోవటం, ఉలూచివలన బభ్రువాహనుడు జన్మించటం, అక్కడినుండి కావేరీతీరం రావటం, పాండ్యదేశవర్ణనం, పాండ్యరాజు కూతురు చిత్రాంగదతో ప్రణయం, పంచప్రహదసేవనం, ద్వారకాగమనం ఉన్నవి.

రెండవసర్గలో అర్జునుడు సుభద్రమీది కాంక్షతో ద్వారకబయట ఒక వటవృక్షంక్రిందఉండి శ్రీకృష్ణున్ని స్మరించటం,సత్యభామాకేళీలోలుడైనకృష్ణుడు విజయుని స్మరణం గ్రహించి మందహాసం చేయటం, సత్యభామ అనుమానపడి నవ్వుకు కారణం అడుగటం, కృష్ణుడు యథార్థం చెప్పటం, కృష్ణుడు అర్జునుని దగ్గరికిపోయి సుభద్రాపరిణయానికై ఒక పన్నాగం చెప్పటం, అర్జునుడు కుహనాపరివ్రాజకుడుగా రైవతకాద్రిచెంత ఉండటం, వసంతావిర్భావం, అర్జునుని విరహం, బలరామకృష్ణులు రైవతకాద్రికి పోవటం, కుహనాయతి దర్శనం,

చాతుర్మాస్యాలకు ఆ పరివ్రాజకుని తమ అంతఃపురానికి ఆహ్వానించటం, అంతఃపురోద్యానంలో ఉంచి సుభద్రను పరిచర్యలకై నియోగించటం వారి వర్ణనలు, అర్జునుని విరహం, సుభద్రకు విజయునిమీది ప్రేమ, పరివ్రాజకుడు సుభద్రకు సాముద్రికం చెప్పటం, ఆమెకోరికపై అర్జునుని రూపపరాక్రమాలు వర్ణించటం ఉన్నవి.

మూడవసర్గలో సుభద్ర చెలికత్తె కుహనాయతికి సుభద్ర విరహం వర్ణించి చెప్పుతుంది. యతి సుభద్రతో అర్జునుడు ఆమెకోసం పడే విరహం వర్ణించి చెప్పుతాడు. సుభద్ర ఆతనివద్ద సెలవు తీసుకొని సౌధానికి పోతుంది. వర్షావర్ణనం, వర్షామేఘాలవలన ఆమె విరహం మరింత వృద్ధికావటం, కుహనాయతి పట్టలేక సుభద్రతో తన గుట్టు చెప్పుకోవటం, వాళ్ళ రహఃక్రీడలు వర్ణింపబడినవి.

నాల్గవసర్గలో మాయాపరివ్రాజకుడు మన్మథమంత్రం జపిస్తుంటాడు. బలరామకృష్ణు లాతనికి నమస్కరించి సెలవు తీసుకొని సముద్రద్వీపంలో జరిగే శివుని ఉత్సవాలకు పోతారు. సముద్రవర్ణనం, జలక్రీడలు, శివపూజలు జరుగుతవి. కృష్ణుడు బలరామునికి తెలియకుండా ద్వారక చేరుకొని సుభద్రార్జునుల పెండ్లిప్రయత్నంచేస్తాడు. ఇంద్రుడు, శచీదేవి, బృహస్పతి వచ్చి పెండ్లి జరిపిస్తారు. బలరాము డిది తెలిసి కోపానికి వస్తే కృష్ణుడు శాంతింపజేస్తాడు సుభద్రార్జునులు ఇంద్రప్రస్థానికి బయలుదేరుతారు. సాయంకాల వర్ణనం, చంద్రోదయ వర్ణనం, మార్గమధ్యంలో నూత్నవధూవరుల విశ్రాంతి, శృంగారం, ప్రభాతం, మరల ప్రయాణం, ఇంద్రప్రస్థం చేరుకోవటం, ద్రౌపది సుభద్రను ఆశీర్వదించటం, ధర్మరాజు శ్రీకృష్ణాదియాదవులను రావించి సుభద్రార్జునుల వివాహోత్సవం చేయటం, వధూవరుల ఊరేగింపు, పౌరకాంతలు చూడటం, అందరూ తిరిగి రాచనగరు చేరుకోవటంతో ఈ కావ్యం ముగుస్తుంది ఈ కావ్యంలో ఉలూచీచిత్రాంగదాసుభద్రలు ముగ్గురి ప్రణయవృత్తాంతం ఉన్నా, సుభద్రార్జునుల ప్రణయానికే ఇందులో ప్రాధాన్యం ఎక్కువ. ఇంతఆశువుగా కూర్చిన కావ్యమైనా సాహిత్యసంపదకు సరసభావాలకు అలంకారాలకూ వర్ణనలకూ ఇందులో లోటు లేదు.

ఈ క్రింది ప్రార్థనతో ఏకదినప్రబంధం ప్రారంభమౌతుంది.

స్ఫురతు మే గురురంఘ్రినఖప్రభా
దళితసంతమసే హృదయాంతరే,
అధి కథా కరకంకణకుండలీ
క్వణితశంకితశంకరసంస్తుతః.

భవతు భూపసభా విదుషాం పురః
విదధతః కృతిమేకదినే మమ,
కుశలదాయి శివే తవ వీక్షణం
కుశలమున్మిషితేన జగత్కృతౌ,

అటు తరువాత ఈ క్రింది ఇంద్రప్రస్థవర్ణనతో కథ ప్రారంభిస్తాడు.

కురుకులోద్భవరాజయశస్సుధా
రసవిలిప్తమహీమయదర్పణే
సురపురప్రతిబింబవిలోలితం
విజయతే పురమింద్రపదాంకితమ్. I–3

ధర్మరాజు పరాక్రమప్రాభవాలు వర్ణించే ఈ పద్యం ఎంత సొగసుగా ఉన్నదో గమనించండి.

పుమభిలాషఫలై ర్ధృతమూర్తిభి
శ్చతసృణాం చ దిశాం విజయైరివ,
స హి చతుర్భిరశోభి సహోదరై
ర్హరిరివోచ్చభుజై రతిదుస్సహైః॥ I–37

పుమభిలాషపదంతో చతుర్విధపురుషార్థాలను చెప్పటమేకాక నలుగురు తమ్ములతోడి యుధిష్ఠిరుణ్ణి చతుర్భుజుడైన హరితో పోల్చటం గొప్పగా ఉన్నది.

పాండ్యరాజు కూతురు చిత్రాంగదను వర్ణించే శ్లోకాల్లో ఒకటి.

ముఖరుచిప్రవహల్లహరీ స్తన
క్షితిధరప్రతిఘాతవివర్తితా
ఘురయుగీ పరితస్స్ఫురతి ధ్రువం
భుజయుగీతి భుజంగశిశుభ్రువః I-62

ఇది అల్లసానివారి భ్రుకుటీభుజంగయుగళీ అనే మాటను జ్ఞాపకం చేస్తుంది. ఆ చిత్రాంగదను చూచనప్పటి విజయుని వర్ణించేది ఈ క్రింది శ్లోకం. దీనిలోని అలంకారౌచిత్యం రమణీయం.

ధృతిని ధేరపి వీక్ష్య నృపాత్మజాం
విలులితం హృదయం విజయస్య తాం
అపి శిలోత్తమమిందుమణిం కళా
ద్రవయతే నవనీతవదైందవీ. I-98

అర్జునుడు రైవతకాద్రిచెంత ఉన్నప్పుడు వసంతం వస్తుంది. అంతట కింశుకాలు సహకారాలు పూసినవి. విరహంతో బాధపడే వారికి ఇవి ఇంకా అపకారం చేస్తవి. వాటి పేర్లను కవి ఏ విధంగా చమత్కరించినాడో గమనించండి.

వియోగిహృద్రక్తనిపీతశేష
లేశారుణాస్యే కిల కీరసంఘే
చంచ్వా గుణాత్కింశుకనామయోగ్యే
లేఖాభ్రమేణాజని కింశుకాఖ్యా II-37

స్మరప్రతాపైరివ పల్లవౌఘై
రంగారసంఘాతనిభై రవాపుః
పాంథాన్ వినిర్భిద్య సహస్మరేణ
చూతా యథార్థం సహకారనామ. II-38

ఈ వసంతాగమంతో విజయునికి సుభద్రావిరహం భరింపరాని దౌతుంది. ఆపట్టున వసంతోపాలంభనం చేసే ఈ క్రింది శ్లోకం పండితరాజు "జాత్యా

విహీనో న వివేక్తుమీష్టే" అనే మాటలను తలంపుకు తెస్తుంది. మీదుమిక్కిలి శ్లేషరామణీయకం కూడ దొడది.

స్వకామభాజ్మాధవబద్ధసఖ్య
మప్యర్జునం హంతి ముహూర్వసంతః,
పలాశవర్గస్య వికాశహేతోః
క్వ జాతిహీనస్య భవేద్వివేకః II-47

సుభద్రవిరహావస్థను ఆమె చెలికత్తె కుహనాయతికి దీర్ఘంగా వర్ణించి చెప్పుతుంది. ఇంత ఆశువుగా చెప్పిన కావ్యంలో పదాలపొందిక, నాదసౌందర్యం, అలంకారౌచిత్యం ఎట్లా పాటించినారో గమనించండి.

స్పందమానతరుబృందమంజరీ
స్యందమానమకరందబిందుభిః
దందశూకగరశైరివావృతం
మందవాతమసకృద్భజత్యసౌ. III-13

కంఠసీమని కరోత్యసౌ ముహు
ర్నీలనీరజనిబద్ధమాలికాం,
విభ్రమద్భ్రమరకైతవక్షరత్
క్ష్వేళబిందుమివ కాళభోగినీమ్. III-14

చిత్తభూశరగరున్మరున్నిభ
శ్వాసవీచిభిరతిప్రకంపితమ్,
సా బిభర్తి రతికామనర్తితం
కందుకద్వయమివ స్తనద్వయమ్. III-15

ధ్యానసంభ్రమవదనాకుచస్థలే
వీక్ష్య బింబితమియం నిజాననం,
హంత హంతుమయమంతికాగత
శ్చంద్రమా ఇతి భయేన మూర్ఛతి. III-17

వర్షాకాలవర్ణనం దీర్ఘంగా సాగింది. కవి మనస్సులో ఏ రాజకీయాను భవాలు మెదలినవో కాని ఈ వర్షావర్ణనం గమనించండి.

యత్ర సైకతమభూత్పురా హ్రదః
తత్ర యత్ర స చ తత్ర సైకతమ్,
వ్యత్యయం వ్యతనుతైష వారితో
నూతనప్రభురివాధికారిషు. III-54

కుహనాయతి తన రహస్యం సుభద్రతో ఎంత గడుసుగా చెప్పుకుంటాడో చూడండి.

కేవలం హరిరవైతి మాం ప్రియే
సత్యయా చ సహ భీష్మకన్యయా,
వేష ఏష బలవిప్రలిప్సయా
కల్పితః కమలలోచనేన మే. III-73

ఇక్కడ బలవిప్రలిప్సయా అంటే బలరామవిప్రలంభేచ్ఛయా అని అర్థం.

సుభద్రార్జునుల రహఃక్రీడలను వర్ణించే సరసమధురమైన ఈ పద్యం గమనించండి.

దైవతైర్ద్విజ నిపీడితా సుధా
వాసుదేవసహజాధరే కృతా,
తత్ర చ ద్విజనిపీడితైవ సా
కర్మ నశ్యతి న దేశభేదతః III-92

ఇందులో ద్విజశబ్దంమీద శ్లేష ఉన్నది.

ద్వారకనుండి ఇంద్రప్రస్థానికి బయలుదేరిన సుభద్రార్జునులు మార్గమధ్యంలో ఒక రాత్రి విశ్రమించి తెల్లవారగానే లేస్తారు. అప్పటి సుభద్రావర్ణనం శ్లోకాలు చూడండి.

వాతాహృతనవాంభోజ
సౌరభ్యేన సహార్జునః,

సుభద్రాముఖసౌగంధ్య
తారతమ్యం పరీక్షతే IV-91

లాక్షా లక్ష్మీం దదౌ పాదే
కుంతలే కుంకుమశ్రియం
బాలాతపః సుభద్రాయాః
కర్ణే కమలపూరతామ్. IV-92

కావ్యాంతంలో కవి తన తలిదండ్రుల గూర్చి, తనప్రభువు సభలో చేసిన ప్రతిజ్ఞగూర్చి తన కావ్యరచన గురించి ఇట్లా చెప్పుకున్నాడు.

శ్రీ యజ్ఞేశ్వరయజ్వన స్సితకరాదాలూరివంశాంబుధే
జ్ఞానాంబా సుషువే యమధ్వరివరం శ్రీ సూర్యనారాయణం
తస్య శ్రీమతి లింగయప్రభుసభామధ్యే ప్రతిజ్ఞాకృత
శ్రీ మానేకదినప్రబంధసుకృతౌ సర్గశ్చతుర్థోఽజని IV-115

నాడీభిర్దివసస్య నవ్యమచిరాదవ్యాహతోహాస్పదైః
శబ్దార్థైః ప్రభుసభ్యసమ్మతకథావృత్తక్రమైర్యంత్రితం
యత్కావ్యం నిరమాయి సంప్రతి మయా తస్మిన్ హఠాత్తారతః
ప్రాప్తం దోషముపేక్ష్య కేవలగుణగ్రాహీ బుధస్తుష్యతు. IV-116

స్వస్యగుణావిష్కరణ ప్రయోజనాత్సగౌరవాదపి వా
త్రింశద్ఘటికనిబంధన సాహసతో వా సతాం ముదేస్తుమే
కావ్యమ్. IV-117

ఈ కావ్యాంత గద్యం ఇట్లా ఉన్నది.

ఇతి శ్రీమహోపాధ్యాయ శ్రీమదాలూరి యజ్ఞేశ్వర మహాగ్నిచిత్పుత్రేణ జ్ఞానాంబా గర్భశుక్తి ముక్తామణినా శ్రీ సూర్యనారాయణ వాజపేయయాజినా విరచితాయా మేకదినప్రబంధకృతౌ చతుర్థస్సర్గః

తెలుగువారి అముద్రిత సంస్కృత కృతులెన్నో ప్రాచ్య పుస్తక భాండాగారాల్లో మూలుగుతున్నవి. వాటికి సూర్యాలోకన మెప్పుడో ! *

# రాజరంజన విద్యావిలాస నాటకము

—డా॥ శ్రీమతి పి. యశోదారెడ్డి

జీవితమునకు, యుగధర్మమునకు ప్రతిబింబమువంటిది నాటకము. సద్యోజనితమై తాత్కాలిక సుఖదుఃఖానుభూతిని కలిగింపచేసే సాధనము నాటకము కన్నా మరొక్కటి వేరులేదని చెప్పిన అతిశయోక్తికాదు. అందుకే సాహిత్యములో కావ్యావిర్భావముకన్న నాటకావిర్భావమే ముందు జరిగిఉండు నని ఊహించుట కవకాశమున్నది. ఇట్లే తెలుగు సాహిత్యమునందు సయితము భారతాదులకన్న పూర్వమే విద్యావినోదరూపమైన నాటకవిధాన మొక్కటి దేశీయమై ఉండినది. పాల్కురికి సోమునికాలము నాటికే ప్రజాసామాన్యమున పరంపరాయాతముగ వచ్చుచున్న ఈ దేశినాటకములు 1. భాషాంగక్రియాంగ రూపకములు 2. బహురూపములు 3. చీరమఱుగు బొమ్మల రూపకములు 4. యక్షగంధర్వవిద్యాధరాది పాత్ర ప్రవర్తిత రూపకములు 5. బహునాటక రూపములుగ గుర్తింపబడి ప్రాచుర్యమును పొందిఉండినవి.[1] అయ్యును ఈనాటికిని ఈ దేశినాటక ప్రక్రియకు సమగ్రమైన చారిత్రక యష్టి సమకూర్ప బడలేదు. గ్రంథరూపమందు స్థిరముకాని ఈ ప్రక్రియకు ఆనుపూర్వ్యములను అను సంధించుకొని చరిత్రను నిర్మించుటలో కొంత 'ఊహ'కు తావు కల్పింపవలసినదే. ఈ పరిశీలనలో పరిశోధకుని చేతికి అంది నిలిచినవి యక్షగానములు.

తంజాపురాంధ్ర నాయక రాజులు యక్షగాన నాటకముల నారుపోసి, నీరువెట్టి, పెంచి, ప్రోదిచేసి మంచి పంటనే పండించినారు. రాయల యుగమున ప్రబంధమువలె వీరి యుగమున ఈ ప్రక్రియ సంఖ్యా బాహుళ్యమును, లక్షణ సామగ్ర్యమును సంతరించుకొన్నది. వీరి తరువాత తంజాపురము నేలిన భోసల వంశీయులు సకల భాషాకవితా నిర్వాహకులై తెలుగుభాష నాదరించి స్వీయ ముగా కొన్ని యక్షగాన నాటకముల రచించినారు. అందు ప్రధానముగా ఏకోజీ (వెంకోజీ) దీపాంబికల కుమారుడైన తుళజ మహారాజు (తుక్కోజి) రాజరం

1. పండితారాధ్య చరిత్ర P. 435, 436 బస. పు. P. 124

జన విద్యావిలాస నాటక రచనయందొక క్రొత్తమార్గమును త్రొక్కినాడు. ఈ వైవిధ్యమే ఈ నాటకమునకు ఒక ప్రత్యేకతను, ప్రాధాన్యతను సంతరించి ఈ నావ్యాసరచనకు కారణమైనది.

ఈ మహారాష్ట్రి రాజకవి స్వీకరించిన నాటకవస్తువులో సయితము ఒక నవ్యతను ప్రదర్శించినాడు. ఈ నాటక వృత్తము ఆద్యసత్కథకాని, మిశ్రకథేతివృత్తముకాని కాదు. కేవల కల్పనారూపము. రాజనీతిని అద్వైత తత్త్వరూపములో పొదిగి ప్రదర్శించిన నాటకము. ఈ నాటకములో ఒకే కాణిగట్టిన జోడెద్దులవలె సంసారసన్యాసములు, ఈహానిరీహలు జంటగా పయనించినవి. అయినప్పటికిని కవిదృష్టి మాత్రము మురువైన గార్హపత్యమువైపునకే ములు సూపినది. ఇందలి పాత్రలు దేహధారులైన దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, మానవయోనులు కారు. పశుపక్ష్యాదులు అంతకన్నా కావు. కాని అమూర్తములై ద్రవ్య, గుణసంకేతము కలిగిన ఆత్మ, పరమాత్మ, బుద్ధి, జ్ఞాన, సంతోష మాయాజాలములు ప్రమితవిషయత్వరూపమైన ఈ తత్త్వ సంచయమంతయు సాకారమై స్త్రీ పురుషాది విభేదములతో స్వభావానుగుణములైన చేష్టావిశేషములతో ఆహార్యమును సయితము సంతరించుకొని, నాటక పాత్రలుగా రంగస్థలమును ప్రవేశించినవి. తురీయ పురుషార్థము వైపునకు లోకమును మళ్లించుటకొరకును, మహాపదార్థప్రతిపాదనకొరకును పదార్థత్వమును నాటక పాత్రలుగా మలచుకొని రచన గావించిన ప్రబోధచంద్రోదయకారుని రీతిని ఈ కవి స్వీకరించి పాత్రసృష్టి చేసినప్పటికిని సాధించిన ఫలము మాత్రము వేరు.

దేహగతుడైన జీవుడు నిత్యతను గోరి సుసంస్కృతములైన బుద్ధి, జ్ఞాన సాహాయ్యములతో, సత్యధర్మాదుల సంగతి అరిషడ్వర్గముల నంటక, మాయా వాగురముల జిక్కక, నిస్సంగుడై మసలుచుండినాడు. తన ప్రభావము చెల్లక జీవునితో భంగపడిన మాయ ఆత్మని శరణుచొచ్చినది. మాయా ప్రవేశ మాత్రముచేతనే ఇంతవరకు నిర్గుణుడైన ఆత్ముడు సగుణుడై, ఆమె నాహ్వానించి నాడు. ఈమె అండదండలతో ధైర్యమును పుంజుకొని ఇంతవరకు జీవునిచే నిర్జింపబడి పరసీమల పాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది శత్రుమండలి ఆత్మేశుశరణుజొచ్చినది. అధిపుడైన ఆత్మునిచే అభయముగొనిన మోహుని సామర్థ్యముచే నిస్సంగుడైన జీవరాజు సంసారము నంగీకరించినట్లుగ రతీమన్మథ వివాహము జరిగినది. మాయ జీవునిపై విజయమును సాధించినది.

ఈ నాటకములో ఒకవంక మానవుడు మార్గకుమార్గముల గుర్తెరిగి సంయమనముతో నడుచుటయే ఉత్తమ మార్గమని చూపుచునే, మరొకవంక హితచింతకులు, నయమార్గోపదేశికులైన మంత్రుల సాహాయ్యముతో బలవంతుడు స్థిరుడైన ఒక రాజుపై విజయమును సాధించుటకు, చతురుడు, రాజనీతిజ్ఞుడైన మరొక రాజు అవలంబింపవలసిన మార్గము ప్రదర్శింపబడినది. ప్రసంగవశమున రహస్యభేదనిపుణులు, విద్యాకుశలురు, సర్వకళాపారీణులైన చారులవలని ప్రయోజనములు, జనప్రియుడు కాదలచిన రాజు పాటింపవలసిన విషయములు, స్వపరపక్ష నిర్ణయ సాధనములు, శక్తిత్రయసిద్ధి మొదలైన రాజతంత్ర రహస్యములెన్నో తడవబడినవి. అందుకే కాబోలు, తుక్కోజి ఈ నాటకమునకు 'రాజరంజన విద్యావిలాసము' అను పేరుంచి అన్వర్థము కావించినాడు.

ఉత్తమ కృషీవలుడు ఆయా ఫలజాతుల అంట్లుకట్టి క్రొత్తరకపు పండ్లను పండించినట్లు తుళుజ మహారాజు తన నాటకరచనలో దేశి మార్గ నాటక రీతులను జోడించి యక్షగాన రీతియందే ఒక నవ్యతను ప్రదర్శించినాడు. ఈ నాటకము,

> "శ్రీ సచ్చిదానంద ! శివ ! జగత్కంద
> ...................................
> కరుణించి రక్షించు కరుణాపయోధి"

అను ద్విపదపాదములతో ప్రారంభమైనది. తరువాత "నాంద్యంతే సూత్రధారః" అని ఉన్నది. ఈ విధానము చూడ ఆశీర్నమస్క్రియాది రూపమైన మంగళాచరణము తరువాత రెండవ సూత్రధారుడు ప్రవేశించునట్టి విధానమువలె ఉన్నది. ఇది మార్గనాటక పద్ధతి. ఈ పద్ధతి దేశినాటక క్షేత్రములో అపూర్వము. "నాంద్యంతే సూత్రధారః" వెంటనే వసంత ఋతువర్ణనమున్నది ఋతువర్ణనము 'తరువాతనే సూత్రధారుడు పారిపార్శ్వకునితో కలిసి జరిపిన ప్రస్తావనా రూపమైన సంభాషణమున్నది. ఈ సంభాషణవలన ఈ నాటకము ప్రతివత్సరము తుళుజమహారాజు గావించు ఆదివరాహస్వామి మహోత్సవ సందర్భమున పరమహంసలు, యోగులు, పరమమునులు, పరమవైష్ణవులు, రసికజనులు, విద్వాంసులతో కూడిన సభాసమక్షమున ఆడబడుచుండెడిదని తెలియుచున్నది. సాధారణముగ నాటకములందు అజ్ఞల నిచ్చి ఆదేశించువాడు

సూత్రధారుడుగను—అనుసరించువారు నటీమారిషాదులుగను ఉందురు. కాని ఈ పద్ధతికి భిన్నముగ ఈ నాటకమున పారిపార్శ్వకుడే "ఓయి సూత్రధార ! ఈ నాటకంబునకుంగల కథా సంవిధానంబు గురుస్తుతి పూర్వకంబుగా పలుక రింపవోయి" అని ఆదేశింపగా "మహాభాగ్యమాయనోయి" అని ప్రారంభించిన సూత్రధారుడు సరస్వతీప్రార్థన, ఆదిమకవిస్తుతి, ఏకమహారాజ, దీపాంబికా, శాహా, శరభమహారాజస్తుతి, భూప్రార్థనలతోపాటు పుష్పాంజలిని సయితము సంస్కృత శ్లోకరూపమున కావించినాడు. తరువాత కథాసంగ్రహము ద్విపద పాదములలో నున్నది. ఈ వ్యత్యయమునకు కారణమును ఊహింపగా నా కిట్లు తోచినది. కథాసూత్రమును ధరించువాడు సూత్రధారుడైనప్పటికిని మార్గనాటక ములలో రంగస్థలముపై సభాముఖమున ఆతని పాత్ర బహుస్వల్పము. సంప్ర దాయమును కాపాడుటకొరకై అధికారక సూచకమైన ఈ పాత్రచే ఆదేశింప బడి నటీ మారిషాదులు ప్రవర్తింతురు ప్రస్తుతార్థప్రశంసతో సామాజికులను ఉన్ముఖుల చేయుటతో ఈ భాగము ముగియుచుండును కాని, ఈ నాటకములో ఉన్ముఖీ కరణము సుదీర్ఘమై సాగినది. శ్రవ్యకావ్యములందువలె ఇష్టదేవతాస్తుతి, పూర్వకవిస్తుతి, కవివంశప్రశంస చోటుచేసుకొనినవి. ఈ భాగమంతయు సంస్కృత శ్లోకరూపమున నున్నది. ఒకవేళ ఈ నాటకమున పారిపార్శ్వకుడు కాక సూత్రధారుడే "ఓయి ఈ నాటకంబున గల కథాసంవిధానంబు గురుస్తుతి పూర్వకంబుగా పలుకరింపవోయి" అని ఆదేశించినప్పుడు పారిపార్శ్వకపాత్రయే ఈ సూత్రమును ధరింపవలసివచ్చెడిది. అప్పు డాతడు తెలుగు సంస్కృత భాషలందు ఉచ్చారణశైథిల్యము నెరుగని పాటవము కలవాడై ఉండవలయును. దేశినాటకములలో దేశి, దేవభాషల నెరిగిన పాత్రలను స్వల్పకాల ప్రయోజనము కొరకు ప్రవేశపెట్టుట సుకరముకాదు. అందుకే సర్వసమర్థుడైన సూత్రధారుడే ఈ తంతువును జరిపినట్లు రచించినాడు. ఈమెలకువను పాటించిన కవి నాటక ప్రదర్శన విషయములో సయితము సాఫల్యమును చేకూర్చినాడని చెప్ప వీలగు చున్నది. ఈ విధానమువలన సూత్రధారుడు మధురములును, కావ్యార్థ సూచక ములును అగు శ్లోకములతో రంగమును ప్రసన్నము గావించి కవినామ గోత్రాదు లను కీర్తింపవలయునన్న నియమమును సయితము ఈ కవి పాటించినట్లైనది, ఇదే ఈ 'పాటల ఆట' కూర్పునందలి నవ్యత.

ఈ నాటకమందు సూత్రధారుని పని రంగద్వార, నాంది, ప్రస్తావనల

నిర్వహణతో ముగియలేదు. సూత్రధారు డనగా (1) ప్రధాననటుడు (2) కథా సూత్రమును ధరించువాడు (3) రంగమున నాటక మెల్ల నడుపు వాడని ఉన్న మూడర్థములను ముప్పురులతో పేనిన సూత్రముగా చేసి ఈ నాటకకర్త తన సూత్రధారునిచేతికిట్చినాడు. అందుకే ఈ నాటకమున సూత్రధార పాత్ర ఆద్యంతము అనివార్యమైనది. ప్రస్తావనవంటి సంభాషణాంతదశలో పారిపార్శ్వకుడు "వినవోయి సూత్రధార......శీఘ్రముగా నటనారంభం సేయవోయి" అని చెప్పగా మహాభాగ్యమనుచు "లంబోదరం సకల విఘ్నహరం నమామి" అని విఘ్నేశ్వరప్రార్థన సేయగనే ఆపాత్ర రంగప్రవేశము గావించును. అది చూచి పారిపార్శ్వకుడు "వినవోయి సూత్రధార ః నీవు తలంచగనే విఘ్నేశ్వరుడు వచ్చెను మహాసంతోషమాయనోయి" అను పలుకువెంబడి సంతోషుడను పాత్ర ప్రవేశించును. ఈ విధానము చూడ ఆముఖానంతరము కథోద్ఘాతవిధి ననుసరించి పాత్రప్రవేశ మొనరించినట్లు కానవచ్చుచున్నది. ఈ నాటకమందు కవి అంకవిభజనము సూచింపలేదు. కాని ఆ ట్లంకవిభజనము చేయతలపెట్టినప్పుడు ఈ భాగమును ప్రథమాంక ప్రారంభముగా పరిగణింప వచ్చును.

ఈ నాటకమందు వృత్తవర్తిష్యమాన విషయములు సూచించుటకు తుకుజ మహారాజు అవలంబించిన విధానము క్రొత్త ప్రాతల మేలుకలయికతో విశిష్టముగానున్నది. ఇందు కవిసూచ్యార్థ సూచనకొరకు లాక్షణికమైన విష్కంభప్రవేశకాది రూపమైన అర్థోపక్షేపవిధి నియతముగా పాటించెనని చెప్పవలనుపడదు, కాని, ఆ విధానమునే తలపించెడి మరి వేరొండు సులభమార్గ మిందు గోచరించుచున్నది. ఈ నాటకమంతటికిని ప్రధాననటుడైన సూత్రధారునిచేతనే ఈ కార్యమునయితము సాధింపబడినది. ఉదాహరణమునకు సూత్ర:- "ఇత్తె రంగున స్తుతిచేసిన తదనంతరంబున కథాసంవిధానం బెటువలె నంటేను"అని ప్రారంభించి ప్రధానములైన కథాంశములను రెండుమూడువాక్యములలో విదితము గావించుచు ప్రస్తుతార్థమువరకు గొనివచ్చి తిరిగి ఆ సందర్భములోని పాత్ర ప్రవేశమును సూచించినట్లుగ "ఆత్మమహారాజు సముఖము ప్రతీక్షింపగా నొకనాడు ఆత్మమహారాజు కొలువుకు వచ్చినాడని విని తొలుత మాయాదేవి వచ్చే మార్గం" అను భాగములను పరిశీలింపవచ్చును. ఈ విధానము ఇంద్రజాలమునందువలె ప్రేక్షకుల మనస్సులతో గూడ చూపులను రాబోవుదృశ్యము

వైపు మరలించుచు సూచ్యవస్తుసూచకమైన అంకావతారమును బోలియున్నదని చెప్ప వీలగుచున్నది ఇట్టి సందర్భముల అంకవిభజనమునకు తావున్నది.

ఈ నాటకములో ప్రతి పాత్రప్రవేశమును సూత్రధారుడే సూచించినాడు. ఉదా : కొన్నిచోట్ల, సూత్ర:- "ఆత్మమహారాజు నిజసభకు వచ్చే మార్గం" "కర్మమహారాజు వచ్చేమార్గం", "అధర్ముడు వచ్చేమార్గం" అనియును మరికొన్ని తావుల సూత్ర :- "ఇత్తెఱంగున నాత్మమహారాజు నియోగంబున మోహుడు మోహనయోగివేషంబుఁగైకొని గాత్రపురంబునకుఁ బోవనుద్యుక్తుండై యుండు నవసరంబున ననంతర కథాసంవిధానం బెటువలె నంటేను-గాత్రపురాధీశ్వరుండైన జీవమహారాజు కొలువుకు వస్తున్నాడని హెచ్చరిక దెలుప ధర్ముడు వచ్చే మార్గం" అనియును సూచన లున్నవి. ఈ రెండు పద్ధతులు ప్రేక్షకులకు రంగస్థలముపై ప్రవేశింపబోవు పాత్ర పరిచయము గావించుటకొరకే ఉపయోగింపబడినవి అయ్యును సాధించిన ప్రయోజనములు మాత్రము వేరువేరుగా నున్నవి. సూత్రధారుడు ఒకసారి కథాపరిచయము గావించిన తరువాత సాగివచ్చుచున్న ఆ కథావసరమునందే ఎందరు క్రొత్త పాత్రల ప్రవేశమును సూచించినప్పటికిని ఆ భాగమున అంకవిభజనమునుగాని రంగవిభజనమునుగాని సూచించుటకు వీలులేదు. కాని "అనంతర కథాసంవిధానంబు ఎటువలెనంటేను" అని సూత్రధారుడు పాత్రప్రవేశమును సూచించిన కొన్ని తావులందు మాత్రము అంకవిభజనమునకు చోటున్నదని చెప్పవచ్చును. కవి ఈ నాటకమందు అంకవిభజనమును చేయలేదు కాని వలసినప్పుడు అంక విభజనము చేయుటకు అవకాశము కల్పించినట్లు రచించినాడు. ఈ విధముగా యీ రెండు విధానములు ఒకటి పాత్ర పరిచయ ప్రయోజితమై మరొక్కటి సూచ్యార్థసూచక రూపమై, కథావృత్తమును ఎరుగని ప్రేక్షకులు రంగస్థలముపై జరుగుచున్న ప్రస్తుతార్థమును గ్రహించి ఆకథను పూర్వాపరములతో అనుసంధించుకొనుటకును, ఏ పాత్ర ఏదియో గుర్తెరుంగుటకును అనువుగ మలుచబడినవి. ఈ విధానము దేశి నాటకరచనయం దొక వెలుగుబాటయని చెప్పినచో అతిశయోక్తికాదు.

ఈ నాటకములో పాత్రలకు కొదువలేదు కాని ప్రధానమైన నటనాంశము తప్ప తదితర భాగమంతయు సూత్రధారుడే నిర్వర్తించినట్లుగా కానవచ్చు

చున్నది. ఉదా :-ఒకపాత్ర మరొక పాత్రతో సంభాషింపవలసివచ్చిన సందర్భములందు సయితము సూత్ర :-"అని పలికిన బుద్ధిదేవిని ఆత్మ మహారాజును బొడగనిపించి మాయాదేవి యాత్మరాజుతో పలికే మార్గం" అని చెప్పివెంటనే మాయాదేవి ఇక్కట్టులను చెప్పికొను దరువు ఉన్నది. దీని తరువాత తిరిగి సూత్రధారుడే "అని పలికిన మాయాదేవి దీనవచనంబు లాలకించి యాత్మమహారాజు మోహుని జూచి పలికే మార్గం" అను సూచనయు తరువాత ఆ పాత్ర సంభాషించిన విధానమును ద్విపదపాదములం దున్నది. ఈ విధానమంతటిని చూడగా ఈ నాటకమును కేవల సూత్రధార ప్రయోజితముగా కూడ ప్రదర్శింప వచ్చునని చెప్పుటకు వీలు కలుగుచున్నది. రచనలో జతపడిన ఈ సౌలభ్యము వలన ఒకవేళ ఆంగికాభినయముతోపాటు వాక్పాటవము కలిగిన పాత్ర లభించి నప్పుడు రంగస్థలముపై ఆపాత్రి తన పాత్రను తాను స్వయముగా అభినయింప వచ్చును. లేనినాడు సూత్రధారుడే ఆపద్యములనో దరువులనో పాడి ప్రధానమైన వాచకభాగమును నిర్వహింపగా, ఆపాత్ర, వేషరచన గావించుకొని ఆంగికాభినయముతో రంగస్థలముపై హంగు గావింపవచ్చును. దీనివలన చదువు అంతగా పట్టుబడని ఆయా పాత్రధారులపై భారము తగ్గింపబడినది. కంఠస్థము చేయ వలసిన భాగము తక్కువ కాగా, నటుడు నిర్భీకుడై అభినయద్వారమున చాతుర్యమును వెలయించుచు సభారంజనము చేయగా సుసంస్కృతుడైన సూత్రధారుడు సాహిత్యభాగమున దొసగులు దొరలకుండ సహృదయులను ఆనందింప జేయు అవకాశము లభించినది. ఇంతటి ప్రయోగ సౌలభ్యమును దృష్టియం దుంచుకొనియే తుళజ మహారాజు ఈ నాటకమును సూత్రప్రయోజిత మగునట్లు కూర్చియుండవచ్చునని ఊహించుట కవకాశమున్నది.

ఈ నాటక రచనలో ఛందో సంబంధియైన విశేషము ఎక్కడుగా లేదు. దేశీరీతి ననుసరించి ఆడుటకును, పాడుటకును అనుకూలమైన ఈ నాటకమందు ఆయా తాళగతుల ననుసరించి, ఆహిరి, కేదారగౌడ, పంతువరాళి, కానడ, శంకరాభరణ మున్నగు రాగములలో కూర్చిన దరువు లున్నవి; కంద, సీస, ద్విపద పాదము లున్నవి. అంతేకాని ఏలలు, జోలలు, సువ్వాలు, నివ్వాళులు, సుద్దులు, ఎరుకలు, దండకములు ఈ నాటకములో చోటుచేసికొనలేదు. నాటకాంతమున మంగళహారతి ఉన్నది. ఈ పాట రతీమన్మథ వివాహానంతరము గంధర్వులు పాడిన మంగళరూపమై ఔచిత్యశోభితముగా నున్నది.

అంతేకాక నాటకాంతమునందు కూర్పబడిన ఈ మంగళము "నాటకాభినయ సమాప్తే సామాజికేభ్యో నటే నాశీర్దీయతే" అను సమీచీనమైన సంప్రదాయమును తలపింప చేయుచు మంగళ శ్లోకస్థానమును ఆక్రమించుకొని ఫలవంతమైనది. నిర్వహణ సంధ్యంగములలో ప్రశస్తి నామకమైన చివరి అంగమును గూర్చి భరతుడు-"నృపదేశ ప్రశాంతిశ్చ ప్రశస్తి రభిధీయతే" అనియు "భరతైః చరా చరాణామ్ ఆశీరాశంసనం ప్రశస్తిః స్యాత్" అనియు సింగభూపాలుడు చెప్పిన వాక్యములను పురస్కరించుకొని కూడగా రాజునకును, దేశమునకును, చరాచరములకును ఆశీస్సులను ఆశంసించుచు నటుడు (నటులు) చేయు ప్రశస్తియే భరతవాక్యమని తెలియుచున్నది రాజరంజన విద్యావిలాస నాటకములో సూత్రధారుడు "పేరంటాండ్లు వచ్చిన యాతదనంతరంబున రతీమన్మథులకు యథోక్తంబుగా వివాహము గావించి రా సమయంబున గంధర్వులు మంగళము పాడే క్రమము" — అను సూచనతో నున్నది. జయమంగళము పరమ సుజ్ఞానులైన వారికిని, పలుమారు శివభక్తిబాయక నీతితో నిల నేలు వరభోసలేంద్రుడైన తుళుజమహారాజుకును ఆశీరాశ సనము కావించినది. అందుకే ఈ నాటకమున ప్రధాననటుడైన సూత్రధారునిచే లేదా గంధర్వ పాత్రధారులచే చేయబడిన ప్రశస్తి భరతవాక్యరూపమే అని చెప్పవచ్చును. మంగళాంతముగా సాగిన ఒక నాటకము భరత వాక్యముతో ముగిసినట్లు యీ నాటకము శశికళా భూషణునికి చేసిన మంగళహారతితో సమాప్తమైనది. వృషాంగపదపంకజసేవా ధురంధరుడైన తుళుజమహారాజు నాటకాదియందు ప్రణవస్వరూపుడైన ఏ పరమ శివుని నమస్కరించెనో తిరిగి నాటకాంతమున ఆ చిదాత్మునికి మంగళమును పాడి రెండు ఫలములను చమత్కారముగ సాధించినాడు.

ఈ నాటకములో నీతులు, సామెతలు, పదబంధ విశేషములు, చౌర గూడని పురస్వరూపములు, అధర్మవర్తన ప్రసంగములు, మగ డేలని భార్యల నడవడికలు, విలాసినుల రీతులు, చారలక్షణములు, ధర్మవర్తనలు, యోగి వేషరచనలు మున్నగు విశేషము లెన్నియో ఉన్నవి. కచ్చగట్టుట=పగబూనుట, గుడుగుడుతాగుట=హుక్కాత్రాగుట అను అర్థములో ప్రయోగింపబడిన పదములు పాఠకులకు ఆసక్తిని కలిగించుచున్నవి.

యక్షగాన ప్రక్రియకు వలసినంత చేయూత లభింపగా సమర్థులైన వారి చేతిలో సర్వతోముఖాభివృద్ధిని పొంది పోగలిగినపోకలను పోయి, ఇంతకన్న

మరొక్క మెలకువ ప్రదర్శింప వీలులేనిదిగా పరిణమించిన స్థితిలో మహారాష్ట్రుడైన తుళజ మహారాజు ఆ ప్రక్రియనే చేబట్టి గతానుగతికుడై మూసబోసిన అచ్చుల వంటిరచనలతో యక్షగానములకు మరింత బిగువుగా లక్షణపు కచ్చడాలను బిగించలేను కాని దేశిరూపక విశేషములైన వీధి, భామాకలాపము, తోలుబొమ్మలాట, యక్షగానము కురవంజి మొదలైన నాటకరీతులను, సంస్కృత నాటకలక్షణములను పరిశీలించి అనుకూలమైన సామగ్రిని స్వీకరించి రాజరంజన విద్యావిలాసనాటకమును రచించి క్రొత్త సొమ్మొనరించినాడు. ఈ విధానము వలన తుళజ మహారాజు నాటకమునందు ప్రదర్శన సౌలభ్యమును, పండిత పామరరంజనమును సాహిత్య గౌరవమును ఒక్కచో కాపాడుచు లక్షణము నతిక్రమింపకయే నవ్యతను ప్రదర్శించినాడు. అందుకే యీ గ్రంథమును తుళజ మహారాజ రీతికి లేదా మహారాష్ట్ర రాజ దేశినాటకపురీతికి నాంది అనిచెప్ప సాహసించుచున్నాను.

# దక్కనీ ఉర్దూపై తెలుగు ప్రభావము

—డా॥ కే. గోపాలకృష్ణారావు

ఉర్దూభాషకు పర్యాయ వాచకము లెన్నియో కలవు. అమీర్ ఖుస్రూ కాలము నుండి గత శతాబ్దివరకు కవులు విమర్శకులు ఈ భాషను హిందీ-హిందవీ - దహల్వి-హిందూస్తానీ-ముసల్మానీ-రేఖ్తా దక్కనీ-ఉర్దూ అనునామము లతో వ్యవహరించిరి. వీనిలో ఆసేతుహిమాచలము ఉర్దూ, అను పదమే బహుళ ప్రచారము నొందినది. దీని ఆవిర్భావ వికాసములు-జన్మస్థలకాలాదులను గూర్చి సాహిత్యచరిత్రకారులు విభిన్నరీతులలో తమకు తోచిన సిద్ధాంతములను ప్రతి పాదించినారు. దక్కన్‌లో మహమ్మదీయ జనవ్యవహారమున ప్రచలితమైన భాష దక్కనీ ఉర్దూ. దక్కనీ అనునామాంతరమున వ్యవహృతము. దక్కన్ మండలమున రూపొందిన ఉర్దూభాష దక్కనీ అనియు అది ఉర్దూభాష కేర్పడిన మాండలికభేద మనియు విజ్ఞులమతము. ఉర్దూకంటె దక్కనీకి వైశిష్ట్యముకల దనియు ఈభాషాసాహిత్యములందు వైలక్షణ్యముకలదనియు కొందరి విశ్వాసము.

బహమనీల కాలమున బీజప్రాయముగ నుండి కుతుబుషాహీల కాలమున అంకురమై అనంతరదశలో బహుముఖవికాసమునొందిన దీభాష. దక్కను మండల మీభాషాసాహిత్యములకు కొన్ని శతాబ్దములవరకు ప్రముఖ కేంద్ర ముగా వర్ధిల్లినది. ఈ భాషలో విశిష్టసాహిత్య మావిర్భవించినది. "తూ దక్కనీ హై, ప్యారే ; తూదక్నీచ్ బోల్" అనగా నీవు దక్కనీవాడవైనచో దక్కనీ భాషనే వ్యవహరించు అని ఖురేషీకవి ఉపదేశము. ఈ మండలమువారికి దక్కనీ పట్ల ప్రగాఢమైన అభిమానము. ఉత్తరభారతమున గల పండితులు కొందరు దక్కనీని ప్రశంసించి యుండిరి. ఖాయమ్‌చాంద్‌పురీ అనుకవి 'మీర్' సమకాలికుడు.

ఖాయమ్ : మై గజల్ తౌర్ కియా రేఖ్తా, వర్నా
ఏక్ బాత్ లచర్ సి బజబానె దకనీ థీ.

రేఖ్తాభాషలో గజళ్ళు రచించినను యీ దక్కనీ భాషలో అపూర్వమైన జీవశక్తి కలదని ప్రశంసించెను. దక్కనీభాష అధ్యయన పరిశోధనములకై ఉత్తర భారత విద్యాలయములందు కొన్నిట పీఠములు కూడ ఏర్పడినవి.

ఈ భాషను గూర్చిన మతభేదము లెట్లున్నను దక్కనీ స్థానిక భాషల ప్రభావమున పరిపుష్టమై జీవశక్తిగల భాషగా రూపొంది ఉత్తమ సాహిత్యమును సృష్టించినది. కుతుబషాహీలు స్వస్థానవేష భాషాభిమానులై దక్కనీని పోషించినారు. కుతుబుషాహీల యుగమును దక్కనీ భాషా సాహిత్యములకు స్వర్ణయుగమని కీర్తింప వచ్చును. వజీ-ఇబ్నెనిషాతీ-మహమ్మద్‌కులీ, నుస్రతీ మొదలగు కవులు దక్కనీని అభిమానించి ప్రశస్తకావ్యములను రచించిరి. పండిత విమర్శకు లీభాషను గూర్చి విపులమైన పరిశోధనలు గావించినారు.

దక్కనీ ఆవిర్భావవికాసముల గూర్చి వాదోపవాదము లెట్లున్నను, దక్కనీ మండలములో దీనికి గల ప్రాధాన్యము నెవరును విస్మరించలేరు. ఈ వ్యాసమున దక్కనీ అను పరిభాష సామాన్యార్థమునందే అనగా ఈ మండలమునందు ప్రచులితముగానున్న ఉర్దూ భాష అను అర్థమునందే గ్రహింపబడినది.

దక్కనీ ఉర్దూ తెలుగు సీమలో వికాసమునొందిన భాష కనుక దీనిపై తెలుగుముద్రపడుట సహజము-తెలుగు ఈ మండలమునందలి జన వ్యవహార భాష-ఈ ప్రాంతమున వసించిన మహమ్మదీయు లీభాషతో పరిచితులగుటయు, తెలుగువారికిని, మహమ్మదీయులకును గల సంబంధము సాంస్కృతిక స్థాయి నందుకొనుటయు. స్వాభావికము. కాని దక్కనీ ఉర్దూ, తెలుగు భాషా సాహిత్యముల స్థితిగతులను పరిశీలించినపుడు పరిస్థితు లందులకు భిన్నముగ నుండుట ఆశ్చర్యకరముగ నున్నది. తెలుగుపై ఉర్దూభాషాప్రభావ మమితముగ ప్రసరించినవి. దక్కనీ ఉర్దూపై తెలుగుప్రభావ మన్యభాషలకంటె స్వల్పముగ నుండుటయే చిత్రముగ దోచును. దక్కనీ పై మరాఠీకన్నడముల ప్రభావ మధికముగ ప్రసరించినది. ఉర్దూ మరాఠీలు ఆర్యభాషాకుటుంబమునకు చెందిన భాషలు-అవి ఒక విధముగా సోదర భాషలు-తొలిదశలో రాజకీయముగ మరాఠీలప్రాబల్య మధికముగ నున్నందున వారి భాషాప్రభావము దక్కనీపై పడుట సహజమే. దక్కన్ పై మరాఠీ ద్వార సంస్కృత ప్రాకృతముల ప్రభావము ప్రసరించినది. కనుక ఉర్దూ భాషకు ఆ దశలో మరాఠీ ఒక విధ

మైన అనుసంధాన భాషగ నుపకరించుటవలన దాని ప్రభావము ప్రగాఢమగుటకు ప్రబలకారణమై యుండును. దక్కనీ భాష ఆవిర్భావ దశలో పురిటింటిలో దర్శనమొసగి లాలించినవారు కన్నడులు-కన్నడము ద్రావిడ భాషయైనను దక్కనీపై ఇసుమంత ప్రభావమును కలిగించినది. ఆ తరువాత గణింపదగినది తెలుగు భాషాప్రభావము. ఒకేఒక భౌగోళిక పరిధిలోగల సాహచర్యము-రెండు జాతుల సాంస్కృతిక సంబంధము-కారణములుగ దక్కనీ ఉర్దూ పై తెలుగు ముద్రపడినది. దక్కనీ భాషా సాహిత్యముల వికాసమును దాదాపు మూడు శతాబ్దముల కాలముగ గ్రహింప వచ్చును. దీనిలో బహమనీ, గోలకొండ, సుల్తానుల కాలమును ప్రాచీనకాలముగను, ఆసఫ్‌జాహీల కాలమును ఆధునిక కాలముగను పరిగణింప వచ్చును. ఈదశలలోని భాషాసాహిత్యముల ప్రభావమును పరిశీలించినచో సాహిత్యముకంటె భాషా ప్రభావమే స్వల్పముగ నున్నట్లుతోచును. తెలుగు భాషా సాహిత్యముల అధ్యయనము పట్ల దక్కనీ ఉర్దూవారు అంతగా శ్రద్ధాసక్తులు చూపలేదనియే యీ అంశము నిరూపించుచున్నది.

తెలుగులోని కొన్ని ధ్వనులు-పదబంధములు దక్కనీలో ప్రవేశించినవి. తెలుగు పదములు-పదబంధములు దక్కని కవితారీతులలో మణిప్రవాళ, మిశ్ర భాషా శైలికి దోహదము కలిగించినవి. ఇట్టి ప్రభావము ప్రాచీన దశలో స్వల్పముగను అనంతరదశలో అధికముగను కనిపించును. దక్షిణాపథసముద్రమునందు దక్కనీ ఉర్దూ భాష కొన్ని ద్వీపములవలె భాసించిన దను అంశ మీ సందర్భమున ప్రత్యేకముగ గమనింపదగినది. ఈ ప్రభావము కేవలము అతుకులవలె కనిపించును. పాలు పంచదారలు కలిసినట్లు లేదు.

దక్కనీ ఉర్దూ వర్ణములలో ఎ-ఐలకును, ఒ-ఔలకును మధ్యస్థమగు ధ్వనులు ఏ-ఓ అనునవి విశిష్టములైనవి. ఈ వర్ణములను ధ్వనులను, దక్కనీ వారు కన్నడమునుండి గ్రహించియుందురని కొందరి ఊహ. కాని తెనుగు నుండి గ్రహించియుండుట అసంభవము కాదు. దక్కనీ ఉర్దూవ్యవహర్తలీధ్వనులను సునాయాసముగ వ్యక్తీకరించుటకు, అట్టి వర్ణములుగల పదముల తోడి పరిచయము ప్రధాన కారణముగ గుర్తింప వచ్చును. దక్కనీ ఉర్దూపై తెలుగు ప్రభావము అనుఅంశమును గూర్చి డా. జోర్‌గారు "కులియాత్ ఖులీ"

అను కావ్యమునకు రచించిన పీఠికలో ప్రస్తావించి ఖులిఖుతుబుషా కావ్యము నందును తదితరగ్రంథములందును తెలుగుపదములు గలవని వ్రాసిరి. కాని కులియాత్ ఖులీఅను కావ్యమున ఒకటి రెండు పదములు మాత్రమే కలవు. ప్రాచీన దక్కనీ సాహిత్యమున కుప్ప, కట్ట. దబదబ వంటి పదములు మాత్రమే కనిపించును. మహమ్మద్ఖులీ "ఏమిరే ఏం" అను పదమును ప్రయోగించెను ఆధునిక దక్కనీలోను, మహమ్మదీయుల వ్యవహారమునందును దాదాపు ఏబది పదములు బహుళ ప్రచారము నొందినవి. వానిలో ప్రత్యేకముగ పరిశీలింపదగిన పదము లివి :-

కుప్ప, కట్ట, మోట-బొట్టు-ముంగిస-మెట్టెలు-తాళి-దమ్మిడి-కొంప-గడ్డ-గంజి-గటక-దబ్బన-డబ్బు-గురివింద-మురుకులు-బండి-బండ-కట్ట-కచ్చకాయ-గుడి-ముద్ద-బుట్ట-గుడిసె-మొద్దు-గంప-బిందె-చుక్క-కంద-దబదబ-వగరు-గుండు-బతకమ్మ-దొడ్డ-ఏమి-అయ్యే - కాలు-మొక్క-తల్లి-చెంబు-ఇది-నా-

దక్కనీఉర్దూలో స్వేచ్ఛగా ప్రయోగింపబడిన పదము లివి. ఇందు నామములే బహుళములు. సర్వనామములు-క్రియావాచకములు-విశేషణములు-ధ్వన్యనుకరణ పదములు కొన్నిమాత్రమే కలవు. అపరిచితములగు పదార్థముల నామముల నితరభాషలనుండి గ్రహించునపు డాభాషలోని పదముల నట్లే స్వీకరించుట సాధారణాంశము-కొన్ని సందర్భములలో స్వీకర్తలు తమ భాషలోని వర్ణములు-పదముల స్వభావము ననుసరించి ఎరవు తెచ్చికొనిన పదములను మార్చుచుందురు. ద్రవిడ భాషా లక్షణముల ననుసరించి తెలుగున నొకానొక కాలమున హలంతరూపము లధికముగ నుండెను. అవి కాలక్రమమున అజంతరూపములుగ మారినవి. తెలుగులోని అజంత రూపములను దక్కనీవారు స్వల్పముగ మార్చిరి. పదస్వరూపములో కనిపించు ఈ మార్పులను వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశాది రూపములలో నిరూపించవచ్చును.

మోట-మెట్టెలు-వగరు మొదలగునవి అజంతరూపములు-ఇవి దక్కనీ ఉర్దూలో హలంతములై మోట్-ముంగిస్-మెట్టెల్-వగర్ అనురూపములలో స్థిర పడినవి. పదములే కాక ప్రత్యయములను కూడ వారు హలంత మొనర్చిరి. మెట్టెల్‌లో 'ల్' బహువచన ప్రత్యయము 'లు'. 'ళ' దక్కనీ భాషలో లేదు. అది

'ద' గా మారినది. తాళి, తాడియైనది. కొన్ని ఎకారంతపదములు ఇకా కాంతములుగ ఉచ్చారణ సౌకర్యమును సంతరించుకొనినవి. బిందె-బింది; గుడిసె-గుడిసి; పద మధ్యఅచ్చు లోపించిన రూపములును నిందు కలవు- మురుకులు—ముర్‌కుల్; బతుకమ్మ—బత్‌కమ్మ; అనున విట్టివి.

కుతుబుషాహీ సుల్తానులలో కొందరు యూనానీవైద్య విధానము నభిమా నించి పోషించిరి. యూనానీవైద్యులు దేశీయములైన ఓషధులను, మూలికలను, ఉపయోగించి ప్రశస్తములైన ఔషధములను సిద్ధమొనర్చిరి స్థానికముగ లభించు ఓషధుల నామములను వారు తెలుగు నుండి గ్రహించినట్లు తోచును. కచ్చకాయ- అడ్డసరము అనుపదములు దక్కనీ ఉర్దూలో గజ్జా-అడూసాగా ప్రవేశించినవి- తెలుగుపదములను గ్రహించినపుడు వారు కావించిన మార్పు లెన్నియో విధములుగ నున్నవి. కొన్నింట వర్ణాధిక్యము-ఒకవిధమైన విశ్లేషణము కనిపించును. మొద్దు అను పదము దక్కనీలో మొదలా అయినది. ద్విత్వాక్షరము నుచ్చరించు క్లేశము నిట్లు వారు తొలగించుకొనిరి. దక్కనీ ఉర్దూవారు తెలుగుపదముల కొన్నింటిని నుడికారము, పదబంధముల రూపమున సరస ధోరణిలో గ్రహిం చిరి. ఇవి తెలుగువారి సామాజిక ఆచారవ్యవహారముల ప్రభావమును సూచిం చును. పోయివస్తా- వెళ్ళివస్తా, ఉంటా అను రూపాంతరములతో నున్న పదములను దీనికి తార్కాణముగ గ్రహింప వచ్చును. తెలుగువారు ఒకరిని దర్శించి వెడలునపుడు వస్తా, పోతా అను మాటలను వ్యవహరించరు. పంపించు వారును, పో, అనరు. వచ్చెద, మళ్లీవచ్చెద, వెళ్ళిరమ్ము మళ్ళిరమ్ము-పోయి రమ్ము అని ఈ సందర్భము లందనుట ఆచారమైనది. ఈ విధానమును దక్కనీ ఉర్దూవా రనుసరించిరి. జాకర్‌ఆవో, జాకర్‌ఆయియె, ఫిర్‌ఆనా అను ధోరణి ఈ మండలమునందలి జనవ్యవహారమున మాత్రమే కనిపించును. పోయెద, పోతా, అనునవి ప్రత్యేక సందర్భములందు మాత్రమే వినిపించును. తెలుగు పదములను సరసములైన నుడికారార్థమున పదబంధరూపములుగ సంతరించిన విధ మీసందర్భమున ప్రత్యేకముగ పరిశీలింపదగినది 'చెంబు' అను పదము తామ్రవర్ణముగల పాత్రవిశేషమును సూచించును. ఇతరలోహముల పాత్రల కును నిది అన్వయించును. ప్రత్యేకమైన ఆకారము- మూతిగల పాత్రను చెంబు అని వ్యవహరింతురు. దక్కనీ ఉర్దూవారు నానా విధములుగ రమణీయమైన నుడికారముగ ఈ పదమును మలచినారు. ఈ పదమును దీర్ఘాంతమున చెంబూగా

వారనుకరించి చెంబూ ఆద్మీ-చెంబూసూరత్ చెంబూచాల్ అను విధముగ దానిని విశేషణముగ కొన్ని నామములకు సంతరించిరి. చెంబూ-చెంబూఆద్మీ ఏకార్థ బోధకములు. ఆకారమునందును, ముఖమునందును అసామాన్యమైన కవళికగల వ్యక్తిని, గుణమునందు చిత్రమైన వక్రరీతులుగల వానిని చెంబూ లేక చెంబూ ఆద్మీగా వ్యవహరించుట పరిపాటి. అనిష్టుడైన వ్యక్తిని స్వప్రాంతీయేతరుని పరిహాసధోరణిలో 'చెంబూ' అందురు. చెంబూచాల్ అనగా చిత్ర, వక్రగతి. బతకమ్మ అను పదమును కూడ దక్కనీ ఉర్దూవారిట్లే మార్చిరి. తెలుగువారు ఆనందోత్సాహములతో జరుపుకొను పండుగ ఇది. ఈ పదము దక్కనీ ఉర్దూలో బతకమ్మ దేఖ్నా-బతకమ్మ దిఖానా, బతకమ్మ బతానా వంటి జాతీయములైనవి. బతకమ్మ దేఖ్నా అనగా తమాషా చూచుట, బతకమ్మబతానా అనగా తమాషా చూపించుట, ఏడిపించుట. ఆధునిక ఉర్దూకవు లీ పదమును తమగేయములందు స్వేచ్ఛగా ప్రయోగించిరి. ఈనుడికారార్థము తెలుగువారి వ్యవహారమునందును బహుళముగ వినిపించును. ఇట్లే తెలుగులోని సామాన్యవాక్యములు దక్కనీ ఉర్దూలో నుడికారార్థము నొందినవి. సగము సగము ఒకటి అనునది ఉర్దూ ఆధా ఆధా ఏక్ అయినది సామాన్యార్థముకంటె భిన్నమైన అర్థమున నిది ప్రయుక్తము-నాశనష్టము. లౌకటియే-అందరు సమానులే-అను అర్థములం దీ పదమును వారు గ్రహించిరి "కుల్లం కుల్లం ఒకటీ" అను ప్రయోగ మీ సామ్యముననే రూపొందినది. కులము కులము ఒకటి అనునది దీనికి ప్రకృతి. ఒకే వర్గమువారు జాతివారు కలిసిమెలిసి యుందురని దీని భావము. అనుకూల భావములు కల భిన్నవర్గీయులను, ఒకవ్యక్తి తనవారి పక్షమువారిని చేరిన సందర్భములందును, వారి నుద్దేశించినపుడు కుల్లము కుల్లము ఒకటి అని వ్యంగ్యముగా వ్యవహరింతురు.

మిశ్ర పదములు- జంట పదములు మున్నగు వానితోడను దక్కనీ ఉర్దూవారు కొన్ని కొన్ని పదబంధములను కూర్చిరి పాప్-బేచారా - పక్కా-పండు-కుప్పాహోనా-చిటుకు పొటుకు-కామ్‌పడ్నా అను ప్రయోగము లిట్టివి. పక్కపండు అనగా పరిపక్వస్థితి నొందిన ఫలము. అవసానదశలో నున్న వ్యక్తిని, ఇపుడో అపుడో రాలనున్న వ్యక్తిని పక్కాపండు అని దక్కనీలో అందురు. చిటుకు చిటుకు ధ్వన్యనుకరణ శబ్దము—చీటికి మాటికి అను అర్థము ప్రయుక్తము - కుప్పాహోనా శక్తిమంతమైన నుడికారము-సర్వనాశన మగుట

అని అర్థము. తెలుగులోని నుడికారములను అనుకరణప్రాయముగను దక్కనీ వారు గ్రహించిరి జుట్టు పకడ్నా, జుట్టూ దబానా, అనునవి ఇట్టివి భావాను కరణముగల మరికొన్ని ప్రయోగములు గమనింపదగినవి. బల్బ్బవేయుట అను ప్రయోగము ననుసరించి వారు గోలా డాల్నా అందురు. బల్బ్ లగానా సరియైన అనువాదము. ఖానా డాల్నా, బిస్తర్‌పై గిర్నా, బండి చఢనా, రాస్తా పకడ్నా అనునవి ఇట్టివే. అన్నము వేయుట, శయ్యపై పడుట, బండి ఎక్కుట, త్రోవ పట్టుట అను పదములు వీనికి మూలములు.

తెలుగు ప్రభావము వలన దక్కనీకవు లొకవిధమైన మిశ్రభాషాశైలి ననుసరించిరి. ఉర్దూ పారశీకములు రాజభాషలుగ సాహిత్యభాషలుగ రాణించిన కాలమున తెలుగు కవులు వాని ప్రభావమునొంది తెలుగులో మణిప్రవాళ శైలిని ఒక విధమైన మిశ్ర భాషాశైలిని పాటించి కృతులను రచించియుండిరి. ఈ విధానమే నేటి ఉర్దూ కవులలో కనిపించుచున్నది. తెలుగు రాష్ట్రభాష-జన వ్యవహార భాష కనుక ఈ ప్రాంతము నందలి దక్కనీ కవులపై దాని ప్రభావము ప్రసరించుట సహజము. దక్కనీ జానపదగేయములందును ఈ అనుకరణము స్వల్పముగా నున్నది.

క్యా పకాయిగె సద్దనా
చింతాచిగుర్ బైగనా

అను గేయ చరణము లిట్టివి. "అమ్మా తల్లీ క్యా ఖూబ్ గాయా బజాయా" అను భాగము లీ అంశమునే సూచించును. తెలుగు పదములను స్వేచ్ఛగా ప్రయోగించిన కవులలో సర్వర్ డండా, సులేమాన్ ఖతీబు అను కవులు ప్రముఖులు. ఒకానొక జానపద గేయమున ఒక నాయిక తన అత్తగారిని ఎద్దులబండితో పోల్చినది. "సాస్ మేరీ బైల్‌కిబండి" అని. నజీర్ అహమ్మదు దహఖాని అను కవి "ఇప్లీకే మొద్దే" అని ప్రయోగించెను మొద్దు అను పదము ఓకని మొద్దేగా మార్చెను. సర్వర్ డండా కవి "ఇదేనా మా దేశం" అను శీర్షికతో దక్కనీ ఉర్దూ భాషలో సరసమైన గేయములు రచించెను. 'ఇదేనా మా దేశం, ఇదేనా మా దేశం' అను భాగ మీ గేయమునందు పల్లవిగా ప్రయుక్తము.

సదాఁ మేరె గావుఁపర్ గుర్బత్‌కా మోసమ్
న ఫాఖోఁసే పురసత్ నదమ్ మేఁచ్ హై దమ్.
యాఁ లుంగీభీ గత్‌నేఁ వాఁ జన్‌కో హై రేషమ్
"ఇదేనా మాదేశం-ఇదేనా మాదేశం"

"దేశమ్" అను శబ్దమును కవి పాదాంతప్రాస సామ్యమున కుపయోగించెను. ఈ గేయమునందే ప్రాసాంతము నందు "దయ్యమ్" అను శబ్దమును కవి ప్రయోగించెను. "జాఁ ఆద్మికే భేసాఁమే రహ్తాహైఁ దయ్యమ్". మామా గారూ అను పదముల నిట్లే ఒకానొక కవి పాదాంత ప్రాసలం దుపయోగించెను. ఆధునిక ఉర్దూ కవులు తెలుగుభాషలో ప్రవీణులు కాకున్నను జనవ్యవహారమున నున్న పదములను తమకు పరిచితములైన తెలుగు శబ్దములను గేయభాగము లలో ప్రాసలుగా పొదుగుట ప్రశంసార్హము. దక్కనీ కవులు తెలుగు భాషా సాహిత్యములతో పరిచితులైనపుడు ఇంకను ఇట్టి ప్రయోగములను చేయవచ్చు నను సూచనలు కనిపించుచున్నవి. నాలుగు శతాబ్దముల నుండి తెలుగు వారి తోడి పరిచయమును వారీవిధముగ సద్వినియోగ మొనర్చికొనిరి.

# వేమన పద్యాల పరిష్కరణ - బ్రౌన్ కృషి

—శ్రీ ఎన్. గోపాల్ (గోపి)

వేమన పద్యాల ప్రతులను గూర్చి ముచ్చటించేటప్పుడు ఆంధ్ర వాఙ్మయోద్ధారకుడూ, మహనీయుడూ అయిన సి. పి. బ్రౌన్‌కు చేయెత్తి నమస్కరింపక తప్పదు తాళప్రతులను సేకరించి, వాటికి కాపీలు వ్రాయించి. పాఠభేదాలను పోల్చిచూచి. శుద్ధ పాఠాలను నిర్ణయించి, ముద్రిత ప్రతులను నిర్మించడంలో ఆయన చేసిన కృషి అనితర సదృశమైనది. ఇప్పటి వరకు నాకు లభించిన ఆకరాల వెలుగులో వేమన పద్యాలను గూర్చి బ్రౌన్ చేసిన పరిశ్రమనూ, సేవనూ స్థూలంగా వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం.

వేమన పద్యసంపుటాల ప్రతులు మద్రాసు ప్రాచ్యలిఖితగ్రంథాలయంలో 54 దాకా ఉన్నాయి.[1] వాటిలో 33 తాళప్రతులు. 16 కాగితపు (లిఖిత) ప్రతులు. ఈ 38 తాళప్రతుల్లో దాదాపు అన్నీ బ్రౌన్ సేకరించినవే.[2] 38 ప్రతుల్లోని పద్యాలన్నీ ఎత్తివ్రాయిస్తే యేర్పడినవే 16 కాగితపు ప్రతులు. తాళప్రతులన్నింటిలోని పద్యాలన్నింటిని లెక్కిస్తే వచ్చే మొత్తం సంఖ్యకూ లిఖిత ప్రతుల్లోని మొత్తం సంఖ్యకూ చెప్పుకోదగినంత భేదం కనపడదు.[3] దీనివలన తాళప్రతుల్లోని పద్యాలన్నింటినీ లిఖితప్రతుల్లోని కెక్కించి ఉంటారని ఊహించవచ్చు. వేమనను గూర్చి బ్రౌన్ మొదటిసారి 1824 లో

---

1. లైబ్రెరీలో వీటి నెంబర్లు D 1721 నుండి D 1774 వరకు

2. ఈ తాళప్రతులన్నీ తిరుపతి రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కి తరలించబడినాయి. D 1739, D1762 నెంబర్లుగల ప్రతులు తిరుపతిలో లేవు. వాటికి బదులు 2949,2950 నెంబర్లతో ఉన్నాయి. ఇవికూడ బ్రౌన్ సేకరించినవే అని వాటిపైన దాఖలాలున్నవి.

3. తాళప్రతుల్లోని పద్యాల మొత్తం = 16061, లిఖితప్రతులలోని మొత్తం ౹లు=15852.

విన్నాడు.[4] విన్నదే తడవుగా గ్రంథ సేకరణ కుపక్రమించినాడు. తెలుగు దేశంలోని అనేక ప్రాంతాల నుండి ప్రతులను సాధించినాడు. ఈ ప్రాంతాల మధ్య దూరం గమనిస్తే దేశమంతటా వేమనపద్యాల కున్న ప్రాచుర్యం స్పష్ట మవుతున్నది. పెనుగొండ[5]. (No. D 1735, దీనికే 'బెండమూరి లంకపత్రి' అని పేరున్నది), చెర్ని గూడూరు[6] (D1748), మామిళ్లదొరువు (D 1756), గణపవరం (D 1758), యానం (D 1754) కడప (D 1728) మొదలైన వివిధ ప్రాంతాల నుండి ప్రతులు తెప్పించినాడు బ్రౌన్. వీటిలో అత్యల్పపద్యసంఖ్య (91, D 1768) గల ప్రతినుండీ, అత్యధిక పద్య సంఖ్య (1083, D 1774) గల ప్రతిదాక ఉన్నాయి. వేయి పద్యాలకు మించిన ప్రతులు చాలా తక్కువ. వందలపద్యా లున్న ప్రతులే ఎక్కువ. కొన్ని ప్రతుల వయస్సును నిర్ణయించడానికి చివరి ఆకుల్లో లేఖకులు వ్రాసిన తారీఖులు ఆధారంగా ఉన్నాయి.

D. 1731 — వ్యయ సం॥ వైశాఖ శు॥ 2 శనివారము

D. 1763 = ధాతనామ సం॥ జ్యే॥ శు॥ ౧౦ బుధవారము

2949 = తారణ సం॥ సౌరభ భాద్రపద బహుళ భానువారము

2950 = విరోధి సం॥ భాద్రపద శు॥ ఆదివారము

## లిఖిత ప్రతులు (Paper Manuscripts)

బ్రౌన్ లిఖిత ప్రతులు వ్రాయించడంలో కొన్ని పద్ధతులు అవలంబించి నాడు. ఆ పద్ధతుల వలననే లిఖిత ప్రతుల మాతృకలన్నింటినీ కనిపెట్టడం

---

4. ... ...In the year 1824 when I first read Vemana, my learned assistant Venkatashiva sastri, interpreted it fully,...............

—Brown Dictionary Notes
P.312. No. D 1391, Vol. III

5. తాళప్రతుల మీద ఈ స్థలాల పేర్లు వ్రాసియున్నా బ్రౌన్ వీటిని సేకరించిన ప్రాంతాలు బళ్లారి, కడప, మద్రాసు, విశాఖపట్నం.

6. "యివి భట్టిప్రోలు వెంట్రాయుడు వ్రాశ్నివి అనగా సర్వేపల్లి తాలూకాలో చెర్నిగూడూరులో వుండే తహశీలుదారు బడి చదువుల అయ్యవారు వ్రాశ్నిది" వ్రాలు ప్రతి D1748.

కష్టమవుతున్నది. బ్రౌన్ వ్రాయించిన లిఖిత గ్రంథాలన్నీ మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో భద్రపరచపడి ఉన్నాయి. వీటిలో అత్యల్ప పద్య సంఖ్య (306, D 1724) గలవీ, అత్యధిక పద్యసంఖ్య (1165, D 1721, D 1722) గలవీ ఉన్నాయి. వీటిలోని పద్యాలన్నింటినీ యేర్చి కూర్చి 3238 పద్యాలను ఇంగ్లీషులోనికి (ఒక సంపుటం ల్యాటిన్‌లోనికి) అనువదించి ఐదు సంపుటాలుగా వ్రాయించినాడు. (D 1773 vol. 1, 2, 3, 4 5). కొన్ని సంపుటాలకు అకారాది పద్య సూచికలు తయారు చేయించినాడు. (D 1721, D 1722, D 1723, D 1724, D 1762).. కొన్నింటిలో మూడు, నాలుగు విభాగాలు చేసి వ్రాయించినాడు (4 భాగాలు. D 1721, D 1722. 3 భాగాలు D 1737). పైన చెప్పిన ఐదు సంపుటాలే కాక వాటిలో నుండి మరో 1300 పద్యాలు ఏరుకొని ఆంగ్లానువాదం చేసిపెట్టినాడు (D 1774). దీనిని అచ్చు కొరకు సిద్ధపరచి నట్టున్నది. అశ్లీల పద్యాలు చాలావరకు పరిహరింపబడినాయి. దీనిని సాహిత్య ఆకాడమీ వారు "Verses of Vemana" అను పేరుతో (మూల ప్రతిలోని కొన్ని సుగుణాలను పరిహరించి) ప్రకటించినారు.

## ప్రతుల పరస్పర సంబంధాలు

ప్రతి నెంబరు D 1735 (లిఖిత)లో 1116 పద్యాలున్నవి. ఇన్ని పద్యాలు ఏ తాళప్రతిలోనూ లేవు. అసలు ఏ తాళప్రతిలోని పద్య సంఖ్యా వేయికి మించలేదని చెప్పవచ్చు. దీనినిబట్టి బ్రౌన్ వ్రాయించిన కొన్ని లిఖిత ప్రతులకు (బహుశా ఏ లిఖిత ప్రతికైనా) ఏకైక మాతృక అనేది లేదనిపిస్తున్నది. బ్రౌన్ ఒక ప్రణాళిక ప్రకారం లేక తనకు నచ్చిన ఓ పద్ధతి చొప్పున తాళప్రతుల నుంచి పద్యాలను తోడుకున్నాడనిపిస్తున్నది. D 1735 ప్రతికి[7] మాతృకను (?) ఆయన పెనుగొండ నుండి తెప్పించినాడు. దాని సొంతదారుడు ముందు దానిని ఇవ్వడానికి అంగీకరించలేదు. D 1735 ను పోలిన మరోప్రతి బ్రౌన్ వ్రాయించినాడు (D 1726). ఏవో రెండు మూడు పద్యాలు తప్ప

7. The original MS was found at Penugonda and the owner not wishing to lend it. I had this copy made in Feb 1834.
Notes on MS. by Brown
No. D 1735

పద్య సంఖ్య, క్రమము ఒకే రకంగా ఉన్నాయి. D 1735 కు D 1723 ప్రతి పుత్రిక అనడానికి ఎట్టి ఆటంకాలు లేవు. ఇక దీని- అమ్మమ్మ ప్రతినే కనిపెట్ట వలసి ఉన్నది. D 1721, D 1722 ప్రతులు కూడ ఒకే మూల ప్రతికి పుట్టిన బిడ్డలుగా భావించడానికి ఆధారాలున్నవి. ఇవి ఏ దృష్టితో చూసినా చాలా ముఖ్యమైన ప్రతులు, ఈ రెండూ 1842 లో వ్రాయించినవే. D 1721 కి వ్రాస్తూ బ్రౌన్ "ఇది ఒక పడింతకవిచేత పరిష్కరింపబడినద"ని పేర్కొన్నాడు. ఇందులో "పద్యాల క్రమం కూడ కొంత మారింది" అన్నాడు. కాని ప్రతులను పోలుస్తూ పరిశీలిస్తే ఆ మార్పు ఏమీ కనపడదు. "The Volume Contains 1165 Stanzas. selected out of ......... అని అర్థాంతరంగా ఆగిపోయినాడు. ఎన్ని పద్యాలలో నుండి ఇవి ఎంచినవో తె లి య కు ం డా పోయినది. కొ న్ని తా ళ ప్ర తు ల ను ని ర్ణ నిర్ణయించుకొని వాటినుండి ఈ 1116 పద్యాలను ఎన్నుకొని ఉంటాడు. D 1722 ప్రతికి వ్రాస్తూ [8] "అనేక ప్రతుల ఆధారంగా పెంచబడిన సరిదిద్ద బడిన ప్రతి"గా దానిని వర్ణించినాడు. ఏ సంఖ్యకన్నా పెంచబడినవో తెలియాలి ఇందులోనికి ఎత్తి వ్రాసినవి మాత్రమే "ప్రచురణార్హముల"ని బ్రౌన్ అభి ప్రాయం. ఇంకా 2000 పద్యాలు మిగిలిపోయిన వన్నాడు. అవి ముఖ్యంగా అన్వయం కుదరని మార్మిక పద్యాలని అభిప్రాయ పడినాడు. గ్రంథారంభంలో "This is the new edition of Vemana, 1842," అని కూడ వ్రాసినాడు వేటికన్న కొత్తదో తెలియాలి. ఏమైనా పై రెండూ అభేదప్రాయంగానే ఉన్నాయి, తాళప్రతులూ, లిఖిత ప్రతులూ రెండూ పక్కపక్కన పెట్టుకొని చూసినా మాతృకలను కనిపెట్టడం అనుకున్నంత సులభం కాదు. ఇక్కడ మాతృకలను కనిపెట్టడానికి మనకు స్థూలంగా కనిపించే ఏకైక సాధనం పద్య క్రమము లేక వరుస మాత్రమే (Order of Poem). రెండు ప్రతుల్లోని పద్య సంఖ్యా సమానత మీద మనం ఆధారపడలేము. ఎందుకంటే ఒక్కొక్క లిఖిత ప్రతికి అనేక తాళపత్ర మాతృక లుండవచ్చు. ఇక యీ పద్యక్రమాన్ని అంకెలతోనే (Numerals) గుర్తించాలి. అంకెలు లేని చోట పద్యాలు లెక్క బెట్టుకోవచ్చు. కాని మూల ప్రతుల్లోని పద్యాల వరస పుత్రికలు చాలావాటిలో మారి పోయినది. అట్లా మారడానికి బహుశా యీ క్రింది కారణాలు ఎంత వరకు దోహదం చేసినాయో ఆలోచించాలి.

---

8. A new edition, enlarged and corrected by the aid of numerous manuscripts.

1. లేఖకుల శ్రద్ధాలోపంవలన తాళప్రతుల్లో దొరలిన దోషాలు. ఉదా:- వ్రాసిన పద్యాలే మళ్లీ వ్రాయడం, అంటే వచ్చిన నెంబర్లే మళ్లీ వస్తాయి. ౧౦౦, ౧౦౧, ౧౦౨, ౧౦౩, తర్వాత మళ్లీ ౧౦౦, ౧౦౧ మొదలుకావడం.

2. (i) శ్రీకరముగ (ii) శివకవులకు; ఈ రెండు పద్యాలు చిన్న చిన్న క్రమభేదంతో ప్రతి ప్రతి మొదటా వస్తాయి. లిఖిత ప్రతులు కొన్నింటిలో వీటిని తొలగించి, కొన్నింటిలో తొలగించక పోవడంవలన నెంబర్లక్రమం కూలిపోయి చెల్లాచెదురైనాయి.

3. ఇక ప్రతులను పుట్టించేటప్పుడు ఆకులను విడదీసి నలుగురికి పంచి వ్రాయించడంవలన, వ్రాసిన తర్వాత మళ్లీ వాటిని యథేచ్ఛగా కలపడంవలన మూలవ్యతిరేకమైన క్రమం ఏర్పడి ఉండవచ్చు అయినప్పటికీ కొన్ని మాతృకలను కనిపెట్టడంలో మనం సఫలమవుతాము. వాటి వివరాలను ఈ కింద చూడవచ్చు,

| క్రమ సంఖ్య | మాతృకలు | పుత్రికలు | పౌత్రికలు |
|---|---|---|---|
| 4. | D 1728<br>తాళప్రతి | D 1725<br>లిఖితప్రతి | |
| 2. | D 1744<br>తాళప్రతి | D 1770<br>లిఖితప్రతి | |
| 3. | బెండమూరి<br>లంకప్రతి<br>(?) | D 1735<br>లిఖితప్రతి | D 1737<br>D 1762<br>D 1723<br>D 1722<br>D 1721<br>ఇవి అన్నీ లిఖిత ప్రతులు |

పరిష్కరణ

వేమనను గూర్చి బ్రౌన్ మొట్టమొదటిసారి 1824 లో విన్నాడని తెలుసు

కున్నాము. విన్నదే తడవుగా వేమన పద్యాల ప్రతుల సేకరణను ప్రారంభించినాడు. 1824 లో బ్రౌన్ మచిలీపట్టణంలో ఉన్నాడు. 1824 నవంబరు వరకు బ్రౌన్ దాదాపు 12 ప్రతుల దాకా సంపాదించ గలిగినాడని "An Index to the verses of Vemana......Masulipatnam Nov. 1824".[9] వలన తెలుస్తున్నది వీటిలో తొమ్మిది ప్రతులను[10] ఏరి తన పర్యవేక్షణలో పండితుల చేత సంకలనం చేయించినాడు (Theming the place each verse occupies in each of nine collected manuscript copies, compiled under the direction of Charles Philip Brown, Civil Service.)

బ్రౌన్ తొమ్మిది తాళ ప్రతులను ముందుంచుకొని (వాటికి A, B, C, E, G, H, J, T..... ...and also D, F,K, Y. R అని పేర్లు పెట్టుకున్నాడు)[11] ఒక్కొక్క పద్యం యొక్క స్థానం వేరువేరు ప్రతుల్లో ఎక్కడున్నదో పద్య సంఖ్యలతో సూచిస్తూ ఓ పట్టిక[12] తయారుచేసినాడు. బ్రౌన్ 9 తాళ ప్రతుల నుండి పద్యాలను ఎత్తి వ్రాయించి, పాఠభేదాలను పోల్చిచూచి, శుద్ధపాఠాలను నిర్ణయించుకొని మొత్తం మీద 3238 పద్యాలను ఎన్నుకొని, వాటి పరిష్క-

---

9. No. D 3098 ఓరియంటల్ మ్యాన్‌స్క్రిప్ట్స లైబ్రెరీ, మద్రాసు.

10. Meantime I persisted in reading translating all the manuscripts of Vemana that I could collect and when I had gone through the whole I formed an edition of the work arranged in nine books.—June 1828.
Sketch of the origin of my Dictionary
No. D 1391 Vol.9.

11. కళ్లకు వొత్తులు పెట్టుకొని అన్వేషిస్తే ఈ సంజ్ఞలను తగిలించుకున్న అసలు ప్రతులు కొన్నిమాత్రమే బయటపడ్డాయి. భావిపరిశోధకుల పరిశోధనార్థం బ్రౌన్ అక్కడక్కడ కొన్ని వివరాలు వ్రాసిపెట్టుకున్నా అక్కడక్కడ అవి పూర్వపదిత వ్యాఘాతం (controdictory) గా ఉండి బయటపడిందను కున్న సత్యం సంశయాస్పదంగా మారుతుంది. (ఉదా. E,F లకు ఒకే రకమయిన వివరాలు వ్రాసినాడు. D1772 అనే ప్రతికి R అని పేరు పెట్టుకున్నట్లుగా కనిపిస్తున్నది.)

12 ఈ పట్టికాగ్రంథము రెండుసంపుటాలుగా (D3098, D3094 అతి శిథిలావస్థలో, ఇప్పటికే అక్షరాలకన్న రంధ్రాలే అధికమై ముడితే పొడి పొడి అయ్యే స్థితిలో ఉంది:

రణకు సమాంతరంగా అనువాదంకూడ చేస్తూ వచ్చినాడు[13]. ఈ 3233 పద్యాలు గల అనువాద సహిత సంపుటాలను ఐదు విభాగాలుగా విభజించి వ్రాసుకున్నాడు. మొదటి సంపుటం:- ఇందులో 530 పద్యాలను బ్రౌన్ ల్యాటిన్ భాషలోనికి తర్జుమా చేసినాడు. రెండవ సంపుటంలోని 440 పద్యాలు, మూడవ సంపుటంలో 543 పద్యాలు, నాలుగవ సంపుటంలో 672 పద్యాలు మిగిలినవి ఐదవ సంపుటంలో......ఇవన్నీ ఇంగ్లీషులోనికి అనువదింపబడినవి. యీ ఐదు సంపుటాల్లో చివరి రెండింటిని (IV & V)[14] నిరుపయోగమని, విద్యార్థులకు నచ్చక పోవచ్చునని 1829 నాటి ముద్రణంలో చేర్చలేదు. అంతే కాకుండా అర్థసంశయాస్పదంగా ఉన్నవీ, ఎంతకూ అన్వయంకుదరని మొండి పద్యాలను తర్వాత పరిహరించినాడు. కొన్ని మార్మిక (Mystic) పద్యాలకున్న ప్రాచుర్యాన్ని గుర్తించి తొలగించలేదు. ఇంకా యెన్నింటినో తొలగించి వేయాలనుకున్నాడు కాని ప్రజల నాలుకల మీద వాటికున్న చెలామణి వలన అట్లాగే ఉంచవలసివచ్చినది. ఐదు సంపుటాలుగా యేర్పడిన 3233 పద్యాలలో చివరి రెండు సంపుటాలలో అంటే దాదాపు 1700 పద్యాలు తొలగిస్తే మిగిలన 1530 పద్యాలలో పైన చెప్పిన వివిధ కారణాల వలన దాదాపు ఎనిమిది వందలకు పైగా (837) పద్యాలను పరహరించడం వలన 693 పద్యాలు మిగిలి 1829 నాటి ముద్రణంగా అవతార మెత్తినవి. 693 పద్యాలను అనువాద సహితంగా అచ్చువేయడానికి ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీ వారికి అర్జీపెట్టుకున్నాడు. బ్రౌన్ 1827 జూలై 23న కాలేజీ బోర్డు కార్యదర్శి హెచ్. హార్కనెస్ (H. Harkness) చీఫ్ సెక్రెటరీకి సిఫారసుచేసినాడు[15]. మొత్తం మీద 1829 లో కాలేజీ బోర్డువారి చేత మొట్టమొదటిసారి వేమన పద్యాలను ప్రకటింపజేసినాడు బ్రౌన్. ఈ ముద్రణం అనేక విధాలుగా విశిష్టమైనది గ్రంథాంతంలో బ్రౌన్ ఏర్పరచిన వర్ణక్రమసూచిక ఒక శాస్త్రీయ పద్ధతికి శ్రీకారం చుట్టింది

---

13. I had made some attempts to read him soon after arriving at Masulipatnam; and last in April'24 I fairly sat down to translate them into English as fast as I read.
—Brown's Dictionary Notes
Last pages, D 1391 Vol 9, 1824

14. The two, last of these form more than half the work, but are omitted in the present volume, because of interest and utility.—Verses of Vemana 1829.

15 బ్రౌన్‌లేఖలు:- బంగోరె 1976 బ్రౌన్ ప్రాజెక్టు వెంకటేశ్వర యూనివర్సిటీ.

ఇంత చేసినా బ్రౌన్ వేమన పద్యాల సేకరణను ఆపలేదు. 1830లో మరికొన్ని ప్రతులు సేకరించగలిగినాడు. పై తొమ్మిది ప్రతులలో లేని కొత్త పద్యాలు వీటిలో కనిపించినవి. కాని వాటిని సులభంగా కనుక్కోవడానికి వీలులేకుండా ఒక క్రమంలో లేకపోవడం వలన బ్రౌను ఈ ప్రతులమీద విసుక్కున్నాడు[16]. తరువాత 1834 లో పెనుగొండ[17]లో మరొక ప్రతిని సేకరించినాడు. ఈ పెనుగొండ ప్రతి D 1735 నెంబరుగల లిఖిత ప్రతికి మాతృక. కొత్త పద్యాల ప్రతుల పరిశీలనాను భవంతో 1829 నాటి ముద్రణాన్ని సవరించి 1839 లో రెండవ ముద్రణాన్ని వెలువరించినాడు బ్రౌన్.

ఇప్పటి ముద్రిత ప్రతులను చూస్తే వేమన పద్యాల సంఖ్య ఐదువేలకు పైగా పెరిగి పోయినది. మన ప్రాచీన కవులు కుదురుగా ఒకచోట రచించిన కావ్యాలకే ప్రక్షిప్తాల బాధ తప్పలేదు ఇక తోచినప్పు డల్లా చెప్పబడి. వేదాల వలె శ్రుతి సంప్రదాయంలో వ్యాప్తి చెందిన వేమన పద్యాల మాటకేమి ? అనే కులు చేయి (లేకనోరు) చేసుకోవడం వలన వేమన పద్యాలకు జరిగిన హాని ఇంతింతన రానిది. వేమనలో మనకు కనిపించే స్వవచన వ్యాఘాతాలకు కారణ మిదే. బ్రౌన్ పరిష్కరణలో "వేమన పద్యాలేవి ? కాని వేవి ?" అనే దృష్టి పూర్తిగా లేదనలేము కాని కొంతవరకు దాని కాయన అంతర్దృష్టే (Intuition) ప్రమాణం. బ్రౌన్ గావించిన వాఙ్మయమహాయజ్ఞంలో వేమన పద్యాల పరిష్కరణ ఒక భాగం మాత్రమే కాబట్టి బ్రౌన్ ప్రారంభించి పోయిన పద్యాల పరిష్కరణను సమగ్రంగా, శాస్త్రీయ దృష్టితో జరుపవలసిఉన్నది. బ్రౌన్ దృష్టికి రాకుండా దేశంలో ఉన్న వేమన పద్యాల తాళప్రతులు మరెన్నో ఉండి ఉంటాయి. తంజావూరు సరస్వతీ మహల్ లో ఐదు తాళప్రతు లున్నాయి. రాయవరపు పూర్ణయాచారి అనేక తాళ ప్రతుల ఆధారంగా, 'వేమన సూక్తి రత్నాకరం' (బందరు ప్రతి) ను వెలువరించినాడు. అన్ని తాళ ప్రతులను సాకల్యంగా పరిశీలించి వేమన పద్యాల సంశోధిత ముద్రణం వెలువరించవలసిన అవసరం ఉంది.

*

---

16. New Verses of Vemana, found in copies produced in 1830 and which can not be traced nor satisfactorily adjusted.—D 1773 Vol. IV.

17. The original MS was found at Penugonda and the owner not willing to sell it. I had this copy made in February 1834.

—D 1735.

# కావ్యాలంకార చూడామణి - ఒక పరిశీలన

—డా॥ యస్. జి. రామానుజాచార్యులు

చాళుక్యవంశ తిలకుడగు విశ్వేశ్వరప్రభువు కాలమున (క్రీ. శ. 1400 ప్రాంతమున) వర్ధిల్లిన విన్నకోట పెద్దన ఆంధ్రమున కావ్యాలంకార చూడామణి యను తొలియలంకార శాస్త్ర గ్రంథమును రచించి తెలుగునకు అలంకార శాస్త్రములేని లోటును తీర్చిన మనీషి. చూడామణియందు 7 8 9 ఉల్లాసములలో ఛందోవ్యాకరణాంశములు వివేచింపబడినను పెద్దన దీనిని అలంకారగ్రంథముగానే భావించెను.

ఆంధ్రమున అలంకార గ్రంథములని రచింపబడిన కొలది గ్రంథములలో బహుళముగ ఛందోవ్యాకరణాంశములు కూడ కానవచ్చుచున్నవి. అట్లే ఛందోగ్రంథములుగ పేర్కొనబడిన కవిజనాశ్రయ, ఛందోదర్పణ, అప్పకవీయాది గ్రంథములలోను, అలంకార వ్యాకరణాంశములును వివరింపబడినవి. కనుక తెలుగులో లక్షణ గ్రంథములు అలంకార ఛందోవ్యాకరణాంశములను వివరించునని తేలినది.

పెద్దన కావ్యాలంకార చూడామణిని "పూర్వ కల్పిత శాస్త్రానుగతియై" రచించెను. ఇట పూర్వకల్పిత శాస్త్రములనగా పూర్వీకులచే రచింపబడిన అలంకార శాస్త్రములనియే కావచ్చును పెద్దన మాత్రము తాను ఏఏ ఆలంకారికులను అనుసరించెనో వివరింపలేదు. కనుక పెద్దన కావ్యాలంకార చూడామణి రచనకు సంస్కృతాలంకార శాస్త్రమునందలి ఏ ఏ గ్రంథములను ఆధారముగ తీసికొనెనో చూడామణి రచన నాధారముగాగొని తెలిసికొనవలసి యున్నది.

పెద్దన తన కృతియందు పూర్వకవిస్తుతిని చేయలేదు. నన్నయ, తిక్కన, నాచన సోమన మొదలగు కవులలో పెద్దన ఏ ఆంధ్ర కవిని కూడ పేర్కొనకపోవుట గమనింపదగిన విషయము. చూడామణి ఏ ఒక్క గ్రంథమునకు అనువాదమును, అనుసరణమును కాదు. దండి, భామహ, విశ్వనాథ,

విద్యానాథాది పూర్వాలంకారికుల సిద్ధాంతములను అవసరములగు పట్టుల పెద్దన వివరించియే యున్నాడు. విషయ వివరణ సందర్భమున ఎక్కువగ విద్యానాథునే అనుసరించెను. భావరస నాయికానాయక దోషప్రకరణములలో విస్తారముగా ప్రతాపరుద్రీయాంశములే గోచరమగును.

మూల విషయములను వివరించు సందర్భములందు పెద్దన ఒక్కొక్కసారి స్వాతంత్ర్యమును పూనును. మరొక్కసారి మక్కికి మక్కి అనువాదము గావించును. అప్పుడప్పుడు మూలమునకే మెరుగులు దిద్దజాలిన సవరణ గావించును. ఒకప్పుడు మూలవిరుద్ధ విషయములు కూడ పెద్దన రచనలో కాననగును.

శాస్త్రీయాంశములను వివరించునప్పుడు ఆలంకారికుడు స్వతంత్రతను చాటదలచినచో మిక్కిలి జాగరూకుడుగ నుండవలెను. మచ్చునకు "తత్ర సంకేతితార్థగోచరః శబ్దవ్యాపారః" అని విద్యానాథుడు అభిధాగుణమును చెప్పగా, పెద్దన "సువ్యక్తమును, సరళంబును నవ్యాజమును నగునది ముఖ్యార్థమని" వివరించుట స్పష్టముగా లేదు పైగా పెద్దన అభిధను జాతి, ద్రవ్య, గుణ, క్రియలుగా నాలుగువిధము లగునని వివరించెను విశ్వనాథాదులు సంకేతమునకే అట్టి విభాగము గావించిరి. పెద్దన మాత్రము అభిధాక్షణమున అతి ముఖ్యమైన సంకేతమును చెప్పకయే ఇటనట విహరించెను. ''సంతత సంకేతితార్థసుశబ్దధామము'' అభిధయని భట్టుమూర్తి లెస్సగ వివరించెను.

సంస్కృత లాక్షణికులు సాధారణముగా గభీరార్థమును వివరించు సందర్భములందు వచనమునందే స్పష్టతకై వ్రాయుదురు. కాని తెలుగులో పెద్దనాదులు కేవలము అట్టి విషయములను పద్యమునందే చెప్పబూనినందున విషయాస్పష్టతయును, మూలాంశక్షతియును ఏర్పడినవి. ఉదాహరణమునకు విద్యానాథుడు ''వాచ్యార్థానుపపత్త్యా తత్సంబంధి న్యారోపితః శబ్దవ్యాపారో లక్షణా"-వాచ్యార్థానుపపత్తిచే వాచ్యార్థ సంబంధమగు విషయమున ఆరోపింపబడిన శబ్దవ్యాపారము లక్షణ యని చక్కని సరళవచనమున వివరించెను. పెద్దన ఇట ''ఊహనీయ లక్షణోపేతమగు నర్థ మరయ లక్ష్య మనగ నతిశయిల్లు" అని అస్పష్టముగా వివరించెను. ఇచట పెద్దన కూడ వచనమునందే వివరించుటకు ప్రయత్నించినచో బాగుండెడిది. నరసభూపాలీయకర్త భట్టుమూర్తియును పెద్దన మార్గమునే అనుసరించెను.

విద్యానాథుడు "అన్వితేషు పదార్థేషు వాక్యార్థోపస్కారార్థం అర్థాంతర విషయ : శబ్దవ్యాపార : వ్యంజనావృత్తిః'' -పదార్థము లన్వితములగునప్పుడు వాక్యార్థోపస్కారార్థమైన అర్థాంతరవిషయము గల శబ్దవ్యాపారము అని వ్యంజన లక్షణమును వివరించెను. పెద్దన వాక్యార్థోపస్కారార్థమను విశేషణమును మాత్రము వదలి "ముఖ్యలక్ష్యగౌణముల యర్థముల ద్రోచి యితర మర్థ మెచట నింపునొసగు'' అని వివరించుట విశేషముగా నున్నది.

ఇట విద్యానాథుడు వ్యంగ్యార్థము వాచ్యార్థోపస్కారకము కావలె ననెను. ఈ విషయమున భట్టుమూర్తి యును విద్యానాథునే అనుసరించెను. కాని వాస్తవమునకు వాక్యార్థము ద్వారా గోచరమగు చమత్కారాదాయక మగు నర్థాంతరమే వ్యంగ్యము. వాక్యార్థము వ్యంగ్యార్థోపస్కారక మగునేగాని వ్యంగ్యార్థము వాక్యార్థోపస్కారకము కానేరదు. ఈ సందర్భమున ఆనందవర్ధనుడు చెప్పిన ఈ క్రింది అంశములను మరువరాదు-

"ఆలోకార్థీ యథా దీపశిఖాయాం యత్నవాన్ జనః
తదుపాయతయా తద్వదర్థేవాచ్యేతదాదృతః
యథా పదార్థ ద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే
వాచ్యార్థ పూర్వికా తద్వత్ప్రతిపత్తస్య వస్తునః"

మొదట దీపమునకై ప్రయత్నించిన వ్యక్తి దీపలబ్ధ్యనంతరము ఆ దీప సాహాయ్యమున మరియొక వస్తువును చూడగోరునో అట్లే సహృదయుడు వాక్యార్థ సహాయముతో వ్యంగ్య వైభవము ననుభవించుననియు, పదార్థము వాక్యార్థమును బోధించినటుల వాక్యార్థము వ్యంగ్యార్థమును బోధించి స్వసామర్థ్యమును కోల్పోవునని ధ్వనికారుని అభిప్రాయము.

తక్కిన అంశము లెట్లున్నను కావ్యమున ప్రధానముగ పేర్కొన దగిన వ్యంగ్య విషయమున విద్యానాథుడు సైతము వేసిన తప్పటడుగును గుర్తించి, సవరించుకొని వాక్యార్థోపస్కారార్థమను విశేషణమును తొలగించి వ్యంగ్యార్థ స్వరూపమును పెద్దయ వివరింప బూనుట ప్రథమాంధ్రాలంకారికుని స్వతంత్రత కొక మచ్చుతునక.

ఇక రసము యన్నిష్ఠము? అను సందర్భమున పెద్దన రసమును సామాజిక నిష్ఠముగానే పేర్కొనెను. "తత్తత్ప్రసరస్మరణముచేతన్" అని నుడువుట వలన పెద్దన భట్టనాయకమతము ననుసరించినవాడని తెలియుచున్నది.

అభినవగుప్తుడు భట్టనాయకునివలె భావన యను ప్రత్యేకవ్యాపారము నొప్పుకొనక సహృదయగత మగు రత్యాదులనే రసములని అంగీకరించెను. అభినవుడు సామాజికునియందు వాసన అను సంస్కారము కలదనియు సవాసనులైన సభ్యులకే రసాస్వాదము కల్గుననియును వివరించెను. అభినవుని మతానుసారము రససూత్రమునందలి సంయోగ పదమునకు వ్యంగ్యవ్యంజక భావమనియు, నిష్పత్తి పదమునకు అభివ్యక్తి అనియు చెప్పబడినది. వ్యంజకములగు విభావాదులచే సహృదయగతమైన స్థాయి వ్యంగ్యమై రసమగునని అభినవగుప్తుని అభిప్రాయము.

భరత రస సూత్రమునకు అభినవగుప్తుడు గావించిన వ్యాఖ్యానము ప్రామాణికమైనదని పండితామోదము గాంచినది. పెద్దన రసము యన్నిష్ఠమను విషయమును అభినవగుప్తు ననుసరించి చెప్పినచో బాగుండెడిది. రస విషయమున పెద్దన వివరించిన అంశములు కూడ ఇంచుక అస్పష్టముగానే ఉన్నవి. ఏది యేమైనను రసము సహృదయనిష్ఠమను సర్వసమ్మతమగు నంశమును ప్రతిపాదించుటనందున పెద్దన అభినందనీయుడు.

కావ్యభేద విషయ వివరణమునందును పెద్దన మిక్కిలి అస్పష్టవైఖరినే అవలంబించెను. "ధ్వనియే కావ్యాత్మ'' అని పెద్దన అన్నింట విద్యానాథు ననుసరించి, కేవలము కావ్యభేద విషయమున దండి మతమును పాటించెను. పెద్దన చెప్పిన గద్యపద్య మిశ్ర (చంపూ) రూపమగు కావ్యభేద వ్యవస్థ ధ్వనివాదము రాక పూర్వము మాత్రమే సరిపోయినది. ధ్వన్యనంతర మీ క్రమమును ఆలంకారికులు చెప్పలేదు. కొందరాలంకారికులు వ్యంగ్యప్రాధాన్యాప్రాధాన్యవివక్షతో ఉత్తమ మధ్యమఅధమ కావ్యములనియే విభజించినారు అంతియేకాక కావ్యాలంకార చూడామణి రచింపబడు నాటికి తెలుగున గద్య గ్రంథములే లేవు. గద్యపద్యములతో కూడిన వానిని కూడ నాడు పద్యకావ్యములనియే వ్యవహరించినారు. మిశ్రరూపవ్యవస్థ గల రచన తెలుగున ప్రచారమునం దున్నను

దానికి 'చంపూ' అనుపేరు తెలుగు సారస్వతమున ప్రచారమునందు లేదు. "వ్యంగ్య వ్యాకీర్ణమైన కావ్య ముత్తమ" మని చెప్పిన పెద్దన ఇట పాఠకునకు అయోమయ పరిస్థితినే కల్పించెను. కనుక పెద్దన గావించిన ఈ కావ్యభేద పద్ధతి ఇటు ఆలంకారికులకును అటు తెలుగు సారస్వత విభాగమునకును సరి పోనిదైనది.

ఇట్లే కావ్యాత్మను చెప్పు సందర్భమునందును పెద్దన భరతుని రస సిద్ధాంతమును, భామహుని అలంకార సిద్ధాంతమును, వామనుని రీతి సిద్ధాంత మును, ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమును ఒకచోట సంయోజనము గావించు టకు విఫలయత్నము గావించెను. రసాలంకార రీతి ధ్వన్యాది సంప్రదాయ ములు అలంకార సాహిత్యమున భిన్నకాలములందు భిన్నాభిప్రాయములతో వెలసిన సిద్ధాంతములు. అట్టివాని నన్నింటిని ఇట చేర్చినందున కావ్యాత్మ విషయ మున పెద్దనకు గల ఆశయము లెట్టివో తెలిసికొనుట కష్టతరమైనది.

ఈ విధముగా కొన్ని ఆదరణీయఅనాదరణీయ అభిప్రాయములకు తావ లమై తెలుగున మొదటి అలంకార శాస్త్ర గ్రంథము వెలసినది. జగన్నాథ విద్యానాథాది ప్రసిద్ధాలంకారికులు ఆంధ్రులై ఉండియు తెలుగున అలంకార గ్రంథరచనమును చేయక సంస్కృతాలంకార వాఙ్మయమునే అలంకరించిరి. మాతృభాషాభిమానము గల విన్నకోట పెద్దన ఆంధ్రమునకు అలంకార గ్రంథము లేని లోటును చూడామణి రచన ద్వారా తీర్చెను. *

# చారిత్రక కావ్యము -
# ఉత్పత్తి వికాస పరిణామములు

—డా॥ శ్రీమతి వి. సీతాకల్యాణి

సాహిత్య ప్రక్రియలలో కావ్యము విశిష్టమైనది. కావ్యప్రక్రియ సాధించిన విస్తృతి వైవిధ్యములు మరియు విశిష్టములైనవి. అనేక విధములగు కావ్యములు తెలుగు సాహిత్యమునవ్యాప్తిగాంచినవి. ప్రబంధములు, కథాకావ్యములు, తాత్త్విక కావ్యములు, చారిత్రక కావ్యములు, ఖండకావ్యములు, అధిక్షేప కావ్యములు మున్నగునవి వస్తువైవిధ్యము ననుసరించి యేర్పడిన వివిధకావ్య ప్రక్రియలు. ఇట్టి కావ్యవిశేషములలో నొకటి యగు చారిత్రకకావ్యము ప్రస్తుత విషయమున పరిశీలనాంశమై యున్నది.

చరిత్రము ఇతివృత్తముగా గల కావ్యము చారిత్రక కావ్యమని సర్వజన విదితము. చరిత్రమను పదమున కత్యంత విశాలమగు నర్థము కలదు. సృష్టి యందలి సమస్తవస్తుజాలమునకును చరిత్రకలదు. దేశవిషయికము, వ్యక్తి విషయికము, మత విషయికము, సంఘవిషయికము, శాస్త్రవిషయికము, వస్తువిషయికము- ఈ విధముగా చరిత్రార్థము బహుళ విస్తృతిని గనియున్నది. ఇందేది చారిత్రక కావ్యమున కితివృత్తము కావలయును?...గతకాలమునందు జరిగి పోయిన యేయంశమైనను వర్తమానమునకు చరిత్రమే యగును. ఇచ్చట చారిత్రకకావ్య మను పదమునకు లోకమున రూఢమై సుప్రసిద్ధమైన యర్థము మాత్రమే గ్రహించవలసియున్నది. సత్యప్రామాణికత చరిత్రమునకు లక్షణము. ఏ భాషాసాహిత్య చరిత్రమునందైనను ప్రామాణికమై దేశసంబంధమైన, రాజకీయసంబంధమైన, ప్రభు, ప్రభుత్వ సంబంధములైన, ఇతివృత్తములతో నిబద్ధింపబడిన కావ్యములే సర్వసాధారణముగా చారిత్రకకావ్యము లని ప్రత్యేకముగా పరిగణింపబడుచున్నవి. కావున దేశచరిత్రము, రాజకీయ చరిత్రము ప్రధానేతివృత్తముగా గల కావ్యములే చారిత్రక కావ్యము లను నర్థమే లోకమున రూఢమైయున్నది.

విశ్వమందలి సమస్తవస్తుజాలము జననము మొదలు వివిధ పరిణామ దశలలో అనవరతము పరిభ్రమించుచుండుట లయమగుచుండుట జగత్సత్యము. ఈ సత్య సూత్రము ననుసరించియే ఏ విషయమునకైనను ఆరంభమునుండి అంత్యమువరకు గల వివిధ పరిణామ దశలను సమగ్రముగా పరిశోధించుట శాస్త్రకారుల, జిజ్ఞాసువుల బుద్ధిజీవుల గమ్యమైయున్నది.

సాహిత్యమునందు గూడ వివిధ విషయములు పైదృక్పథమునందే పర్యాలోచింపబడుచున్నది. సాహిత్యప్రక్రియల యుత్పత్తి వికాసపరిణామములను గూర్చి యాలోచించుట నేటి విమర్శకుల పరిశోధన లక్ష్యములలో నొకటిగా స్పష్టపడుచున్నది. ఆ విధానము ననుసరించి సంస్కృతాంధ్ర సాహిత్య ప్రక్రియలలో చారిత్రక కావ్యత్వచ్ఛాయలను పురస్కరించుకొని నేటి చారిత్రక కావ్యముయొక్క యుత్పత్తి వికాస పరిణామములను పరిశీలించుటయే ప్రస్తుత వ్యాసమునందలి ముఖ్యోద్దేశము

చరిత్రము ప్రధానముగా కాలము నాశ్రయించినది. అనంతకాలమహాధ్వము భూత భవిష్యద్వర్తమానములని త్రిధావిభక్తమైనది. భవిష్యత్తు అనిశ్చితము. వర్తమానము ప్రత్యక్షానుభవసిద్ధము. భూతము భుక్తము. భూతము చర్వణ రూపముగను, భవిష్యత్తు ఊహారూపముగను వర్తమానమున భాసించుచుండును. చరిత్రకు భూతము బీజము. వర్తమానము క్షేత్రము. చరిత్ర విషయములు భూతకాలమున పుట్టి లయములు కాగా తత్సంబంధ మగు ప్రస్తావన వర్తమానమున జరుగుచుండుటయే చరిత్ర. భూతమున ప్రవర్తితములైన సంస్మరణీయములైన యుదాత్తమానవ జీవితఘట్టములు చరిత్రలో నధ్యాయములై రాణించుచుండును. సంఘవ్యవస్థప్రధానముగా ప్రభుత్వాధీనము. అట్టి ప్రభుత్వమును వెలయించు వ్యక్తులయొక్కగాని వ్యవస్థలయొక్కగాని చరిత్ర జాతిచే సర్వదా సంస్మరింపబడుచుండును. మరియు వీరులు మహాత్ములు నగువారు చేసిన చిరస్మరణీయకృత్యములను జాతి స్మరించుచు వారిని పూజించుచుండును. తత్సంబంధము లగు చరిత్రప్రమాణములను భద్రపరచి ప్రాణప్రదముగా రక్షించుకొనుచుండును. వానిపై చరిత్రలోకమున విశ్రుత మగుచుండును.

సంస్కృత లాక్షణికులు 'బిరుదావళి' యను లఘుకావ్యభేదమునుగూర్చి పేర్కొని యున్నారు. ప్రతాపరుద్రీయమున నిట్లు కలదు.

"వర్ణమానాంకబిరుదవర్ణన ప్రచురోజ్జ్వలా
వాక్యాడంబర సంయుక్తా సా మతా బిరుదావళీ".

వర్ణింపబడుచున్న రాజాదుల బిరుదములను గూర్చి వాక్యాడంబరముతో వ్రాయబడిన కావ్యము బిరుదావళియని దానిలక్షణము. సాహిత్య దర్పణకారుడు 'గద్యపద్యమయీ రాజస్తుతి ర్బిరుదముచ్యతే' అని చెప్పియుండుటచే నీ బిరుదావళి గద్యపద్యోభయాత్మకమై యుండవచ్చును. అప్పకవివంటి ఆంధ్రలాక్షణికులుకూడ దీనిని పేర్కొని యున్నారు. ప్రభువులకు వా రొనర్చిన ఘనకార్యములనుబట్టి బిరుదములు సంప్రాప్తము లగుచుండును. అవి స్వీయదత్తములు కావచ్చును. గౌరవార్థము పరులచే నీయబడినవి కావచ్చును. రాజులకును, ప్రముఖ రాజోద్యోగులకును మహాకవులకును సంబంధించిన యిట్టి బిరుదావళులు మనచరిత్రలో మిక్కుటముగా కనవచ్చుచున్నవి, 'మూరురాయరగండ' 'కర్ణాట స్థాపనాచార్య' 'చోళరాజ్య స్థాపనాచార్య' మున్నగునవి. ఈ బిరుదములు కొన్ని యెడల వంశపారంపర్యముగా వంశీయులు వాడుకొనుచుండు నాచారమును మన దేశమున గలదు. దీనిని బట్టి ప్రభువులుగాని ప్రభువంశీయులుగాని యొనరించిన మహత్కార్యముల కెత్తిన ప్రశంసాపత్రములుగా నీ బిరుదావళి శాసన వాఙ్మయమునం దక్షరరూపము దాల్చియున్నదని స్పష్టమగుచున్నది. ఇట్టివి బిరుదావళులు అను పేరుతో అలరారు ప్రశంసారూపములయిన వాఙ్మయప్రక్రియలుగా నిలిచియున్నవి. ఈ బిరుదావళులు స్తుతిప్రధానములు సూత్రప్రాయములు నైనవి. ప్రభువులు వీరులు ఆయాకాలములందు సాధించిన విశేషకార్యములను కీర్తించు నీ బిరుదావళులందు చారిత్రక కావ్యత్వమునకు బీజారోపము జరిగియుండునని భావించుటలో విప్రతిపత్తి యుండబోదు.

మరొక సాహిత్యప్రక్రియ 'గాధ' యనునది. ఇదియు స్తుతి రూపమే. దీనికి 'పితృపృధ్వీ ప్రభృతిగీతయః' యని లాక్షణిక నిర్వచనము. తల్లి దండ్రులు పితృదేవతలు భూమి మొదలగు వానినిగూర్చి చేయు స్తోత్రగీతములు గాథలని దాని తాత్పర్యము. గాథాపరిధి యంతటితో నాగలేదు. దాతలయు వీరపురుషులయు కృత్యములను తెలుపు గీతములుకూడ గాథలుగా రూపొందినవి. ఇట్టిగాథలను నారాశంసులని లాక్షణికులు పేర్కొనుచున్నారు. నారాశంసులు వేదకాలము నుండియు వ్యాప్తిలో నున్నవి. ప్రభువులును, ప్రసిద్ధ వ్యక్తులును చేసిన విశేష కృత్యములను స్తుతించు లఘుకృతులు గాథలు. ఇవి బిరుదములవలె సూత్ర

ప్రాయములు కాక కించిద్విస్తృతరూపములై వర్ణనాత్మకములై కవితా ఛాయ లతో కళకళలాడు కావ్యప్రక్రియా విశేషములు. చారిత్రక కావ్యత్వమునకు బిరుదావళి బీజావస్థ యనుకొన్నచో గాథలలో తత్సంబంధమగు నంకురావస్థను గాంచవచ్చును.

ప్రత్యక్ష ప్రమాణమూలకమై కథనాత్మకమైన 'ఆఖ్యానకము లేక ఆఖ్యానము' అను నొక లఘుకావ్యప్రక్రియ లక్షణ గ్రంథములందు ప్రచురమై కాన వచ్చుచున్నది. 'స్వయం దృష్టార్థకథనం ప్రాహు రాఖ్యానకం బుధాః' అని లాక్షణికోక్తి. కవి తాను చూచిన దానిని చెప్పుట ఆఖ్యానకమందురు. అనగా ప్రత్యక్షదృశ్యమానమగు నంశమును సహృ దయ హృదయములకు ప్రత్యక్షీకరింపజేయు కథనాత్మక కావ్యప్రక్రియ యాఖ్యానమని భావము. చారిత్రక కావ్యమునకు కావలసినది సత్యవిషయిక వివరణము. కావున ఆఖ్యానము ప్రాయికముగా చారిత్రక ప్రాధాన్యముగల వ్యక్తిత్వముతో నలరారుచుండు ననుట నిస్సంశయము. కథనమునందు వస్తు విస్తృతికి స్థానము కలదు. పూర్వాపరసంబద్ధమైనవస్తువునకు స్థానము కలదు. పూర్వాపరసంబద్ధ మైన వస్తువునకు స్థానము లేని బిరుదావళీ గాథలకంటె నాఖ్యా నము పరిణతరూప మనుట నిర్వివాదము. కవి కథన కౌశలమును కవితాకళకాక రమై యొక ఖండకావ్యప్రక్రియయైన యాఖ్యానమునందు చారిత్రకకావ్య మంకు రావస్థను దాల్చి మారాకు తొడిగి ప్రరోహావస్థను దాల్చిన దనుటలో నభ్యంతర ముండబోదు.

సంస్కృత గద్య కావ్యములలో 'పర్యాయబంధ'మను నొక భేదము చెప్పబడినది; 'ఒక్క వసంతాదులను గాని యొక్క మహారాజాదులనుగాని వారి విజయ యాత్రాదులనుగాని వర్ణించు ప్రబంధము 'పర్యాయబంధ' మని లాక్షణికులు నిర్దేశించిరి. మహారాజాదులనుకాని, వారివిజయ యాత్రలను గాని గాని వర్ణించునెడ నీ పర్యాయబంధము చారిత్రక కావ్యత్వము నేకదేశముగా పొందు నవకాశము కలదు. విజయయాత్ర చారిత్రక సత్యము కాగా తద్వర్ణనము దానికి కావ్యత్వ మాపాదించునుగదా! ఆఖ్యానములో కథనమునకు ప్రాధాన్య ముండగా పర్యాయబంధమునందు కథనముకంటె వర్ణనమునకు ప్రాముఖ్యము కలదని చెప్పవచ్చును. చారిత్రకకావ్యమునం దుండదగిన చారిత్రకత్వ వర్ణ

నాత్వము లను రెండులక్షణములును నీపర్యాయబంధమందు ప్రారంభావస్థలో ప్రత్యక్షమగుచున్నవని భావుకులు గ్రహింపవీలున్నది.

ఇంతవరకు చెప్పబడిన చతుర్విధ లఘుకావ్య ప్రక్రియలు తెలుగునందు ప్రత్యేకముగా లేకపోయినను నీకవితాస్రవంతు లన్నింటికి సంగమ తీర్థము వలె మనకు శాసన వాఙ్మయ మొక్కొక్కయెడ ప్రత్యక్షమగుచున్నది. శాసనములందు రాజబిరుదావళులను బేర్కొనుచు జేయు నాడంబర రచనయు, మహాదానాదిక సత్క్రియలను గీర్తించు స్తుతిరూపమగు గాథాప్రపంచమును, ప్రత్యక్ష చారిత్రకాంశ కథన రూప రచనా విన్యాసమును, విజయయాత్రాభి వర్ణనములును శాసనములందు గోచరమగుట తద్వాఙ్మయ సంశ్లిష్ట వ్యక్తిత్వమును సూచించుచున్నది. ఇట్టి రాజప్రశస్తి శాసనములు చారిత్రక కావ్యత్వాభివృద్ధికి కిసలయస్ఫూర్తిని కల్పించి యశఃపాత్రము లైనవి.

విజయ శాసనములలో కొన్నింట రాజవంశక్రమములను దానశాసనములందు దాతృగృహీతృ వంశాభివర్ణనములను బేర్కొనుట కానవచ్చుచున్నది. కావ్యవాఙ్మయములో నీశాఖయే విస్తరిల్లి కృతిభర్త, కృతికర్తల వంశాభి వర్ణన సంప్రదాయమునకు దారి తీసి యుండవచ్చును. ఇట్టి గ్రంథభాగములను కృత్యవతారిక లని పిలుచుచున్నాము. ఈ అవతారికలు చారిత్రక కావ్యఖండిక లనుట సత్యదూరము కాదు వంశపురుషుని మొదలు కృతిభర్త వరకు విస్తరిల్లి వంశమునకు కారకులైన మహాపురుషుల నొక్కొక్కరిని ముక్తకములవంటి ముచ్చటైన పద్యములతో వర్ణించి చెప్పుచుండుట యవతారికల సాధారణ లక్షణము. నేటి చరిత్రనిర్మాణమునకు బహువిధములైన వస్తుసామగ్రులను సంతరించిపెట్టుచున్న లఘు కావ్యప్రక్రియలలో నీ 'యవతారిక' లేక 'పీఠిక' యను కావ్యాంగ మొకటి. చారిత్రక వస్తుప్రాధాన్యము చేతను తత్తద్వంశ కర్తల వర్ణనావసరమున గానవచ్చు కావ్యవర్ణనాంశములచేతను అవతారికలు ప్రప్రథమాంధ్ర చారిత్రక కృతులని కీర్తింపదగియున్నవి. శాసనములందు చిగురులు తొడిగిన చారిత్రిక కావ్యత్వము అవతారికలందు కుట్మలించి తొలి యౌవనావస్థ నందుకొనినది.

కృతిపతి వంశాభివర్ణనాత్మకములయిన యవతారికలు కుట్మలావస్థను సూచించుచుండగా చారిత్రక కావ్యములు కుసుమావస్థను వంశావళీ

కావ్యములు నిర్దేశించుచున్నవి. అవతారికలు కావ్యాంగములు. వంశావళులు స్వతంత్రములు. వంశపురుషగుణచర్యాభివర్ణనము రెంటింటను సమానము. వంశావళియందు ఆలంకారిక రచనా ప్రౌఢిమ యధికముగా గోచరించును. వస్తువునకు వర్ణన మధికముగా ప్రౌఢముగా విలసిల్లిన కావ్య ప్రక్రియ యిది కవితాసౌరభము వెదజల్లు వంశావళీ వృత్తాంతములు వంశావళుల్కు వంశావళీ కావ్యమను విభాగము నేటి విమర్శకులచే ప్రత్యేకముగా నింకను గుర్తింప బడలేదు. తెలుగునందున్న రామరాజీయము వంటి కావ్యములు వంశావళీ కావ్యవిభాగమును ప్రత్యేకముగా గుర్తించు నవసరమును స్పష్టము చేయగలవు. వర్ణనాప్రధానములైన యీ వంశావళులలో కథనమునకు గౌణమైన స్థానము కలదు. అలంకార రచనకు అగ్రస్థానము కలదు. కావున చారిత్రక కావ్యత్వ మీ కావ్యప్రక్రియలో కుసుమావస్థనుజెంది యౌవనాలంకార ప్రాబల్యమును వెలార్చిన దనవచ్చును.

చారిత్రక కావ్యత్వమున కాలంకారిక రచన మలంకారమే కాని చారిత్రక వస్తువిస్తృతి వలె నంగసౌష్ఠవము కానేరదు. వంశావళీ కావ్యమునందు లేని యంగసౌష్ఠవమును సంతరించుకొని పొంగారిన యౌవన శోభతో తెలుగు సాహిత్యమున నవతరించిన మఱియొక చారిత్రక కావ్యశాఖ వంశకథాకావ్య ప్రక్రియఅని చెప్పవచ్చును. ఇవి వంశావళీకావ్యముల కంటె వైలక్షణ్యమును సంతరించుకొన గలిగినవి. వంశక్రమ చరిత్ర చెప్పుచు నడుమనడుమ ప్రసిద్ధ పురుషుల జీవితములలోని రసవత్తర ఘట్టములను విస్తరించి చెప్పుట యీ కావ్యనిర్మాణము నందలి ప్రత్యేకత. ఇట్టి రసవత్తర కథాఘట్టము లను వివిధ వర్ణ విరాజిత కుసుమములను వంశకథా సూత్రముతో కూర్చి గ్రథించిన మాలికవలె నీ కావ్య నిర్మాణ ప్రక్రియ వింతసోయగము వెలార్చుచుండును సిద్ధేశ్వర చరిత్రము వంటి వీ తరగతికి చెందిన యాంధ్రకృతులు. వంశకథా కావ్యమున వస్తువున కగ్రస్థానము. ఆ వస్తువు వంశకథనమునందు కంటె రమణీయ కథాఘట్టములను వివరించు పట్టున రసస్ఫోరకమై భాసించును. వంశకథనమున చారిత్రకత్వమును కథావిస్తృతియందు కావ్యత్వమును సంతరించుకొనుట యీ కావ్య స్వభావము. కాని యీ కావ్యకథ లొక్కొక్కటియు నొక్కొక్క వైశిష్ట్యముతో నొప్పారుటచే వానినడుమ రససమైక్యతగాని, ఏకవాక్యతగాని ఒక క్రమవికాసముగాని మనకు కానరాదు. వస్తువైవిధ్యదృష్టితో వెలసిన కథా కుటుంబము

గల వస్తుకావ్యమువలె నీ కావ్య ప్రక్రియ చారిత్రక కావ్యత్వము యొక్క ఫలోదయావస్థను వ్యక్తీకరించుననుట సత్యదూరము కాదు.

సమగ్ర చారిత్రక కావ్యావిష్కారముతో ఫలసిద్ధి యేర్పడుచున్నది. తెలుగునందు పందొమ్మిదవ శతాబ్ది అనంతర మీ ఫలసిద్ధి కనువైన కాల మాసన్నమైనది. భావకవులెందరో దీని పంటకు కాపులై కృషిచేసియున్నారు. తెలుగు వారికి గర్వకారణముగా తెలుగు కవితామతల్లికి నోములపంటగా నీ చారిత్రక కావ్యత్వ ఫలసిద్ధి ప్రాపించినది. చారిత్రక కావ్యము మహాకావ్యమువలె రస ప్రధానమైనది. ఏక చారిత్రక మహాపురుషుని విస్తృత వృత్తాంత మందు వస్తువు ఆ వస్తువు ప్రారంభ పరిణామ పరిసమాప్తులతో కూడిన సమగ్రతను దాల్చి రసోదంచిత సన్నివేశసంభరితమై రసభావదీప్తి కాకరమై యుండును. పాత్ర పోషణమున ప్రత్యేక శ్రద్ధ చూపబడును. వస్తువు సప్రమాణమైన చారిత్రక సత్యమై యుండుట దీని ప్రధానలక్షణము అట్లయ్యు నది రసమున కంగమగుట దానివైశిష్ట్యము. రసానందముతోపాటు సమకాలీన సాంఘిక ప్రయోజనముల నుపలక్షించి యుపదేశమునుగూడ నిర్వహించుట దాని కాంధ్రకవులు కల్పించిన యొక మహత్వము. ఉపదేశము సమకాలీనమయ్యు నది సార్వజనీనముగా సార్వకాలీనముగా నుండునట్లు తత్త్వసంపన్నముగా జేయుట యాంధ్రకవులు సాధించిన రచనాశిల్పము! ఇన్నిసుగుణములతో రసవత్ఫల భరితమైన మాకందము వలె మనోజ్ఞమైన శాఖోపశాఖలతో విరాజిల్లి ప్రౌఢావస్థను దాల్చిన కావ్య ప్రక్రియ చారిత్రక కావ్యము. శివభారతాదు లిట్టివి!

బిరుదావళిలో బీజరూపమై, గాథలో నంకురించి, ఆఖ్యానములో తలయెత్తి పర్యాయబంధములో రెమ్మతొడిగి, శాసనాదులలో చిగురించి, అవతారికలలో కుట్మలించి, వంశావళికృతులలో కుసుమించి వంశకథాకావ్యమునఁ బిందెవైచి చారిత్రక కావ్యరూపమున పరిణతి చెంది రసవత్సంభరితమైన యీ కావ్య వృక్షము యొక్క యుత్పత్తివికాసములను పైనపేర్కొనిన విధముగా నిరూపించుటకు వీలగును. పై ప్రక్రియలన్నియు కాలక్రమమున తెలుగులో వికాసము చెందినవా? యను ప్రశ్నకు సమాధానము చెప్పుట కష్టము. ఇట్టిక్లేశము ప్రసిద్ధ గీర్వాణ సాహిత్య పరిణామ నిరూపణము నందే కలదు! కావున లోకమున ప్రసిద్ధములై వెలసియున్న కావ్య ప్రక్రియల నాధారముగా జేసికొని చారిత్రక

కావ్యము యొక్క పరిణామ వికాసములను పరిశీలించుటయైనది. అన్ని ప్రక్రియల నాంధ్రకవు లాదరించిరని చెప్పలేము. ఆంధ్రసాహిత్య మావిర్భవించు నాటికే సంస్కృత కావ్యప్రక్రియలన్నియు సువ్యవస్థితములై యున్నవి. అం దే ప్రక్రియలపై మక్కువకలదో వానిని మాత్రమే తెలుగుకవు లాయాకాలములందు పాటించి యుండిరి. కొన్ని స్వతంత్రముగా కల్పించుకొనిరి. అందువలన పై వికాసక్రమ చర్చలో సంస్కృతాంధ్ర కావ్యప్రక్రియలను రెండింటి నాధారముగా చేసికొని ఆధునిక యుగము వరకు వెలసిన చారిత్రక కావ్యములను సమీక్షించి యొక క్రమవికాసమును ప్రతిపాదించుటయైనది. సహృదయుల కీ సమీక్షణము చిత్తముల కెక్కగలదని విశ్వసించుచున్నాను.

*

# పాల్కురికి చెప్పని బసవన్న కథ

—డా॥ ముదిగొండ శివప్రసాద్

బసవేశ్వరుడు మహా ప్రవక్త. గౌతముడూ, వర్ధమానుడూ కలిసి ఒక్కటిగా జన్మించిన అహింసాజ్యోతి. మహాత్మాగాంధీ వంటివారి అహింసా ధర్మానికి మార్గదర్శకుడు (మహాత్ముని హుబ్లీ ప్రసంగం.) ఆయన జన్మించినది కర్ణాటక దేశంలోని హింగుళేశ్వర బాగెవాడిలో. ఆయన ప్రధాన మంత్రిగా వున్నది కల్యాణ సామ్రాజ్యంలో. ఇది పశ్చిమ చాళుక్యులకు చెందినది. కాని అన్నింటికంటె ఆశ్చర్యకరమైనవిషయ మేమంటే బసవేశ్వరుని జీవితంపై వచ్చిన మొట్టమొదటి ప్రామాణిక గ్రంథం పాల్కురికి తెలుగులో రచించిన బసవపురాణం. తర్వాతి సమస్త కర్ణాటాంధ్ర కవులకూ, బసవన్న జీవితాన్ని గ్రంథస్థం చేసిన వారందరికీ ఇదే మూలగ్రంథ మయింది.

## మరొక ఆశ్చర్యం :

దీనిని మించిన మరొక ఆశ్చర్య మేమంటే అంతటి ప్రామాణికమైన బసవపురాణంలో కూడా పాల్కురికి సోమనాథుడు బసవన్న కథ పూర్తిగా చెప్పలేదు. దాదాపు సగానికి సగంకథ వదిలేశాడు. అంతేకాక చారిత్రకాంశాలు చాలా తారుమారు చేశాడు. వాటిని స్థూలంగా వివరించడమే ఈ చిన్న వ్యాసం యొక్క పరిధి.

## పాల్కురికి చెప్పిన బసవన్నకథ —

బసవపురాణ కథా ప్రణాళిక విచిత్రమైనది బసవేశ్వరుని కథను ఆధారంగా చేసికొని సందర్భోచితంగా పాల్కురికి వివిధ భక్తుల కథలను చెప్పాడు దాదాపుగా నాయనార్ల కథలన్నీ ఇందులో వచ్చాయి. ఇవికాక బసవన్న సమకాలీనులైన శివనాగుమయ్య, కిన్నెర బ్రహ్మయ, కిలకేత బ్రహ్మయ్య, మడివాల మాచయ్య వంటి భక్తుల కథలుకూడా బసవపురాణంలో వస్తాయి. వీటన్నింటినీ

తీసివేసి చూస్తే పాల్కురికి చెప్పిన బసవన్న కథ చాలా సంగ్రహమైనదే. హింగుళేశ్వర బాగెవాడి అనే బ్రాహ్మణ అగ్రహారంలో నందీశ్వరుని అవతారమైన బసవేశ్వరుడు శివాజ్ఞతో మాదిరాజ మాదాంబికల గర్భ శుక్తిముక్తాఫలమై జన్మిస్తాడు. తండ్రి ఉపనయనం జరుపబోగా 'భక్తికీ బ్రాహ్మ్యానికి పొత్తు కుదరదని' వాదించి ఇల్లు వదలి సంగమేశ్వరం చేరుతాడు. బసవన్న గొప్పతనం చూచి మేనమామ బలదేవుడు తనకుమార్తె గంగాంబను బసవన్న కిచ్చి వివాహం చేస్తాడు. బలదేవుని అనంతరం ఆయన నిర్వహించిన దండనాయక పదవిని బసవన్నకు ఇస్తాడు చాళుక్యరాజైన బిజ్జలుడు. దానిని బసవన్న సమర్థవంతంగా నిర్వహిస్తాడు అయితే బసవన్న చేసిన సాంఘిక సంస్కరణలు గిట్టనివారు బసవన్నకూ బిజ్జలునికీ విరోధం వచ్చేటట్లు చేస్తారు. దానితో బిజ్జలుడు భక్తులను హింసిస్తాడు. అది చూడలేక అహింసామూర్తి బసవన్న రాజధాని కల్యాణ్ వదిలి సంగమేశ్వరం వెళ్ళిపోతాడు ఆ తర్వాత కల్యాణ్‌లో విప్లవం వస్తుంది. అందులో బిజ్జలుడు హత్యచేయబడతాడు. సంగమేశ్వరంలో బసవన్న లింగైక్యం చెందుతాడు. స్థూలంగా ఇదీ పాల్కురికి చెప్పిన బసవన్న కథ.

## పాల్కురికి చెప్పని బసవన్న కథ:—

తర్వాతి చారిత్రకాధారాలతోనూ హేతువాదంతోనూ కన్నడ దేశంలో పరంపరాగతంగా వస్తున్న జానపద రగడ గీతాలతోను పోల్చి చూచినప్పుడు పాల్కురికి చాలాకథను చెప్పకుండా వదిలివేశాడని స్పష్టమౌతున్నది. బసవన్న కథను రచించిన చాలమంది కర్ణాటక ఆంధ్ర కవులుకూడా కొంచెం ఇంచుమించు పాల్కురికి కథనే స్వీకరించారు. అయితే చాలా విషయాలలో అందరు కవులూ ఏకాభిప్రాయానికి రాలేదు. బసవన్నపై కన్నడంలోని మొదటి గ్రంథం హరిహరుని బసవరాజ రగళె. ఇదికూడా అసమగ్రమైన గ్రంథమే. సగానికి సగం కథ మాత్రమే వుంది. మిగిలిన సగము కథా మతయుద్ధాలలో తగుల బెట్ట బడిందని కన్నడ మిత్రులు నాతో చెప్పారు. ఆ తగుల బెట్టబడిన భాగమేమిటో కూడా మనమిప్పుడు పరిశీలిద్దాము. అది లావణ్యవతీ శీలవంతుల వృత్తాంతం. ఇదే కల్యాణంలో విప్లవం రావడానికి బిజ్జలుని హత్యకూ మూలమైనకథ. దానిని గూర్చి పాల్కురికి ఒక్క అక్షరంకూడా వ్రాయలేదు. హరిహరుని రగళెలో ఈ కథా భాగం పూర్తిగా లుప్తమై పోయింది.

మంగళవాడ వృత్తాంతము :-

లావణ్యవతీ శీలవంతుల ప్రణయ వృత్తాంతం చెప్పడానికి ముందు పాల్కురికి గ్రంథంలోని కొన్ని చారిత్రక ప్రామాణ్యంలేని విషయాలు చెపుతాను. అందులో ఒకటి మంగళవాడ వృత్తాంతం. మంగళవాడలో బసవేశ్వరుడు చాలా కాలం జీవించాడు. అదే బసవన్న చేసిన ప్రయోగాలన్నింటికీ రంగస్థలం. అక్కడ చాలా కథ జరిగింది. దానినంతా పాల్కురికి వదిలివేశాడు. అసలు మంగళవాడ పేరునే పాల్కురికి ఉదాహరించలేదు. బిజ్జలుడు చాళుక్య సామంతుడుగా ఉన్నప్పుడు బసవన్న ఆయన కొలువులో వ్రాయసగాడు (క్లర్కు)గా వుండేవాడు. ఒకనాడు భూమి త్రవ్వుతుండగా ఒక శాసనం దొరికింది. దానిని ఎవరూ చదువలేక పోయారు. బసవేశ్వరుడు మాత్రం దానిని చదివి ఆ శాసనం ప్రకారం గుప్తధనం గూర్చిన సమాచారం బిజ్జలునికి చెపుతాడు. బిజ్జలునికి ధనం లభ్యమవుతుంది బసవన్నపై గౌరవం పెరుగుతుంది. పాల్కురికి ఈకథ నంతా వదిలివేశాడు.

చారిత్రక సత్యాలు :-

అంతేకాదు బిజ్జలుణ్ణి పాల్కురికి 'చాళుక్యరాజు' అని బసవపురాణంలో చెప్పాడు చారిత్రకంగా బిజ్జలుడు చాళుక్యరాజు కాడు. చాళుక్య సామంతుడు

"సాధిత చాళుక్యేంద్రాయ నమో" "శాపనిహత చాళుక్యాయ నమో" అని నమస్కారగద్యంలోను

"అవనిలోఁ జాళుక్యు లను పేరు హరుని
కవిలెలో దుడిపించి కల్యాణకటక
మీడితభక్తి మహిష్ఠత పేర్మి"
బాడుగా శపియించె బసవన మంత్రి.

అని పండితారాధ్య చరిత్రలోకూడా పాల్కురికి చెప్పాడు అయితే బిజ్జలుడు మధ్యభారతం నుండి వలస వచ్చినరాజు. పశ్చిమ చాళుక్య రాజ్యాన్ని మూడవ తైలపుడు పరిపాలిస్తున్నప్పుడు బిజ్జలుడు మంగళవాడను కేంద్రంగా చేసుకొని పాలిస్తున్న ఒక సామంతుడు. ఈతడు కాలచూరి వంశానికి చెందిన రాజు. అయితే మహామేధావి. అందువల్ల తన తెలివితేటలు ఉపయోగించి ప్రభు

నైన తైలపుణ్ణి కాకతీయ సామ్రాజ్యంమీదికి దండెత్తక తప్పని ఒక పరి స్థితిని కల్పించాడు. కాకతీయ రాజ్యాన్ని అప్పుడు ప్రోలరాజు పాలిస్తున్నాడు. మూడవ తైలవుడు ప్రోలుని చేతిలో పరాజితుడై కొడుకు సోమేశ్వరునితో సహా హనుమకొండలో బందీ చేయబడ్డాడు. ఈ అదను చూచుకొని తైలవుని పేర బిజ్జలుడే చాళుక్య సార్వభౌముడై తనరాజధానిని మంగళవాడ నుండి కల్యాణ్‌కు మార్చుకున్నాడు అప్పుడా బిజ్జలునితో పాటు బసవన్నకూడా కల్యాణ్ వచ్చాడు. బసవన్న కల్యాణ్‌లో బిజ్జలుని ప్రధానమంత్రిగా వున్నది క్రీ శ. 1162 నుండి 1167 వరకు మాత్రమే. 1167 మార్చి నెలలో బిజ్జలుని హత్య, మహావిప్లవమూ కల్యాణనగరంలో జరిగాయి. అంటే బిజ్జలుడు చాళుక్య రాజ్యాన్ని పాలించిందీ బసవన్న కల్యాణ్‌లో వున్నదీ కేవలం ఆరుసంవత్సరాలు మాత్రమే. ఈ ఆరేండ్లలోనూ బసవన్న అంతటి లోకోన్నతమైన సంస్కరణలు చేశాడనడం సాధ్యపడదు; హేతువాదానికీ నిలువదు. బసవన్న చాలా సంవత్స రాలు మంగళవాడలోనే ఉన్నాడు. అప్పుడే తన సంస్కరణలన్నీ బసవన్న ప్రారంభించాడు. ఈ విషయమంతా పాల్కురికి చెప్పలేదు. నేరుగా కప్పడి సంగమేశ్వరం నుండి కల్యాణ్ రాజధానికి బిజ్జలుడు బసవన్నను పిలిపించు కొన్నట్లు వ్రాశాడు. (బసవ పురాణం. ద్వితీయాశ్వాస ప్రారంభం.). మంగళ వాడలో బసవన్న ఉన్నప్పుడే కుటీర పరిశ్రమలకు ప్రాధాన్యం ఇచ్చాడు, అస్పృశ్యత నివారించాడు. వ్యక్తికి సొంత ఆస్తి ఉండకూడదనే ఆర్థికవ్యవస్థ ప్రతిపాదించాడు. స్త్రీలకు పురుషులతో సమానంగా అన్ని రంగాలలోను ప్రాధా న్యాన్ని కల్పించాడు. "సృష్టిలో శ్రామికులే గొప్పవారని" చాటి 'కాయకమే కైలాసమయ్యా' (Work is worship) అనే మంత్రాన్ని ఉపదేశించాడు. జన్మనుబట్టి కాక కర్మనుబట్టి ఉత్తమకులాన్ని నిర్ణయించాడు. చాతుర్వర్ణ్య వ్యవస్థను ధిక్కరించాడు మాలవారికీ, మాదిగవారికి, దొంగలకూ, వేశ్యలకూ సామాజిక గౌరవం కల్పించాడు. బసవన్న మంగళవాడలో చేసిన ఈ సంస్క రణలను గూర్చి చెప్పకుండా వదిలివేశాడు పాల్కురికి సోమనాథుడు.

**అనుభవ మంటపము :—**

కల్యాణ్‌నగరానికి వచ్చాక బసవన్న తన "మహామానె" (రాజగృహం) ఒక భక్తకూటమిగా మార్చాడు. ప్రతిదినమూ ఇక్కడ భక్తులు సమావేశ మయ్యేవారు. దీనికి అల్లమ ప్రభువు అధ్యక్షుడు. ఆయన అలంకరించిన అధ్యక్ష

పీఠం పేరు శూన్యసింహాసనం. కార్యదర్శి చెన్న బసవన్న. ఈయన బసవేశ్వరుని అక్కగారైన నాగాంబిక కొడుకు. ఇక్కడనే సమస్త వేదాంత చర్చలు, సంఘ సంస్కరణాత్మక నిర్ణయాలూ జరిగేవి. పాల్కురికి "అనుభవమంటపం" గూర్చి బసవపురాణంలో చెప్పలేదు.

లావణ్యవతీ శీలవంతుల కథ :—

కల్యాణ్‌లో హరిజనవాడలో హరళయ్య అనే చెప్పులు కుట్టుకునే జంగమయ్య వున్నాడు. ఆయన కొడుకు శీలవంతుడు. బిజ్జలుని మంత్రులలో ఒకడైన మధువరసు కుమార్తె లావణ్యవతి. బసవన్న ప్రభావానికి లోనై మధువరసు సకుటుంబంగా బ్రాహ్మణ్యన్ని వదిలి వీరశైవం స్వీకరించాడు. "అనుభవ మంటపం"లో సభ్యుడైనాడు. అనుభవ మంటపంలోని సభ్యులకు కులాలు ఉండవు. అందువల్ల లావణ్యవతి అనుభవమంటపం సభ్యుడైన శీలవంతుణ్ణి వివాహం చేసుకుంది. దీనితో కల్యాణ్‌లో విప్లవం వచ్చింది. బిజ్జలుడు మధువరుసును, లావణ్యవతిని, హరళయ్యను. శీలవంతుణ్ణి వీధులలో ఊరేగించి ఏనుగులచేత తొక్కించి చంపించాడు. ఈ కథ సోమనాథుడు చెప్పలేదు.

"అంత బిజ్జలుడు దాఁ గొంత కాలమున
....................................
మడియించి యల్లయ్య మధుపయ్య గారి
తప్పేమియును లేక చొప్పు గాదనక
రప్పించి కన్నులు వుప్పించె నంత — —"

(బసవపురాణం సప్తమాశ్వాసం 1310-14 పంక్తులు.) అని మాత్రమే సోమనాథుడు వ్రాశాడు. అలాగే హరిహరుని బసవరాజరగళెలోకూడా ఈభాగం గల అధ్యాయాలన్ని తగలబెట్టబడ్డాయి. అవి నేడు అలభ్యాలు.

బిజ్జలుణ్ణి చంపించింది ఎవరు ?

హరళయ్య, మధు వరసుల హత్యలు చూచి బసవన్న కోపించి జగదేవుడనే భక్తుణ్ణి పిలచి "పోయి బిజ్జలుణ్ణి చంపిరమ్మ"ని ఆనతిచ్చినట్లు పాల్కురికి వ్రాశాడు. (సప్తమాశ్వాసం 1870 నుండి 1900 వరకు పంక్తులు.) ఇది నూటికి నూరుపాళ్ళు అబద్ధం. బిజ్జలుడు కాలచూరి రాజు. బలవంతంగా చాళుక్య

సామ్రాజ్యాన్ని ఆక్రమించాడు కాబట్టి చాళుక్యరాజు మూడవ తైలపుని యెడల ప్రేమగలవారూ మూడవతైలపుని కొడుకు సోమేశ్వర యువరాజు బిజ్జలుని యెడల పగబట్టి వున్నారు నాడు అరాజకాన్ని రేపింది ఈ రాజకీయ వర్గాలే. బిజ్జలుణ్ణి చంపినవారు ముగ్గురు. వారు మల్లయ్య, బ్రహ్మయ్య, జగదేవుడు అనే వారు. వీరు ముగ్గురూ చాళుక్యరాజైన తైలపునికి ఆంతరంగికులు, మండలాధిపతులు. ఇందులో జగదేవుడు పాలించే మండలాన్ని బిజ్జలుడు బలవంతంగా ఆక్రమించుకొని జగదేవుణ్ణి పరారీ చేయించాడు. వీరంతా సమయం చూచుకొని తమ రాజకీయ కక్షలు సాధించుకున్నారు. అంతేకాని "పామునూ చీమనూ కూడా చంపవద్దనే ' అహింసామూర్తి బసవన్న నరహత్యకు ప్రోద్బలం చేశాడనడం హేతువాదానికే విరుద్ధం. కల్యాణంలోని విప్లవం చూచి ఖిన్నుడై బసవన్న కూడా సంగమేశ్వరం చేరి ఆత్మార్పణం చేసుకున్నాడు. ఇదీ యథార్థ చరిత్ర. భక్త్యావేశంలోనూ కవితావేశంలోనూ మునిగిన పాల్కురికి చారిత్రకాంశాల యెడల ఎక్కువ శ్రద్ధ చూపింపలేదు.

## బసవేశ్వరుని పరివారం-

పాల్కురికి గ్రంథాన్ని బట్టి బసవన్న భార్యపేరు గంగాంబ అని స్పష్టమౌతున్నది. ఈమె బలదేవుని కుమార్తె అని పాల్కురికి పేర్కొన్నాడు. (ప్రథమాశ్వాసం. 1040 పంక్తి). ఈమెతో బసవన్నకు వేదోక్తమైన వివాహం జరిగినట్లు పాల్కురికి చెప్పాడు (వేదోక్త శివధర్మ విధి బసవనికి గాదిలి సుతఁ బెండ్లిగావించె నంత-ప్రథమాశ్వాసం. 1104 )

"వేదోక్త శివధర్మ విధి" అంటే శ్రౌతశైవం. దానినే ఆరాధ్య శైవం అంటారు. దీనినిబట్టి బసవేశ్వరుడు ఆరాధ్యబ్రాహ్మణుడని పాల్కురికివల్ల తెలుస్తున్నది. అయితే బసవన్న నియోగిబ్రాహ్మణుడని కొందరు కర్ణాటకులు అభిప్రాయపడుతున్నారు. ('రాజు' శబ్దం పేరులోనూ ఇంటిపేరులోనూ నియోగులకే ఉంటుందనీ మాదిరాజు కొడుకు నియోగియేననీ వీరివాదం. రాయచూరులోని శ్రీశిఖర మఠాధిపతి కూడా నాతో వ్యక్తిగత సంభాషణలో ఈ విషయమే వ్యక్తీకరించారు). అంతేకాక బసవన్నకు 'నీలలోచన' అని మరో భార్య వున్నట్లు కర్ణాటక గ్రంథాలు కొన్ని సాక్ష్యమిస్తున్నాయి. ఈమె ఎవరో తెలియడంలేదు. బిజ్జలుని చెల్లెలని కొందరన్నారు. బసవణ్ణి విమర్శిస్తూ వ్రాసిన కొన్ని జైన

గ్రంథాలలో "బసవన్న చెల్లెలు పద్మావతి అనే ఆమెను మోహించి బిజ్జలుడు వివాహ మాడినట్లు" వ్రాశారు. అది చారిత్రకంగా అసత్యం. అయితే బిజ్జలుని సోదరి నీలలోచనను బసవన్న వివాహం చేసుకున్నాడని కొందరు కన్నడ సాహితీవేత్తలు వ్రాశారు. దీనిపై ఇంకా పరిశోధన జరుగవలసి వుంది.

బసవన్నకు బాలసంగయ్య అనే కొడుకు ఉన్నట్లు కర్ణాటకులు చెప్తున్నారు. పాల్కురికి ఈ విషయం చెప్పలేదు. బసవన్నకు దేవరాజు అనే అన్న వున్నట్లు కొందరు కన్నడ శాసన పరిశోధకులు ఊహించారు. పాల్కురికి ప్రకారం ఇది అసత్యం. మాదాంబిక పుత్రులు లేక నందికేశ వ్రతంచేస్తే బసవన్న పుట్టినట్లు బసవపురాణంలో వుంది. (ప్రథమాశ్వాసం. 696వ పంక్తి) ఇదే సత్యం కావచ్చు.

## పరిశోధన అవసరం :-

బసవేశ్వరుని జీవితాన్ని గూర్చి చారిత్రకాంశాల గూర్చి కర్ణాటకులు చాలా పరిశోధనలు చేశారు కాని అవి ఇంకా అసంపూర్ణాలేనని అనిపిస్తున్నది. కన్నడంలో బసవన్నపై ఎన్ని గ్రంథాలు వచ్చాయో దాదాపు అన్నీ తెలుగులో వచ్చాయి. భీమకవి, సింగరాజు వ్రాసిన కన్నడ బసవపురాణాలకు పాల్కురికి బసవపురాణమే మాతృక. కూడా. అయితే బసవన్నను గూర్చిన చారిత్రకాంశాల యెడల కర్ణాటాంధ్ర కవులంతా అన్ని విషయాలలోనూ ఏకాభిప్రాయానికి రాలేక పోతున్నారు. బసవన్న జన్మతిథినిగూర్చే ఇంకా ఏకాభిప్రాయం లేదు. (ఆర్ద్రోదయంలో జన్మించినట్లు పాల్కురికి అభిప్రాయం. ప్రథమాశ్వాసం 760వ పంక్తి). కన్నడిగులు బసవన్న జయంతి వైశాఖ శుద్ధ తృతీయనాడు జరుపుతున్నారు. మొత్తంమీద పాల్కురికి సోమన్న బసవన్నకథను ఎంత వదిలిపెట్టినప్పటికీ బసవనిపై జరుగవలసిన సమస్త పరిశోధనలకూ పాల్కురికి బసవపురాణాన్నే అందరూ ఆధారం చేసుకోవలసి వుంది !! ★

# తెనుఁగు మఱుఁగులు

—శ్రీ వి. వి. తిరుపతయ్య

అప్పకవి తెనుఁగు మఱుఁగులను ఈ క్రింది పద్యమున వివరించెను.

అబ్ధి మేఖల కుదయించినట్టి సీతఁ
జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ
గడలి మొలనూలి చేడియ గనిన పడుచుఁ
దెచ్చుకొనె రాముఁ డనగను దెనుఁగు మఱుఁగు",

(అ. క. ప. 112)

"కడలి మొలనూలి చేడియ గనిన పడుచు" ఇందలి పదములన్నియు దేశ్యములే ఇవి సమాసముగ రూపొందినవి. ఇట్లు సమాసములుగ కల్పింపఁబడిన శబ్దములు సంస్కృత సిద్ధ సమాసముల ననుసరించి యేర్పడినవి. ఈ ప్రక్రియను తెలుపుటకే అప్పకవి తెనుఁగు శబ్దజాలమున తెనుఁగు మఱుఁగులను భేదము నొకదానిని సృష్టించెను. దీనినే ఆచార్య శ్రీగంటి సోమయాజి గారిట్లు వివరించినారు.

[1]"అప్పకవి తెనుఁగు మఱుఁగులు అను నొక విశేషమును నిరూపించెను దాని కుదాహరణముగా 'కడలి మొలనూలి చేడియగనిన పడుచు'(సీత)అనుదాని నొసంగెను. ఈ యుదాహరణమునందలి సమాసమువంటి సమాసములయిన పదములు సంస్కృత సిద్ధసమాసముల ననుసరించి తెలుఁగుకవు లనేకములు కల్పించిరి. ఆంధ్రనామ సంగ్రహమున నట్టి వనేకములు గలవు. చక్రధరః= చుట్టుకైదువుజోదు, దైత్యారిః=సోకుమూకలగొంగ, పీతాంబరః=పచ్చవలువ దారి. త్రిశూలి=ముమ్మొనవాలుదాల్పు, ఇట్టి పదములు తెనుఁగున దైనిక వ్యవహారమున సామాన్యులలో గలిగినవికావు. కారణ మూహించుట సులభము. పురాణములలోని గాథల ననుసరించి కల్పించిన వీ పదములు. ఆ పురాణ

1. ఆం. భా. వి. పు. 583.

గాథలు సంస్కృతమునఁ గాల్రకమమున నా భాష మాటాడు వారి విజ్ఞానమువలన నేర్పడినవి. ఆగాథలతో నా పేర్లును దమంతట నేర్పడి యుండకతప్పదు. కొన్ని కవులచే నందే కల్పింపఁబడియుండును. అట్టి పదములను, అనఁగా చాలాకాలమునకు ముందు సిద్ధములైనవానిని తత్సమములుగా కవులు గ్రహించి తెనుఁగునఁ బ్రయోగించిరి. వానికి తెనుఁగున పదాంతములను గల్పించుటవలనఁగలిగిన వీతెనుఁగుమఱుఁగులు. 'సప్తమైద్వరు, గుండ్రబల్ల సమావేశము' మొదలగు నేటి పదముల వంటివి. వీనియర్థము సరిగా తెలియవలెనన్నచో పౌరాణికగాథలు కొంతవఱకైనను తెలియవలెను. లేకున్నవానిఁబ్రచారమును బ్రయోగమును గలుగదు. కావుననే యిట్టి పదములు నేటికి చాలఁ అకు ప్రచారములో లేవనవచ్చును. వీనికి తెనుఁగు మఱుఁగులు అని పేరేలవచ్చిన దనియు ఎందుండిపచ్చినదనియు విచారింపఁదగినది. మఱుఁగు అనఁగా చాటు అని యర్థము. తెలుఁగున గల్పింపఁబడి సులభముగా భావమెఱుఁగబడని పదమని యర్థము కావచ్చును. స్వతంత్రముగా నీ సంజ్ఞ తెనుఁగుననే కల్పింపఁబడి యుండవచ్చును."

తెనుఁగు మఱుఁగులను గూర్చిన సోమయాజిగారి యూహ యుక్తియుక్తముగానే యున్నది. ఇట్టి ప్రక్రియ అరవమునందుగూడ నగుపడుచున్నట్లు వారభిప్రాయపడినారు. [2]"అరవవ్యాకరణమున వాడుకను మూఁడు విధములుగా నిరూపించుచు 'మరూ ఉ' అను నొకజాతిని నిరూపించిరి దీర్ఘములైన సమాసములు మొదలయినవి వాడుకలో హ్రస్వములయి మార్పురాగా నేర్పడిన పదములు. అరుమరుందన్న పిళ్ళై = అరుమందపిళ్లై; మలైయమానాడు=మలాడు-పయిరీతి నేర్పడిన పదములు 'మరూ ఉ' అనఁబడును. పైసంజ్ఞను జూచి తెనుఁగున తెనుఁగు మఱుంగు అను పదమును గల్పించిరో యని యూహింపవచ్చును. ఒకదానిలో శకటరేఫము రెండపదానిలో లఘురేఫము. తమిళములో 'మరువు' కూడిన అను పదమునుండి యేర్పడిన దీ శబ్దము. మొత్తముమీద కొంత సామ్యముగలదుగాని నిశ్చితముగా తమిళమునుండి యీసంజ్ఞ తెనుఁగునకు వచ్చినదని చెప్పఁజాలము". ఇది తమిళమునుండి రావచ్చును. కాని ఏర్పడిన విధానము మాత్రము సంస్కృత సిద్ధసమాసములనుండియే అని చెప్పక

2. అం. భా. వి. పు. 584.

తప్పదు. ఇంచుమించు తెనుఁగు మఱుఁగులుగా నేర్పడిన పదములన్నింటికి తుల్యములైన సిద్ధసమాసములు సంస్కృతమున నుండుటే దీనికి తార్కాణము.

తెనుఁగు మఱుఁగులను శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వివరించుచు[3] "తత్సమ పదములను పరిహరించి తదర్థమును డొంకతిరుగుడు తెలుగు సమాసముల మూలముగాఁ జెప్పినచో నట్టి శబ్దములు తెలుఁగు మఱుఁగులగును. ఇవి భాషలో సహజముగ వ్యవహారములో నున్నవిగాని, ప్రాచీన కవులరచనా పరిపాటిలోనివి గానిగాక, విశేషంబుగా తత్సమ బహుళంబుగాఁ జొచ్చిన ఆంధ్ర భాషపైఁ గలిగిన యేవగింపును సూచించుటకో యన్నట్లు 16వ శతాబ్ది ప్రాచీన ప్రాంతమున గౌంద రాంధ్ర కవులు అచ్చతెనుఁగు పేరున గల్పించిన యొక విధమగు కృతకభాషారూపములని చెప్పవలసియున్నది. అప్పకవి పేర్కొనిన యీ తెలుఁగు మఱుఁగులను వానిని వెనుకటి లాక్షణికులు పేర్కొనక పోవుటచే నివి అప్పకవి సమీప కాలముననే బయలుదేరిన వనవచ్చును." అప్పకవి సమీప కాలమున నెక్కువ సంఖ్యలో బయలుదేరి యుండనోపును. అంతకుపూర్వమిట్టివి బొత్తిగలేవని యనుటకు వీలులేదు నన్నయభట్టారకుఁడు భీముని 'గాడ్పుకొడుకు' [ఆది. ప. ఆ 5 వ 173], 'గాడ్పుచూలి' [ఆది. ప. ఆ 6. ప 23] అని వ్రాసి యుండుట గమనింపఁదగియున్నది. నాచన సోముఁడు హరివంశమున శివుని

"ఏనికతోలు పచ్చడము నెమ్మల గుబ్బ సరంబు సంప పూఁ
దేనియ తియ్యవిల్లుగొని త్రెంచిన బొట్టుఁ బలుంగు నెట్టము
న్వీనులచూపుపెండెము దవిల్చిన మంచము కోటి కైదువుం
బూనిన ప్రాఁత వేల్పు" (ఉ. హ. ఆ 2. ప 173.)

అని చెప్పెను. ఇదికూడ అప్పకవి చెప్పిన తెనుఁగు మఱుఁగు వంటిదే. కావున తెనుఁగు మఱుఁగుల నప్పకవి సమీపకాలముననే బయలుదేరినవనుట సమంజసము కాదు. ఆ కాలమున నెక్కువ ప్రచారము లోనికి వచ్చిన వనఁ జెల్లును. పారిజాతాపహరణమున తిమ్మన చంద్రుని

"వలిమలయల్లువాఁడు తల వాఁక ధరించిన పూవుగుత్తి వే
ల్పులగమిజీవగఱ్ఱ యుడివోవని చల్వలసెంకి వెన్నెల
ల్కొమ్మలచినపాదు పాల్కడలి ముద్దులపట్టి"
(పారిజాతాపహరణము పీఠిక ప. 6)

3. భా. చా. వ్యాసములు పు. 125.

అని చెప్పెను. ఈ పద్యమున 'ధరించన' అను పదము తప్ప మిగిలిన వన్నియు తెనుఁగు మఱుఁగులే యగును. ఈ క్రింద నుదాహరించిన తిమ్మన ప్రయోగములు కూడ నిట్టివే.

| | |
|---|---|
| పంటవలంతి తొొయ్యలి (భూమి యను వనిత) | పారి. పీఠిక. ప 24 |
| ప్రామినుకుల దొంగ (సోమకాసురుఁడు) | పారి ఆ 1 ప 49 |
| పొట్టిదిట్ట (వామనుఁడు) | ,, |
| వలి గుబ్బలి ముద్దు పట్టి (పార్వతి) | పారి. ఆ 1 ప 55 |
| మతకరి వేలుపుందపసి (నారదుఁడు) | పారి. ఆ 1 ప 84 |
| వేఁడి వెలుఁగు (సూర్యుఁడు) | పారి. ఆ 2 ప 37 |
| పొడుపు గుబ్బలి (ఉదయాద్రి) | పారి. ఆ2 ప 39 |
| చలువల ఱేఁడు (చంద్రుఁడు) | పారి ఆ2 ప 46 |
| చిగురు విలుకాఁడు (మన్మథుఁడు) | పారి. ఆ2 ప 49 |
| చుక్కల దొర (చంద్రుఁడు) | పారి. ఆ2 ప 60 |
| అంకెలిడు పోఁటరి గిబ్బ ఱేఁడు (వృషాధిపుఁడు) | పారి. ఆ2. ప 85 |
| రేవెలుంగు (చంద్రుఁడు) | పారి. ఆ5. ప 10 |
| పులుఁగుల ఱేఁడు (పక్షీంద్రుఁడు) | పారి. ఆ5. ప 27 |
| చివ్వల యోగిరపుఁదపసి (కలహభోజనముని-నారదుఁడు) | పారి. ఆ5. ప 74 |

తెనుఁగు మఱుఁగుల వంటివి అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయమునను పెక్కుఁగలవు.

| | |
|---|---|
| పలుకుఁబోంతి (సరస్వతి) | రామా. పీఠిక. ప 47 |
| వేల్పుదొర (దేవేంద్రుఁడు) | రామా పీఠిక. ప 47 |
| లేగాడ్పు కుఱ్ఱ (వసంతుఁడు) | రామా. ఆ1. ప 47 |
| బలుమంచు మించుదొర (చంద్రుఁడు) | రామా. ఆ1. ప 48 |
| రేవెలుంగుల తాల్పు [శంకరుఁడు] | రామా. ఆ2. ప 58 |
| చలిమలచూలి [పార్వతి] | రామా. ఆ2. ప 58 |

రామభద్రుఁడు చంద్రునిట్లు వర్ణించెను.

"చలువ వెలుఁగు రేమగఁడు జక్కవ నెచ్చెలి జోడుకోడె చు
క్కలజవరాంద్రలో ననుపుకాఁడు జగంబులచూస్కివిందు చెం
గలువల కోరిదారివిలు కానికిఁ గూర్చిన మామ పండు వె
న్నెలగని చందమామ కడునింగిఁ జెలంగి వెలింగెనెంతయున్"
[రామా. ఆ2. ప 95]

పొడుపుఁగొండ కేసరి (చంద్రుఁడు) రామా. ఆ2. ప. 102
పాల్కడలి యిల్లటపల్లుఁడు (విష్ణువు) రామా. ఆ3. ప. 44

రామాభ్యుదయమున శ్రీమన్నారాయణుని వర్ణించిన ఈ క్రింది పద్యమున తెనుఁగు మఱుఁగులవంటి సమాసములు కననగును.

"తొవతమ్మివిందు గన్దోయి మించినవాఁడు
జాళువా మిసిమి పచ్చడమువాఁడు
కన్నుపీనులసెజ్జ నున్న వన్నియవాఁడు
తపసిడెందపుటిండ్లఁ దనరువాఁడు
తొంటి జేజేమూఁకఁ దూలింపఁగలవాఁడు
ముజ్జగంబుల చూలు బొడ్డువాఁడు
సొగసి నవ్వాక నవ్వు నెమ్మొగము వాఁడు
కలుము లీనెడు తళుకుఁగ్రీగంటి వాఁడు
పేదసాదల బ్రదికించు పెంపువాఁడు
పాలమున్నీటిలోనఁ జూపట్టె నపుడు."
(రామా. ఆ3. ప 45.)

మున్నీటి యల్లుఁడు (విష్ణువు) రామా. ఆ3. ప 50
చుక్కల రాజు (చంద్రుఁడు) రామా. ఆ3. ప 52
కాఁక వెలుఁగు (సూర్యుఁడు) రామా. ఆ3. ప 52

తెనుఁగు మఱుఁగు లీ క్రింది పద్యమునందును కలవు.

"చుట్టుం గ్రైదువజోదు ప్రామినుకుటంచుల్ మెట్టు పెన్ప్రోడ పొం
బుట్టం బూనిన వన్నెవేల్పుదొర వేల్పుం జెట్టరాకాసులన్
జట్టల్ చీజెడిదిట్ట పంటవలఁతిన్ జాబిల్లితోఁబుట్టుఁ జే
పట్టంగల్గిన భాగ్యశాలి యటులం బాటిల్ల జేజేగముల్."

(రామా. ఆ3. ప 54)

పదితలల రక్కసుఁడు (రావణుఁడు) రామా. ఆ3. ప 65.
కదలిమొలనూలినవలా యొడయనిఁబది తేరులయ్య (దశరథుఁడు)
రామా ఆ4 ప 3.
జడదారిమేటి రావంగడపుఁబాఱుండు (విశ్వామిత్రుఁడు) రామా. ఆ4. ప 3.
పుడమి ముద్దరాలినెయ్యంపుఁజూలి (సీత) రామా. ఆ4. ప 64
పంట పూఁబోఁడిగారాపుఁబట్టి (సీత) రామా. ఆ4. ప 73.
కలిమికన్నియ (లక్ష్మి) రామా. ఆ4. ప 121
పంటచెలి (భూమి) రామా. ఆ5. ప 19
పట్టపగలింటిమింటి మానికము (సూర్యుఁడు) రామా. ఆ5 ప 32
రెంటఁద్రాగుడు మెకంబులు (ద్విపములు) రామా. ఆ5. ప 51.
తొవచెలి జంట కొలంపురాచసింగపుఁగొదమల్ (సూర్యవంశ
శ్రేష్ఠులగు రామలక్ష్మణులు) రామా. ఆ5 ప 53
పుడమి పుట్టగు నెలఁతుక (సీత) రామా. ఆ5. ప 53.
పుడమిపట్టి (సీత) రామా. ఆ5. ప 65. 205, 231
చుక్కమగవానియయ్య (సముద్రుఁడు) రామా. ఆ5. ప 121.
నాగటిచాలిపేరియతివ (సీత) రామా. ఆ5. ప 189.
పుడమిపుట్టువు (సీత) రామా. ఆ5. ప 241
తమ్మిదొరచూలి (సుగ్రీవుఁడు) రామా. ఆ5. ప 262.
గాడ్పుకొమరుండు (ఆంజనేయుఁడు) రామా. ఆ5. ప 262.
తమ్మిచూలి (బ్రహ్మ?) రామా. ఆ5. స 377.
తమ్మిచూలి (సూర్యుఁడు?) రామా. ఆ5. ప 312.
చుఱుకు మినుకుఁజేనికొడుకు (సుగ్రీవుఁడు) రామా. ఆ6. ప 42,
గాడ్పుదేవరగారాపుఁగన్నకొడుకు (ఆంజనేయుఁడు) రామా. ఆ6. ప 82
గాడ్పు కొడుకు (ఆంజనేయుఁడు) రామా. ఆ6. ప 82

| | |
|---|---|
| గాడ్పు వేల్పుపట్టి (ఆంజనేయుఁడు) | రామా. ఆ6. ప 92 |
| కరువలివేలుపుఁ గొడుకు (ఆంజనేయుఁడు) | రామా. ఆ6. ప 96. |
| వేగంటిదేవర (శివుఁడు?) దేవేంద్రుఁడు, | రామా. ఆ6. ప 104 |
| కరువలి కొడుకు (ఆంజనేయుఁడు) | రామా. ఆ6 ప 105 |
| చక్కెరవిలుకాఁడు (మన్మథుఁడు) | రామా. ఆ6. ప 155. |
| పుడమిపడతిగారాపు గూతురు (సీత) | రామా. ఆ6. ప 173. |
| నేలప్రోయాలిచూలి (సీత) | రామా. ఆ6. ప 181 |
| పులఁగులజేడు (గరుత్మంతుడు) | రామా- ఆ6, ప 219 |
| చుక్కరాజు (చంద్రుఁడు) | రామా. ఆ7. ప 189 |
| పుడమికన్నియ (సీత) | రామా. ఆ7. ప 216. |
| గాడ్పు కూర్మిపట్టి (ఆంజనేయుఁడు) | రామా. ఆ8. ప 5. |
| పుడమిసుత (సీత) | రామా. ఆ8. ప 224. |

తెనుఁగు మఱుఁగు లీక్రింది పద్యమునఁ గూడ చూడనగును.

"ఉదరి పసిండి చాయగల యొప్పుల కుప్పలు వేఁడివేలుపుం
గొదమలు దావపావకుని కుఱ్ఱలు చిచ్చుఱకంటి నెచ్చెలుల్
తుద జముపేఁడుముల్ పిడుగుతున్కలు వానరవీరు లొక్కటన్
బొదివిరి లంకచుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్."
(రామా. ఆ7. ప 180)

పై నుదాహరించిన తెనుఁగు మఱుఁగులన్నియు అప్పకవికి పూర్వమే ఉపయోగములోనికి వచ్చినవి. తరువాతివారగు తెలగన్న మొదలగు అచ్చతెనుఁగు కావ్యకర్తలు మాత్రమే వానిని సృష్టించిరా రని తెలుపుట సమంజసము కాదు. అవి వారికి మార్గదర్శకములై యుండవచ్చుననుటలో తప్పులేదు.

తెనుఁగు మఱుఁగులను "ఒక్క పదములోఁ జెప్పఁదగు దాని ననేక పదములతో వచించు వింతరచన"[4] యని వక్కాణించిన సీతారామశాస్త్రిగారీ క్రింది యుదాహరణము నిచ్చిరి.

4. ఆం. వ్యా. సం. సర్వస్వము. పు. 699.

"కడకడ యొడయని ముంగై
కడియపు నునెమ్మెత్తఁబండు గామిడి." (అచ్చ: రా. బా. ప. 96)

(కడకడ= ఈశాన్యము, దాని యొడయఁడు= ఈశ్వరుఁడు, అతని ముంగై కడియము = శేషుఁడు, శేషుని పడగయనెడి మెత్తయందుఁ బరుండుగామిడి= (శ్రేష్ఠుఁడు) శ్రీ మహావిష్ణువు శాస్త్రిగారి ఈ నిర్వచనము వింతగా నున్నది. అట్లగుచో తెనుఁగునుఁబుఁగుల వంటి సంస్కృతసిద్ధసమాసముల రచన వింతరచనయె యుండవలయును కదా!

డా॥ చిలుకూరి నారాయణరావుగా రిట్టి శబ్దములను కృతకశబ్దములుగా తలఁచినట్లు వ్యక్తమగుచున్నది వీనిపుట్టుటకుఁ గల కారణమును వా రిట్లూహించినారు "శబ్దముల పుట్టుక యనేక విధములుగా నుండును. ప్రపంచమున నాయాజాతుల నాగరికత ననుసరించి మూలధాతువులనుండి కొన్ని సాధారణ శబ్దము లేర్పడుచుండును. కొన్ని కేవల ధ్వనుల ననుసరించి యుండును. కొన్ని యితరజాతుల సంపర్కము వలన జేరిన యితర భాషా పదములై యుండును. మనుష్యుని యూహాప్రపంచము విరివియైన కొలందియు క్రొత్త శబ్దము లేర్పడుచుండును. ఇవి యాయా వస్తువుల లక్షణములఁబట్టియు, వాని చేష్టలఁబట్టియు, వాని కితరవస్తువులతోడఁ గల సంబంధమును బట్టియు, నితర వస్తువులతోడి పోలికలను బట్టియు నీ రీతిగ క్రొత్త సమాసములతో చరాచర ప్రపంచమందలి వస్తువులకుఁ బేళ్లు గలుగుచుండును. ఈ సమాసములందలి యొక యవయవ ముపసర్గముగానో, ప్రత్యయముగానో మాఱి, క్రొత్త వ్యస్త పదముల యాకారమును దాల్చుచుండును.

ఈ రీతిగ ననేక విధముల నేర్పడిన శబ్దములలోఁ గొన్ని కవులు గూర్చినవి యుండును, వారి గ్రంథములు జనసామాన్యమున కాదరణపాత్రము లయి వ్యాపనము నొందినచో నట్టి కొన్ని శబ్దములు భాషయందు స్థిరముగ నిలుచును. కాని సామాన్య జనాదరణముఁగాంచని శబ్దములు గ్రంథములందును, నిఘంటువులందును మాత్రము మితప్రచారము గలిగియుండును. అట్టి శబ్దములు దెనుఁగునఁ జాలఁగలవు."[5]

5. ఆం. భా. చ. 1వభా. అచ్చికప్రకరణము పు. 446.

వీనికి ఉదాహరణములను నారాయణరావుగారిచ్చినవి—

1. పురాణములకు సంబంధించినవి - గట్టుతాలుపు, గరుడిరవుతు, పాలమున్నీటి యల్లుఁడు (విష్ణువు); కడలికూతురు, పాలమున్నీటి కూతురు, తమ్మియింటి గరిత (లక్ష్మి); చాలుపేరింటి పూఁబోడి, నేలచూలి, పుడమిపట్టి (సీత); చక్కెరవిలుకాఁడు, చెఱకు విలుకాడు, వలపురాయఁడు (మన్మథుఁడు); ఆఁబోతురౌతు, కొండయల్లుఁడు, జాబిలి తాలుపు (శివుఁడు); కొండచూలి, గట్టురాచూలి, చలిమలకూతురు (పార్వతి); ఏనుఁగు మోము సామి, ఆఱు మోముల వేలుపు, తెల్లుచూలి, జుట్టుపిట్టతాలుపు (కుమారస్వామి); చదువుల మదుఁకఁడు, బొడ్డుచూలి, వేలుపుఁబెద్ద (బ్రహ్మ); చదువుల పడతి, పలుకుఁ జేడియ (సరస్వతి) మొ॥

2. స్వర్గ సంబంధమైనపేళ్లు- తెల్లయేనుఁగు (ఐరావతము); వేలుపు బోనము (అమృతము); వేలుపుఁజెట్టు (కల్పవృక్షము); ఈవుల రతనము (చింతామణి); వేలుపుగిడ్డి (కామధేనువు); నిక్కుపీనుల జక్కి (ఉచ్చైశ్రవము); పిడుగుకైదువు (వజ్రాయుధము); గుఱ్ఱపుమోము వేలుపు (కింపురుషుఁడు); పక్కియొదలివాఁడు (కిన్నరుఁడు); వినుద్రిమ్మరి (ఖచరుఁడు) మొ॥

3. రాక్షసాదులు- నంజుడుఁదిండి, రేద్రిమ్మరి (రాక్షసుఁడు); పీనుఁగుఁదిండి (పిశాచము) మొ॥

4. భారతరామాయణములు- ప్రొద్దుఁగొడుకు కర్ణుడు); వేయిచేతుల యెకిమీడు (కార్తవీర్యుఁడు); గండగొడ్డలి తాలుపు (పరశురాముడు); తోఁడేటి కడుపుమేటి (భీముఁడు); చేటగోళ్లబోటి (శూర్పణఖ); పొద్దుఁగొడుకు (సుగ్రీవుఁడు); మొ॥

5. ఆకాశమునకు సంబంధించిన గ్రహనక్షత్రాదులు - చుక్కలతెరువు (ఆకాశము); చీఁకటిగొంగ, చాయమగఁడు, వేఁడివెలుఁగు (సూర్యుఁడు); కడలివెన్న, చలివెలుఁగు, జింకతాలుపరి (చంద్రుఁడు) మొ॥

6. దిక్పాలకులు - వేలుపుఁబెద్ద, వేలుపుఱేఁడు (ఇంద్రుడు); గాలి నెచ్చెలి, సెగఱేఁడు (అగ్ని); దక్కినంపురాయఁడు (యముఁడు); కడలిఱేఁడు

(వరుణుఁడు); రొక్కపుదొర, పైఁడిఱేఁడు (కుబేరుఁడు);కోనరేఁడు (నైఋతి); తావిమోపరి (వాయువు) మొ॥

7. కొండఱు ఋషులు - ఆరివేరపుఁదపసి, కయ్యపుఁదిండి (నారదుఁడు); వేలుపుటొజ్జ (బృహస్పతి); పుట్టఁబుట్టువు (వాల్మీకి); వెట్టచెవులతపసి (ఉగ్రశ్రవసుఁడు) మొ॥

8. కాలము- మండుతఱి (గ్రీష్మర్తువు); నీరామని (వర్షర్తువు) మంచుతఱి (హేమంతర్తువు); చలినెల (శిశిరర్తువు) మొ॥

నారాయణరావుగారు ఉదాహరించిన ఆయాతెగలలో మచ్చుకుపైన కొన్ని మాత్రము పేర్కొనుటయైనది. ఇవిగాక వారు కొండలు, సముద్రములు ద్వీపములు, పురములు, ఉద్భిజ్జములు, కోటకములు, సరీసృపములు, జలచరములు, పక్షులు, చతుష్పాద జంతువులు, మనుష్యులు. యుద్ధము. శాస్త్రము, ఇతరములు అను విభజనము చేసి యెన్నియో ఉదాహరణముల నొసంగి యున్నారు. వానిని ఆంధ్రభాషా చరిత్ర అచ్చిక ప్రకరణము 246 నుండి 253 పుటలలో చూడఁజనును.

తెనుఁగు మఱుఁగులు అచ్చతెనుఁగు రచయితలకు కొన్ని సందర్భములలో ముఖ్యముగా తత్సమనామ వాచకములు చెప్పుపట్ల నెంతయో తోడ్పడినవి. తత్సమంబు తక్క తక్కిన నాల్గింటిని [తద్భవము, అచ్చతెనుఁగు, దేశ్యము, గ్రామ్యము] అచ్చతెలుఁగులనిరి అందుచేవారు తమకావ్యములలో తత్సమములను వాడుట కంగీకరించరైరి.

"తత్సమంబు నాఁగఁ దద్భవం బన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాగఁ గల వైదుతెఱఁగులు
వేఱవేఱ వాని విస్తరింతు." [ఆం. భా. భూ. ప 19.]

"తత్సమంబు దక్కఁ దక్కిన నాలుగు
నచ్చతెలుఁగు లందు రఖిలజనులు

నందులోన గ్రామ్య మనఁగ నెవ్వరు నొప్ప
రొరులఁ దెగడుచోట నొప్పు నదియు."

[ఆం. భా. భూ. ప 27.]

అని కేతన ఆంధ్రభాషాభూషణమున నుడివెను. మొత్తముపైన తెనుఁగుమఱుఁగులు అచ్చతెనుఁగు కావ్యములందు విరివిగా చేరినవి. నాచనసోముఁడు, ముక్కు తిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు మొ॥ కొందఱు కవులు కూడ తమ కావ్యములలో నిట్టి వానిని వాడిరి. కనుక కేవలము అచ్చతెనుఁగు కవులు మాత్రమే వీనిని కల్పించి రనంజనదు

# ప్రబంధాలలో తెలంగాణా మాండలికాలు

—డా॥ శ్రీమతి రావి భారతి

ప్రతి సంఘజీవి ఒక ప్రత్యేక భాషాసమాజంలో జన్మిస్తాడు. ఆ ప్రత్యేకకాలంలో తన పరిసరాల్లో తరతరాలుగా వాడుకలో ఉండి తల్లిదండ్రుల వల్ల, పెద్దలవల్ల తనకు అలవడ్డ భాషలోనే ఆలోచిస్తాడు, మాట్లాడుతాడు. దాన్నే వ్రాస్తాడు, అభిమానిస్తాడు· ఏ గూటిచిలక ఆపలుకు పలకడం సహజం. ఎన్ని భాషల్ని నేర్చుకున్నా ఉగ్గుపాలతో అలవడిన భాషయొక్క ప్రభావం ప్రబలంగా ఉండి తీరుతుంది. వారివారి సాంఘికస్థాయినిబట్టి నివసించే ప్రాంతాన్నిబట్టి భాష పరిణామం చెందుతూ ఉంటుంది. ఆయా ప్రాంతాల్లోని కవులు ఆయా ప్రాంతపు పలుకుబడులనే కావ్యాల్లో ఉపయోగించడం అత్యంతసహజం. ఒక భావాన్ని వ్యక్తం చేయాల్సి వచ్చినప్పుడు దాన్ని వ్యక్తం చేయడాని కర్హమైన పదం ఆ ప్రాంతంలో మృగ్యమైనప్పుడు మరొకప్రాంతంలో వాడుకలో గల పదాన్ని గ్రహించి గ్రంథాల్లో కెక్కించడం జరుగుతుంది. ఇట్టి ఆదానప్రదానాల వల్లనే భాష పుష్టిని పుంజుకుంటుంది.

ఒక రాష్ట్రమందలి వివిధ ప్రాంతాలలో స్వల్ప వ్యత్యాసంతో కూడిన భాషాభేదాలే మాండలికాలుగా పరిగణింప బడుతున్నాయి. మండల భేదాన్ని బట్టి భాషలో వ్యత్యాసం గోచరిస్తుంది. ఈ వ్యత్యాసానికి ఉచ్చారణలోని స్వర భేదం, పరభాషా సంపర్కం, వాక్య నిర్మాణ వైలక్షణ్యం, శీతోష్ణస్థితి భేదాలు, ముఖ్య కారణాలుగా చెప్పొచ్చు. వివిధ ప్రాంతాల్లోని జానపదుల వ్యవహారాల్లో స్వప్రాంతీయతాముద్ర అధికంగా కనిపించడానికి వారు అవలంబించే కుల వృత్తులే ముఖ్య కారణంగా చెప్పొచ్చు. కులవృత్తు లాధారంగా ఏర్పడిన పద జాలంలో ప్రాంతీయతా వైవిధ్యం గోచరిస్తుంది. ఉదాహరణకి నీటి పారుదల వసతి కలిగిన సారవంతమైన పొలాన్ని 'తరి' పొలమని తెలంగాణంలో వ్యవ హరిస్తారు. దీనినే సాగరసీమవాసులు మాగాణి అంటారు. అట్లే నిస్సారమైన భూమిని తెలంగాణాలో కుష్కి అనడం సాగరతీరం వారు మెట్ట అనడం

అలవాటు. కుష్కీ అనే అరబ్బీపదం భాషలో ఎంతగా కలిసి పోయిందంటే దీనికి పర్యాయంగా ఇంకొకటి వ్యవహారంలో లేనేలేదు. ఇలాంటి పదాలన్నీ వారి వాగ్వ్యవహారంలోని భాగాలే. జీవనాడివంటివి. తెలుఁగు దేశంలో కులవృత్తులే జీవనాధారంగా గల గ్రామ ప్రజలకు దూర ప్రాంతాలతో సంపర్కానికి అవకాశం లేకపోవడం చేత పద వినిమయానికి అవకాశం తక్కువ. ఈనాడు కాలం శీఘ్రంగా మారుతున్నది. రవాణా సౌకర్యాలు క్రమంగా పెరుగుతున్నాయి. వార్తాపత్రికలు, నవలలు, ఆకాశవాణి, చలనచిత్రాలు, ఈ పద వినిమయానికి సాధనాలై పరస్పర అవగాహనకి ఆధారాలవుతున్నాయి.

జీవద్భాష ఎక్కడ కూడా ఏకరూపతను కలిగి ఉండదు. భాషలో మార్పులేదు అంటే అది అనారోగ్య లక్షణం అన్నమాట. భాష ఒక సజీవ శరీరం వంటిది. శరీరం క్షణక్షణము మార్పులకు లోనయినట్లే భాష కూడా పరిణామాలకు లోనవుతూ ఉంటుంది. కర చరణాది అవయవాలు ఒక శరీర సౌష్ఠవాన్ని ఏ విధంగా కాపాడుతాయో మాండలికాలు కూడా భాషా శరీరానికి సమగ్రతని సమకూరుస్తాయి. ప్రజా బాహుళ్యంలో ప్రచారంలో ఉన్న ఇలాంటి మాండలికాల్ని ప్రసిద్ధపదాల్ని కవులు గ్రంధస్థం చేస్తారు. వాడుకనుబట్టి లాక్షణికులు వానిని నియమబద్ధం చేస్తారు కవులకు ప్రజల భాష ప్రమాణం. లాక్షణికులకు కవులప్రయోగాలు ప్రమాణం. నిజానికి మాండలికసాహిత్యభాషలకు రెంటికీకర్తఒక్కడే అంటే దైనందిన వ్యవహారంలో తన మాండలికంలోమాట్లాడే కవే సాహిత్య సృష్టి సమయంలో కావ్యభాషని ఉపయోగిస్తాడు. అత్యంత పరిచయం వల్లగాని, అర్థ స్ఫురణ కోసం గాని కావ్య భాషా పదం కన్న తన వ్యవహారంలో ఉన్న పదం పదునైనది, శక్తిమంతమైనదని భావించడం వల్లగాని పర్యాయంగా ఉపయోగంలో ఉన్న పదమే కాబట్టి అలాంటి పదాన్ని ప్రయోగించి తన మండలంలో ఉన్న మాటకు కావ్య భాషలో స్థానాన్ని కల్పిస్తాడు. ఒక్కొక్కసారి మాండలిక పదప్రయోగం తప్పనిసరి కావచ్చు. ఒక్కొక్క మారు అనాలోచితంగానే ప్రయోగించవచ్చు. మొత్తంమీద ప్రాచీన కవులందరూ ప్రాంతీయ పద ప్రయోగం చేసినట్లు పరిశీలనవల్ల మనం గ్రహించవచ్చు.

తెలంగాణాభాష అచ్చతెనుఁగునకు మచ్చుతునక. నిజాం పరిపాలనా ప్రభావం చేత దర్వాజా కిటికీ, దస్తీ, రుమాలు వంటి అనేకములయిన అన్య దేశ్యాలు వాడుకలో ఉన్నప్పటికి దేశీయ పదజాలం ఏమాత్రం తన ప్రాభవాన్ని

కోల్పోలేదు. ఒక విశేషవిషయ మేమంటే ఒకనాడు దేశ్యపదాలుగా యావదాంధ్ర దేశంలో ప్రచారంలో ఉండి ఈ నాడు తెలంగాణాకే పరిమితమైన మాండలికాలుగా మిగిలిపోయిన కొన్నిపదాలు, ఈనాడు తెలంగాణా ప్రాంతంలో ఏ అర్థంలో వాడబడుతున్నాయో అదే అర్థంతో మనకు పదహారో శతాబ్దంలోని కొన్ని ప్రబంధాల్లో కనిపిస్తాయి. ఉదాహరణకు 'ఏరాలు' పదమున్నది. ఇది తోడికోడ లను అర్థంలో తెలంగాణాలో ప్రచారంలో ఉంది. దీనిని తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్యంలో వాడినాడు. "ఏరాలి పట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి" తెలంగాణా ప్రాంతేతరకవి తెలంగాణా మాండలికాన్ని వాడడం ఎట్లా సాధ్యపడింది? ఒకనాడు ఆంధ్రదేశమంతటా వ్యవహారంలో ఉన్న ఈ పదం రామకృష్ణకవి ఆనాడు తన గ్రంథంలో ప్రయోగించాడు. తోడికోడలనే పదం వ్యవహారంలో ప్రవేశించి ఈ పదాన్ని తొలగించి ఉండొచ్చు. తెలంగాణా ప్రాంతంలో మట్టుకు ఈ పదమే వాడుకలో ఈనాడు మిగిలిపోయింది. లేదా కవి కావాలని తెలంగాణా మాండలికాన్ని అర్థస్ఫూర్తికి అనుగుణంగా ఎరువు తెచ్చుకొని వాడి ఉండవచ్చు. ఈవిధంగా ఎన్నో పదాల్ని ప్రబంధాలనుండి ఎత్తి చూపొచ్చు. అలాంటి కొన్ని పదాల్ని ప్రయోగాల్ని ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

బాగములు - బాగాలు :- తమిళంలో పాక్ అంటే వక్క. శబ్దరత్నాకరంలో వక్కపొడి అనే అర్థం ఈయబడింది.

"బాగాలు వెస నొక్కి పద్మాక్షి యొసఁగిన" [మను-3 ఆ-66 ప]
"మోవికాంతి కెనయౌ బాగాలు సయ్యంతి చెక్కులఁబోలు"
[పాండు-1-29]

ఇట్టివే ప్రయోగాలు కళాపూర్ణోదయంలోను [4-70] యయాతి చరిత్రలోను [4-119] ఘటికాచల మాహాత్మ్యం [2-18] నిరంకుశోపాఖ్యానం [2ఆ-ప. 25] వైజయంతీ విలాసం మొదలయిన కావ్యాల్లో వాడబడినది.

కూరాడ - కూరాటికుండను వంటింట్లో ఏర్పాటు చేయటం సంప్రదాయం. బియ్యం కడిగిన నీరు ఇందులో పులియబెడతారు. ఆ నీటినే ఎసరుగా వాడడంవల్ల అన్నం పాచిపోకుండా కాపాడుతుంది. కాచిన కలి అని శబ్ద రత్నా

కరం, నెల్లూరు ప్రాంతపు మొల్ల ఈ పదాన్ని ప్రయోగించడం విశేషం. [మొల్ల రామాయణం-సుం-174వ పద్యంలో]

ఏరాలు :- ఎరవు+ఆలు అని శబ్దరత్నాకరం, తోడికోడ లని అర్థం. ఎరవు=అన్యము అని శబ్ద రత్నాకరం. ఇంటి ఆడబడుచు కాక అన్యయైన స్త్రీ అని అర్థం చెప్పుకోవచ్చు. లేదా ఇర్ కాని ఈర్ కాని రెండు అనే అర్థంలో ద్రావిడభాషలన్నింటిలో సమానంగా కనిపిస్తుంది. ఈర్+ఆలు=ఏరాలు ఏర్పడిన దనటం ఉచితం. తోడుగా వచ్చిన రెండవస్త్రీ అని అర్థం చెప్పుకుంటే తోడి కోడలు అర్థానికి కొంత సామీప్యమున్నది.

ఏతులు :- బడాయి అని ఈపదాని కర్థం. "వాడు బలే ఏతులు కొడ్తడు" అని వాడుక. శబ్దరత్నాకరంలో ఏతు=ఉద్ధతి అని ఉంది. ఈ రెండు పదాల్లో అర్థసామ్యం కనిపిస్తుంది. పాండురంగమాహాత్మ్యంలో ఈప్రయోగ మున్నది.

"ఏతులఁ బోవుచుం దిరుగు" [పాండు-1-73]

అగ్గువ :- వెల తక్కువ అనే అర్థంలోనే వ్యవహారమూ ప్రయోగమూ కనిపిస్తున్నాయి. "కూరగాయ లగ్గువున్నయ్" అనేది వ్యవహారం.

"కోతిమాంస మగ్గువ యయ్యె" (రామాభ్యుదయం-8ఆ. -ప25)

"అగ్గువ యగును ధాన్యంబు మిగుల" (రెట్టమతము-ఆ3-ప29)

చింగులు :- శబ్దరత్నాకరంలో చుంగులు=వస్త్రము కుచ్చెకొనలు అని ఉంది. ఆ శబ్దమే ఈ విధంగా రూపాంతరం చెందింది. కుచ్చిళ్ళు అనే అర్థంలో వ్యవహారం.

చింగులు వారంగ సిక నమర్చెన్ [యయాతి చరిత్ర 4-100]

గౌసెన :- ప్రబంధాల్లో గవిసెన గవుసెన అనేరూపాలు ఎక్కువగా కని పిస్తాయి. వీణె మొదలగువాని మీఁది యొఱ అని శబ్దరత్నాకరం చెబుతున్నది. మార్చి1971 భారతి మాస పత్రికలో నిడదవోలు వేంకటరావుగారు ఈ పదాన్ని గూర్చి వ్రాస్తూ తోడుగుడ్డ, ముసుగుగుడ్డ, తంబూర గౌసెన, అద్దము మొద లగు వానిపై వేయు గలీబు అనే అర్థాలిచ్చినారు. తెలంగాణా వ్యవహారంలో

మాత్ర మీపదము పురుపు, మెత్త, వీటి తొడుగులకు మాత్రమే ఉపయోగింప బడుతున్న దీనాడు· ప్రబంధాల్లో మట్టుకు అద్దము, వీణ మొదలయిన వస్తువుల తొడుగులకే ప్రయుక్తమయింది [మను-4-3, కళా 8-24, రామా 4-90, చిత్ర 3-33 సుభద్రా పరిణయము పు 50]

తంతెలు-తంతియలు :- మెట్లు అని శబ్ద రత్నాకరం. ఏత్వసహిత రూపం మెట్లు అనే అర్థంలోదే వరంగలు జిల్లాలో వాడుకలో ఉంది·

"పెట్టించి తంతెలు పెద్దగా లోన" [సిద్ధేశ్వర చరిత్ర పు-130]
"కాండ సంఘటనఁ దంతెల్ గట్టితిరి గాన" [దశరథరాజనందన చరిత్ర 2-116]

ఎల్లెము :- శీఘ్రమని అర్థం. ఈ అర్థంలోనే వాడుక కనిపిస్తుంది. "ఎల్లెమురా" "ఎల్లెముతిను" వంటి రూపాలు ప్రచారంలో ఉన్నవి. ఇది వేళము [త్వరితము] యొక్క రూపాంతరము.

"ఎల్లెము మీరు సల్లీల మన్నీలు సరదార్లు దొరలు కదలుఁడు"
(సిద్ధేశ్వర చరిత్ర-పు. 65]

అగడు:— అగడు = దూఱు, నింద అని శబ్దరత్నాకరం. కాని వసుచరిత్రలో భయము అన్న వ్యావహారికార్థంలోనే ప్రయుక్తమయింది.

"కలహంస లగడై రొదలు సేయన్" [అగడై=భయముచెంది] వసు—2ఆ—22ప)

అగడుచొచ్చు అన్న పదబంధం కూడా వ్యవహారంలో ఉంది.

ఉ:— అదిజూడంగనె నా మనసుల అగడు జొచ్చింది". అల్లెబుగులు అన్నపదం కూడా భయముఅన్న అర్థంలోనే ప్రచారంలో ఉంది. వసు చరిత్రలో ఆవరించు అనే అర్థంలో ప్రయోగింపబడింది· [వసు-4-23] బహుశః మనసంతా ఆవరించినది 'బుగులు' అయి ఉండవచ్చు. "నాకు లెస్స బుగులైతుంది" అని వ్యవహారం. ఈ లెస్సపదం కూడా బహుళ ప్రచారంలో

ఉంది. దీన్ని కూడా మనం ప్రబంధాల్లో పలుచోట్ల చూస్తాము. (వైజ- 3-31, చిత్రభారతము – 5 - 209, ఉద్భటారాధ్య చరిత్రము. 3-147, మను. 5-4] ఈ లెస్స శబ్దము క్షేమము, శ్రేష్ఠము, ఉచితము అన్న అర్థాల్లో ప్రయుక్తమైంది.

అర గది అనే అర్థంలోనే యయాతి చరిత్రలో కనిపిస్తుంది. "అతివ బంగారు అరలోని కరిగి"[5-34]సాధురేఫానికి మాఱుగా ఉచ్చారణలో ద్విత్వ శకటరేఫం వాడబడుతున్నది. ఉ :— అఱ్ఱల ఉంది తీసుకరా. అఱ్ఱ=గది.

పిట్టు :— వాసెనమీద పక్వము చేసిన పిండి అని శబ్దరత్నాకరం. ఇది కావ్యాల్లో భోజన యోగ్యమైనది. వ్యవహారంలో పశువులకుపెట్టే వేరుసెనగ పిండికి మాత్రమే పిట్టు అనిపేరు. ప్రయోగాల్లో మొదటి అర్థమే కనిపిస్తుంది. చొక్కనాథ చరిత్ర–పు-306, నవనాథ చరిత్ర-పు-30]

బొక్కలాడు :— వ్యవహారంలో ఇది కొంత రూపాంతరం చెంది బుక్క=తిను అనే అర్థంలో కనిపిస్తుంది. ఉ:— "పేలాలు బుక్కలావ్?" అనేది వ్యావహారిక ప్రయోగం, తినుట అనే అర్థంలోనే ఆముక్తమాల్యదలో కనిపిస్తుంది. "సారెకు బొక్కలాడ' [1ఆ–75ప]

అచ్చుకట్టు :— మాగాణిలో గట్టు కట్టిన నలుచదరపు ముక్క అని మాండలిక వృత్తి పదకోశం చెబుతున్నది ఈ పదబంధం తెలంగాణాలో వ్యవహారంలో ఉంది. "ఎంతపొలం ఈ యేడు అచ్చుకట్టినవ్" అనేది వ్యవహారికం వైజయంతీ విలాసంలో ఈ రూపమున్నది· "మెత్తగా దున్ని యచ్చుఁగట్టి [1-85)

ఇవము :— ఈపదమే మధ్యగకారంతో వ్యవహారంలో వినబడుతుంది, "బలె ఇగం గొడ్తుంది" అని ఉదాహరణం. శైత్యము అని దీని కర్థం. (వసు- 6-61, యయా· 4–67, పరమయోగివిలాసము-ద్వి· పు. 57]

దిడ్డి :- గవనులోనగు వాని ప్రక్కనుండు చిన్నవాకిలి అని శబ్ద రత్నా

కరం "డిడ్డితలుపు పెట్టినావా'' అని వ్యవహారం ప్రబంధాల్లోను ఇదే అర్థంలో కనుపిస్తుంది.

''దిడ్డివెపుఁ యొక నూత్న దివ్యరత్న ఖచితమగు పల్లకి మీద''
[రాజశేఖర చరిత్ర 3-216]

''లోపలి దిడ్డి త్రోవచేన్. [యయా. 5-151]
[కళా. 8-30, సిద్దే. పు. 129, రామాభ్యు. 2-92]

ఎఱుక :- ఇది ఎఱుఁగు యొక్క కృదంత రూపము. వ్యవహారంలో జ్ఞానము అనే అర్థంలో వాడబడుతున్నవి.

ఉ :- నా కెఱుకలేదు=నాకు తెలియ దని అర్థము.

ఈ పదానికి ప్రయోగాలు కొల్లలుగా చెప్పొచ్చు. త్రోలు క్రియారూపం పాఱఁద్రోలుట అనే అర్థంలో పలుచోట్ల ప్రయోగింపబడింది [పారిజా 1-135 సకలకథా సారము 4-341, ఎసు 3-112, చిత్ర 1-19, కలిక 1-35] తెలంగాణంలో తీసుకొనిపోవుట అనే అర్థంలో 'తోలుకొనిపోవుట' అని వ్యవహరిస్తారు. బహుశః ఇది 'తోడుకొనిపోవు' అనే పదం యొక్క రూపాంతరం కావచ్చు.

మొగరము — స్తంభము అనే అర్థంలో ఈ పదం వ్యవహారంలో ఉంది. వసు చరిత్రలో ఇది ప్రయుక్తమయినది "మెఱుంగుదేరు తొగ చుట్టపుఱా మొగరంబు మాటుగా'' [వసు 6-76]. ఇట్లే ఇంగలము, కంగారు, బలఁగము మొగులు, నూఁకు, ఔడు మొదలయి; వ్యావహారిక పదాలకు ప్రబంధాల్లో ఉదాహరణలు కనిపిసాయి.

ఇలాంటి మాండలిక పదాలు కావ్య వ్యవహారంలో ఉండవనీ, ఉండరాదనీ సంప్రదాయ పండితుల విశ్వాసము. ఒకనాటి మాండలికాలే అదే కాలంలోనో, కాలాంతరంలోనో కావ్యభాషలో ప్రవేశిస్తా యనేది ప్రత్యక్షసత్యం. ఈ ప్రభావాన్నించి నన్నయ తప్పించుకోలేదు. నగ్నమునీ తప్పించుకోలేదు. భాషలోని రూపాంతర పర్యాయ పదాలకు మాండలికమైన ఉచ్చారణ వ్యవహారభేదాలే

మూలకారణం. ఇలాంటి మాండలికాలవల్ల భాష కెలాంటి కాలుష్యం కలుగదు. మీదుమిక్కిలి భాష విస్తరించి పద్యగద్య రచనలకి దోహదం చేస్తుంది భాష ఒక మహానదీ ప్రవాహమయితే మాండలికాలు దానిపాయలు. పాయపారని నది లేదు. మాండలికం లేనిదే భాష లేదు.

భాషాప్రాతిపదికమీద వాదోపవాదాలు ఆనాడూ ఈనాడూ జరుగుతూనే ఉన్నాయి. ఈ వాగ్యుద్ధాలకి మాస పక్ష వారపత్రికలు రంగస్థలాలు. అర్జునుఁడు నల్లనివాడా? తెల్లనివాడా? లేక అఱసున్నా ఆ ప్రక్కన ఉండాలా, ఈ ప్రక్కన ఉండాలా, ఏప్రక్కన ఉండాలి? ఫలానాపదంలో విభక్తి లోపించిందా లేదా, ఫలానా పదము కళయా ద్రుత ప్రకృతికమా? ఫలానాపదము సాధువా అసాధువా. ఈ ఫలానా పదము మాండలికమా కాదా? ఈ వాదోపవాదాలు ఎంతదాకా సాగుతాయంటే సంపాదకుడు ఫుల్‌స్టాప్ పెట్టేవరకు. ఈ వాదప్రతివాదాలన్నీ, నా అభిప్రాయంలో మేధకు బాగా పదును పెట్టుకోవడానికి పనికి వస్తాయి తప్ప ఈనాటి సమాజంలోని సమస్యల కెలాంటి సంబంధంలేదు. ఈనాడు సమాజం వాయువేగ మనోవేగాలతో పురోగమిస్తున్నది. మనం ఏమాత్రం ఏమరుపాటు చూపించినా వెనుకబడితే వెనుకే అన్నట్టు వెనుక పడిపోయే ప్రమాదమున్నది. ఈనాడు ఆర్థిక, సాంఘిక, రాజకీయ నైతిక సమస్యలు ఉప్పెనలా సమాజాన్ని ముంచెత్తుతున్నాయి. ఇంకా ఎన్నో సమస్యలు మానవుని మనుగడనే సవాల్ చేస్తున్నాయి. ఇలాంటి సందర్భంలో అరసున్నాలు మానవుని ఆర్తాకలి తీర్చవు. విభక్తి దేశభక్తిని జాతిలో జాగృతము చేయదు. భాషా సాహిత్యాలు మనజాతికి, మన సంస్కృతికి జీవనాడి వంటివని నమ్మేవాళ్ళల్లో నేనూ ఒకదాన్నే. అయితే భాషనుగాని, సాహిత్యాన్ని కాని మన అవసరాలకు అనుగుణంగా ఆధునికసమాజపరంగా సమన్వయం చేసుకోవాలి. గతంలోని ఉత్తమ భాషా, సాహిత్య సాంప్రదాయ ప్రవాహాన్ని ఆధునిక సమాజ క్షేత్రంలోకి మరలించి ప్రగతి పంటల్ని పండించుకోవాలి. అప్పుడే పాతకొత్తల మేలు కలయిక మన పురోగమనానికి బాటల్ని నిర్మిస్తుంది. ★

# తెలంగాణంలోని తెలుగు పలుకుబళ్లు

—శ్రీ ఆర్. శ్రీహరి

నేటి వ్యవహారంలోని తెలుగు భాషాస్వరూపాన్ని జాగ్రత్తగా పరిశీలించినట్లైతే భాషావిషయకమైన ఎన్నో అంశాలు మనం తెలుసుకోవడానికి అవకాశం ఉన్నది. చదువుసంస్కారా లేమీ లేని గ్రామీణుల పలుకుబడిలో అనేక గ్రాంథికరూపాలు కొద్ది రూపభేదంతోనూ, భేదరహితంగానూ ఇప్పటికీ సజీవంగా ఉండడం భాషాదృష్టిగల పండితులు గమనించవచ్చు. గ్రాంథిక భాషా ప్రయోగాలకూ, నేటి వ్యవహారంలోని ప్రయోగాలకూ ఉన్న సాన్నిహిత్యాన్ని క్రింది ఉదాహరణలతో నిరూపించడానికి చేసిన ప్రయత్నమే ఈ వ్యాసం. ఉదాహరణలుగా ఇవ్వబడ్డ పదాలు చాలావరకు తెలంగాణా ప్రాంత వ్యవహారంలోనివే.

1. అంగలార్చు :—

'దుఃఖించు' 'దుఃఖంతో ఏడ్చు' అనే అర్థాల్లో ఇది ఎక్కువగా పామర వ్యవహారంలో వినబడుతుంది. ఉదా:— కొడుకు చనిపోయినందుకు ఆమె ఎంతో అంగలార్చింది. ఈ అర్థంలో శ్రీనాథాదుల ప్రయోగాలు ఎన్నో ఉన్నవి.[1]

2. అరుసు (ర్సు) కొను: —

ఇది 'తెలుసుకొను' అనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న క్రియాపదం "అక్కడి సంగతులన్నీ అరుసుకొని రా" అనీ; భోజనాల సమయంలో 'మారు అర్సు[రుసు] కో' అనీ మనం నిత్యమూ వినే వాక్యాలే. 'అరయు' అనే ధాతువు ఆత్మనే పదరూపమైన 'అరసికొను' అనే గ్రాంథికరూపమే వ్యవహారంలో కొంతమార్పు పొంది అర్సుకొను, అరుసుకొను అని ఏర్పడి ఉంటుంది. కొందరి వ్యవహారంలో 'అర్చుకొను' అనే రూపం కూడా ఉన్నది.

---

1. 'మాధుకర భిక్షాన్నంబు భక్షింపగా లేకున్నం గదు నంగలార్చెదవు మేలే'— (కాశీ ఖండము 7-162)

3. అజ్జ :—

'గది' అనే అర్థంలో ఈపదం తెలంగాణ మంతటా వ్యవహారం లో ఉన్నది. నిఘంటువుల్లో అఱ, అజ్జ- ఈ రెండు పదాలకూ 'గది' అనే అర్థం చూపబడింది. కాని 'అజ్జ' అనే ద్విత్వజకార సహితరూపమే పై అర్థంలో వ్యవహారంలోనూ, కావ్యాల్లోనూ[2] కనిపిస్తుంది. 'అఱ' అనే పదానికి తీరాంధ్రంలో 'పెట్టె మొదలైన వాటిలోపలి అఱ' అనే అర్థంలోనే వాడుక ఉన్నది

4. ఊసులు :—

ఇది నేత్రమలమనే అర్థంలో ప్రయోగింపబడే బహువచనరూపం. ఇది పుసులు (దీనికి 'పుసి' అనేది ఏకవచనరూపం) అనే గ్రాంథికరూపంలో పదాదిపకారం లోపించి ఉకారం దీర్ఘంకాగా ఏర్పడ్డ రూపం కావచ్చు. 'పుసులు' అనే శబ్దానికి గోపరాజు సిం. ద్వా. లో ప్రయోగం కనిపిస్తుంది.[3]

5. ఎంచు :—

దీనికి శబ్ద రత్నాకరంలోనూ, సూర్యరాయాంధ్రనిఘంటువులోనూ ఇతరార్థాలతో పాటు గణించు [లెక్కపెట్టు] అనే అర్థం కూడా చూపబడింది. ఇది పామర వ్యవహారంలో ఈ అర్థంలో అతి ప్రచురంగా వినబడుతుంది. దీనికి 'ఏంచు' అనే రూపాంతరం కూడా ఉన్నది. ఉదా :— రూపాయలు ఏంచుకో, మొ॥

6. ఎనుగు :—

పశువులు రాకుండా పొలంచుట్టు వేసే కంచె అనే అర్థంలో ఈపదం వాడుకలో ఉన్నది. దీనికి 'వెలుగు' అనే గ్రాంథికరూపం మూలంకావచ్చు. 'వెలుగు'లో పదాదివకారం లోపించి లకారం నకారంగా మారి 'ఎనుగు' అనే రూపం ఏర్పడి ఉండవచ్చు. [వెలుగు≫ఎలుగు≫ఎనుగు] లకారం నకారంగా

---

2. 'ధూపవాసనల్ తడుపు, కొనుకెంపుటజ్జలో గ్రొన్నన పాసు, పుత నుంచి" (ద్విపద సారంగధర చరిత్ర)
"అధిపుఁ డజ్జ సొచ్చె" (సింహాసన ద్వాత్రింశిక IV–270)

3. జిలిబిలికిం బుసులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు (1–100)

మారని 'ఎలుగు' అనేరూపం హైదరాబాదు జిల్లాలో ఎక్కువ వాడుకలో ఉన్నది. కంచె అనే అర్థంలో 'వెలుగు' శబ్దానికి నాచన సోమన, కొరవి గోపరాజు మొదలైన కవుల కావ్యాల్లో ప్రయోగాలు ఉన్నవి [4] కృష్ణా జిల్లాలో 'కంచె వేయడం' అనే అర్థంలో ఎనుగట్టు (ఎనుగు+కట్టు) అనే క్రియాపదం వాడుకలో ఉన్నది. కాని 'ఎనుగు' అనే పదానికి వ్యస్తంగా వాడుకలేదు.

7. ఎసల :—

ఈ పదాన్ని మట్టిపాత్ర, మట్టికుండ అనే అర్థాలలో పామరులు వాడుతుంటారు. కూరెసల (కూర+వెసల) మొదలైన సమాసపదాలలో కూడ దీని ప్రయోగం కనిపిస్తుంది. దీని పూర్వరూపం 'వెసల' కావచ్చు. ఈపదం పై అర్థాలలో అనేక కావ్యాలలో కనిపిస్తుంది.[5]

8. ఎఱుక :—

ఇది పామరుల వ్యవహారంలోనేకాక చదువుకున్నవాళ్ల వ్యవహారంలో కూడా ఉన్నశబ్దం. ఉదా—నీ కెఱుకేనా [నీకు తెలుసా], నా కెఱుకలేదు (నాకు తెలియదు) మొ॥ 'ఎఱుగు' ధాతువు కృదంతరూపమే ఈ'ఎఱుక'. ఇది తెలివిడి, పరిచయం, గుర్తు అనే అర్థాలను బోధిస్తుంది. ఎఱుకజేయు, ఎఱుకపడు మొదలైన 'ఎఱుక'శబ్దంతో కూడిన రూపాలు మహాభారతంలో కనిపిస్తవి.[6]

9. ఏఁటు :—

శ. ర. లోనూ, సూ. ని. లోనూ ఈ పదానికి 'గొఱ్ఱె' అనే అర్థం

---

4. "వెలుగే తన చేను మేయు విధము" (సిం. ద్వా I–175) "ఇంక వెలుగు చెన్మేసిన, గాచువార లెందు గలరు జగతి" (ఉ. హ. V–40)

5. 'నీళ్ళ వెసలలోపల నించి" (సిం. ద్వా. III–45)
"వెన లలనా మణి బంగరు వెసలల దొంతరలు డించి" (విజయ విలాసం–II–152)
"వెనకయ్య చేతికి వెసలిచ్చె ననుమాట" (ఉ. హ. IV–50)

6. "వాయు వెఱచి లోని కెఱుక చేసి (మ. భా. శాం. VI–263)
"తెఘు నలుకయు గూర్మియు. . నెఱుక పడియెడు భంగిన్ (మ. భా. ఆది. VI–114)

చూపబడింది. ఈ పదం ఇప్పటికీ మనకు పామర వ్యవహారంలో వినిపిస్తుంది. బసవపురాణంలో దీనికి ప్రయోగం కనిపిస్తుంది 7

10. ఏరాలు:

తోడికోడలని దీనికర్థం. తెలంగాణా పామర వ్యవహారంలో ఈపదమే వాడుకలో ఉన్నది శ. ర. కర్త దీన్ని 'ఎరవు + ఆలు'గా విభజిస్తే సూ. ని. కర్తలు 'యాతృ'అనే సంస్కృత శబ్దానికి వికృతిపదంగా చూపినారు. ఈపదానికి వ్యుత్పత్తి ఏమైనా ఇది అనేక కావ్యాలలో ప్రయోగింపబడింది.8

11. కఱె :—

నల్లనైన అని కర్థం. ఈ అర్థంలో ఈ పదం చాలా వాడుకలో ఉన్నది. ఉదా:—"వాడు కఱ్ఱెగా ఉన్నాడు." మొ॥ నల్లని అనే అర్థం కల కఱి, కఱియ, కఱ్ఱి అనే గ్రాంథిక రూపాలకు పై పదం ఎంతో సన్నిహితంగా కనిపిస్తుంది. 'కఱివేపాకు' మొదలైన సమాస పదాలలో 'కఱి'పదానికి 'నల్లని' అని అర్థమే. పై పదాలకు మహాభారతాది గ్రంథాలలో ప్రయోగాలు చాలా ఉన్నవి.9

12. కాడ-కాడికి :—

గుడికాడ, గుడికాడికి మొదలైన ప్రయోగాలలో ఈపదాలు నిత్యమూ వినిపించేవే. వీటిలో 'కాడ'కు దగ్గర అనీ 'కాడికి' కి దగ్గరకు అనీ అర్థం. ఈ రెండూ కడ, కడకు అనే గ్రాంథిక రూపాలకు వికృతరూపాలు. వ్యవహారంలో 'కడ' 'కాడ' గానూ, 'కడకు' 'కాడికి' గానూ మారి ఉంటుంది.

13. కోలె (న్) :—

ఈ శబ్దం 'నాటఁగోలె' మొదలైన గ్రాంథిక ప్రయోగాలలో పంచమ్యర్థం

---

7. "కాట కోటంపు నాఁ గలదొక్క-గొల్ల, యేఁట పెంట్రిక తన కీశ్వరుడనుచు" 2-417)

8. ''ఏరాలి పట్టి బిట్టెత్తి చెక్కిలి నొవ్వ గఱచి వా దేడ్చిన''- పాండురంగ మాహాత్మ్యం III-62;

9. 'కఱియ జీలకఱ్ఱ, గఱివేము గుఱుజయింగువ'' (మ. భా. అను III-189) 'తెల్లదామర తేకులట్లులసిల్లు కన్నుదోయి నొప్పారెడు కఱ్ఱి యతడు'' (హరి వంశం. పూ. IX-45)

లో కనిపిస్తుంది. దీనికి 'కొలె'అనే రూపాంతరం కూడా ఉన్నది ఈ రూపాలు సాధారణంగా కాలవాచక శబ్దాలపై, అర్థవాచక శబ్దాంపై చేరడం గమనించవచ్చు. వీటిలో 'కోలె' అనే రూపం ఇప్పటికీ తెలంగాణా గ్రామీణుల వ్యవహారంలో సజీవంగా కనిపిస్తుంది. ఉదా :— ఇన్ని దినాలగోలె (నుండి) చెప్తున్న, నువ్వు నెజి వింటలేవు" మొ॥ మహాభారతాది గ్రంథాలలో కోలె, కొలె రూపాలకు అనేక ప్రయోగాలు కనిపిస్తవి [10]

## 14. కొంచబోవు :—

'తీసుకొనిపోవు' అని దీనికర్థం. ఉదా:— 'ఈపుస్తకం కొంచబోయి (తీసుకొనిపోయి) ఆయనకు ఇవ్వు' మొ॥ 'కొనుచుపోవు' అనే గ్రాంథికరూపమే 'కొంచబోవు'గా వికృతి చెందిఉంటుంది (కొనుచుపోవు>కొన్(ం)చు పోవు> కొంచబోవు) ఈఅర్థంలోనే 'కొంటబోవు' అనే రూపంకూడా వ్యవహారంలో ఉన్నది. దీనికి 'కొంటుపోవు'అనేది మూలం. 'కొంటు' అనేది 'కొనుచు' అనే గ్రాంథిక శత్రర్థకానికి వ్యావహారికరూపం. (కొనుచుపోవు>కొంటుపోవు >కొంటబోవు) 'ను' అంతమందుగల ధాతువులకు వ్యావహారికభాషలో 'ంటు' తో కూడిన శత్రర్థకరూపా లేర్పడడం సహజమే. (అంటున్నాడు (అను); తింటున్నాడు (తిను); వింటున్నాడు (విను) మొ॥)

## 15. గదువ (మ) :—

'చిబుకం' అని దీనికర్థం. ఉదా :—"వాడు గదువ [మ] పట్టుకొని బ్రతిమిలాడినాడు" మొ॥ ఇది 'గద్దువ' అనే గ్రాంథికరూపానికి వికృతికావచ్చు. సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనంలో ఈరూపం కనిపిస్తుంది.[11] తీరాంధ్రంలో ఈఅర్థంలో 'గడ్డం' అనే పదం వాడుతారు.

## 16. జాలారి (రు) :—

ఇండ్లో పాత్రలు మొదలైనవి కడిగిన మురికినీరు పోవడానికి కట్టిన

---

10. "నాటంగోలె రాహువునకు" (మ. భా. I–2–20)
"యోజనంబునఁగోలె' (మ. భా. I–3–41)
"నృపవర పెక్కు నాళ్ళ గొలె") భాగవతం. IX–317)
11. "వెడలి గద్దువ మోవ వీడియఁబులు చేసి" (క. ర. IV–94)

సన్ననికట్టడం కాలువను తెలంగాణంలో జాలారి (రు) అని అంటారు సూ. ని. లో 'జలారి'అనేరూపం చూపబడింది. శ. ర. లో 'జలారి' అనే పదం లేకున్నా 'జలదారి'అనే శబ్దం ఉన్నది. దీనికి 'జలకము+దారి'అని పద విభాగం చూపబడింది. 'జలదారి' అనే రూపమే జలారిగానూ, జాలారి (రు) గానూ వ్యవహారంలో మారి ఉంటుంది. ( 'జలదారి>జలారి>జాలారి (రు) 'జలారి' పదానికి శ్రీనాథుని చాటుపద్యంలో ప్రయోగం కనిపిస్తుంది.[12]

## 17. జీ (జి) విలి :-

కర్దమలమని అర్థం. ఇది 'జిలిబి' అనే రూపానికి వికృతి కావచ్చు. సింహాసన ద్వాత్రింశికలో ఈ రూపం (జిలిబి) కనిపిస్తుంది.[13]

## 18. —తలికి :—

"నేను వచ్చేతలికి ఆయన వెళ్లిపోయిండు" మొదలైన పామరవ్యవహారాలలో 'తలికి' అనే రూపం ప్రచురంగా వినిపిస్తుంది. 'వచ్చేతలికి' అంటే 'వచ్చే సమయానికి' అని అర్థం. 'తఱి-కి' అనే గ్రాంథికరూపానికి 'తలి-కి' వికృతిరూపం కావచ్చు. 'తఱి'అంటే సమయం. 'వచ్చుతఱికి>వచ్చేతఱి-కి> వచ్చేతలి-కి) లేదా 'తలక్' అనే ఉర్దూ పదంతో దీనికి సంబంధం ఉన్నదేమో !

## 19. —తాన:-

'నాతాన లేదు' మొదలైన వాక్యాల్లో ఈ రూపం కనిపిస్తుంది. 'నాతాన' అంటే 'నాదగ్గర' అని అర్థం. ఇది "తావు" పదానికి సప్తమ్యంత రూపమైన "తావున" అనే పదంలో 'వు' లోపింపగా ఏర్పడ్డ రూపమే. (తావున>తాన). దీనితో పాటు 'తానికి' (=దగ్గరకు) అనేరూపం కూడా ఉన్నది. ఇది 'తావునకు' అనే షష్ఠ్యంతానికి వికృతి (తావునకు>తానకు>తానికి) ఇవి జడ వాచకాలపై రావు.

## 20. దివిలి (దీలి) పండుగ :—

ఇది దీపావళి పండుగ అనే అర్థంలో పామర వ్యవహారంలో ఉన్న

---

12. "ఇంగల మంచు వచ్చి యడియేనని తిరుకొంగటు దీసి జలారి చెంతనే"
13. "జిలిబికిం బుసులకుఁ జీమిడికిని బుట్టయైన మొగంబు" (సిం ద్వా I-100

పదం. ఇది 'దివ్వెల పండుగ' అనే పదానికి వికృతి రూపం కావచ్చు.[16] గోపరాజు సిం. ద్వా. లో 'దివ్వెల పండుగ' శబ్దం కనిపిస్తుంది.[17]

## 21. దూప :-

ఈ పదం తెలంగాణంలోనూ, రాయలసీమలోనూ 'దప్పి' అనే అర్థంలో వాడుకలో ఉన్నది.[14] "తాప" అనే సంస్కృత శబ్దానికిది వికృతి కావచ్చు. "దూప" పదానికి అనేక కావ్యప్రయోగాలు ఉన్నవి.[15] దూపగొను, దూప టిల్లు, దూపిల్లు మొదలైన క్రియారూపాలన్నీ ఈ "దూప" జన్యాలే.

## 22. నెఱి - నెఱియ :-

"వాడు నెఱి (=పూర్తిగా) వింటలేడు; వాడు నెఱియ (=పూర్తిగా) చెడిపోయిండు" మొదలైన వాక్యాల్లో ఈ రూపాలు కనిపిస్తవి. వీటిలోని "నెఱి" పూర్ణార్థకమైన గ్రాంథిక రూపమే.[18]

## 23. —పారి:—

ఇది ఆవృత్తి, పర్యాయం అనే అర్థాలను తెలుపుతుంది. ఉదా :- ఒక పారి, ఈపారి మొ॥ ఇది సాధారణంగా ఏకార్థక శబ్ద పూర్వకంగానే ఉంటుంది. శ. ర. లో ఈ అర్థంలో పరి, పారి అనే రెండు రూపాలూ చూపబడ్డవి. కావ్యాల్లో "పరి"కే అధిక ప్రయోగాలు కనిపిస్తున్నా "పారి"కి ప్రయోగాలు లేక పోలేదు. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలోనూ, హరివంశం లోనూ "పారి" ప్రయోగం కనిపిస్తుంది.[19]

---

14. మాండలిక పదకోశం - ఆం. సా. అ.
15. "వికటంపు టెఱకల విసరున నుప్పొంగు తుప్పర డెందంబు దూపడంగ" హరివంశం. ఉ. V-149)
16. ఆంధ్రుల సాంఘిక చరిత్ర (సురవరం ప్రతాపరెడ్డి) పే. 110
17. దివ్వెల పండుగోయనన్ (VIII-47)
18. "నెన్నడాదులన్ నెఱిదగు" నెఱ పూర్ణార్థకము. నెఱి రమ్యార్థకము (ప్రౌఢ వ్యాకరణం II-14) అని బహువచనవల్లివారు 'నెఱి'ని రమ్యార్థక మని చెప్పినా శ. ర. లో 'నెఱి'కి 'పూర్తి' అనే అర్థాన్ని, భారత ప్రయోగాన్ని చూపినారు.
19. "ఒక్కపరి వ్యాఘ్రమై వచ్చు నొక్కపారి దంష్ట్రియై తోచు" (ఉ. రా. III-54) "ఎనిమిదవ పారి వినినన్" (హరివంశం ఉ. 10-289)

24. బొక్క :—

ఇది "ఎముక" అనే అర్థంలో అధిక ప్రచారంలో ఉన్న శబ్దం శ.ర.లో కానీ, సూ ని.లో కానీ, వావిళ్ల నిఘంటువులో కానీ "బొక్క" అనే పదానికి "ఎముక" అనే అర్థం చూపబడలేదు. సింహాసన ద్వాత్రింశికలో పై అర్థంలో అనేక ప్రయోగాలు ఉన్నవి.[20] గోపరాజు కావ్యంలోని అనేక పదాలను గ్రహించిన పై నిఘంటు కర్తలు "బొక్క" అనే సిం. ద్వా. ప్రయోగానికి "ఎముక" అనే అర్థం చూపక పోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ నిఘంటువులన్నింటా "నోరునిండిన పౌడియగు తినుబండము, రంధ్రము అనే అర్థాలు మాత్రమే చూపబడ్డవి. రంధ్రమనే అర్థంలో తెలంగాణంలో ఈ పదం పరుషాదే కాని సరళాది కాదు.

ప్రాచీనాంధ్రభాషా ప్రయోగాలతో సాన్నిహిత్యం ఉన్న కొన్ని పలుకుబళ్లను మాత్రమే స్థాలీపులాక న్యాయంగా ఈ వ్యాసంలో చర్చించడం జరిగింది. పామరుల వ్యవహారంలో ఇప్పటికీ సజీవంగా ఉన్న పలుకుబళ్లు – గ్రాంథిక ప్రయోగాలకు అతిసన్నిహితమైనవి ఇంకెన్నో ఉన్నవి. వాటిని మరోసారి పరిశీలిస్తాను.

20. "ఒక్కబొక్క నిజాస్యంబున (సిం. ద్వా. I–270)
దౌడబొక్క (సిం. ద్వా. I–274)
బొక్కలు (సిం. ద్వా. I–100)

# ఆశ్చర్యార్థకాల్లో ఆప్తస్మరణం

—డా॥ సి. నారాయణ రెడ్డి

ఆశ్చర్యం కలిగినప్పుడు మనం దేవుణ్ణో, ఆప్తులనో తలచుకుంటాం. ఒక్కొక్కప్పుడు మంచిని స్మరించుకోవడమూ జరుగుతుంటుంది. బళి, భళీ, భళా అనేవి భలా (మంచి), భలాయీ (మంచితనం) అనే మరాఠీ, హిందీ పదాల పాదులో పుట్టినవి. "భళానోయ్ భళి తమ్ముడా, మేల్ భళానోయ్ దాదానా" అనే బుర్రకథ దరువులోని 'భళాభళీ'లు, మేళ్ భళాలు సాధ్వర్థ ద్యోతక శబ్దాలే. చాంగు, చాంగురే వంటి ఆశ్చర్యార్థకాలు కూడా మంచిని సూచించేవే. 'చాంగు' మరాఠీశబ్దం. మంచి, అందమైన అనే అర్థాల్లో వాడుకలో ఉంది.[1] 'చాంగురే', 'భళారే', 'హాయిరే' [2] వంటి పదాల్లోని 'రే' కి స్వతంత్ర ప్రతిపత్తి లేదు. ఇది ప్రశంసార్థకశబ్దాలకు అనుప్రయుక్తంగా ఉండే పుచ్ఛం మాత్రమే.

ఆశ్చర్యార్థకాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలిస్తే వీటిలో అధికాంశం ఆప్త స్మరణ సంబంధులే అగుపిస్తాయి. అంటే- మనం విస్మయచకితుల మైనప్పుడు అమ్మనో, నాన్ననో, అక్కనో, అన్ననో-చివరికి చెల్లినో తలచుకుంటామన్న మాట. ఆశ్చర్యార్థకాలుగా ప్రచారంలో ఉన్న పదాల్లో ఆప్త సంబంధ వాచకాలే ప్రాయికంగా ఉన్నాయని నిరూపించడమే ఈ వ్యాసిక ఉద్దేశం.

స్థూలంగా ఆప్త సంబంధ వాచకాలను మూడు వర్గాలుగా విభజింప వచ్చు. 1. మాతృవర్గం. 2. పితృవర్గం 3. సోదరసోదరీ వర్గం.

1. మాతృవర్గం :-

అమ్మో :- అమ్మను తలచుకోవడం.

ఓయమ్మో :- సంబుద్ధి రూపంలో ఉన్న ఆశ్చర్యార్థక మిది.

---

1. 'చాంగు' సంస్కృతంలోని 'చంగ' శబ్దవికృతి అయివుంటుంది.
2. ఈ వరుసలోనే 'మజ్జారే'ను కూడా పేర్కొనవచ్చు. ఇందులోని 'మజ్జా', 'మజా' అనే ఉర్దూపదం పుక్కిటపుట్టి ఉండవచ్చు.

ఓలమ్మో :- పై అర్థంలోనే ఉన్న మాండలిక మిది.

అమ్మమ్మో :- ఈ ద్విరుక్తి ఆశ్చర్యాతిశయద్యోతకం.

అమ్మమ్మమ్మమ్మమ్మ :- వేలదాటిన విస్మయాన్ని సూచించేది ఇది.

పైన పేర్కొన్న మొదటి నాలుగు అకారాంతాలుగా కూడా వాడుకలో ఉన్నవి.

అవ్వో :- ఈ పదం అమ్మమ్మ, ముసలమ్మ అనే అర్థాల్లోనే కాక 'అమ్మ' అనే అర్థంలోనూ వ్యవహారంలో ఉంది.[3] ఆశ్చర్యంతో నోరు నొక్కుకుంటూ అనేమాట ఇది. ఈ వ్యక్తీకరణం స్త్రీలకే ప్రత్యేకం. 'అవ్వో. ఓయవ్వో' అనే ఓకారాంతాలు కూడా వాడుకలో ఉన్నవి. మరి "నీయవ్వ" అనడం వేరు. అది నిందార్థకం

మాయురే :- దీన్ని దేశ్యమని శబ్దరత్నాకరకారుడు పేర్కొన్నాడు. కాని ఇది హిందీ. మరాఠీ భాషలోని మాతృర్థకమైన 'మాయి' అనే పదం నుంచి వచ్చిన రూపం.[4] మాయి>మా ఉ+రే>మాయు+రే. ఇదీ క్రమ పరిణామం.

2. పితృవర్గం :-

అబ్బో :- 'అబ్బ' అంటే తండ్రి. అబ్బో అంటే తండ్రిని తలచుకోవడమేకదా!

అప్పో :- 'అబ్బ'కు మూలం 'అప్ప'. ఇది తమిళభాషలో పితర్థంలో వాడుకలో ఉంది. తెలుగులో 'అప్పో' అనేది రాయలసీమ, నెల్లూరు ప్రాంతాల్లో

---

3. తెలంగాణంలో కొన్నికులాల్లో అమ్మను 'అవ్వ' అనడం నేటికీ ఉంది. భారతంలోని 'ఓయవ్వ నీవెవ్వరి దానవు' వంటి ప్రయోగాల్లోని 'అవ్వ' గౌరవబోధకమైన స్త్రీవాచకం మాత్రమే.

4. "మాయురె భృంగమా వికచమల్లికలన్ విడనాడి"
[శ్రీనాథుని పేర చెలామణిలో ఉన్న భృంగపంచకం]
"గుణమయ్యారే ప్రసాదంబు, మాయురె దాక్షిణ్యము"
(చంద్రాంగద చరిత్రం 3 ఆ.)

కేవల సంబుద్ధిగానే ప్రయోగంలో ఉంది. కానీ. ప్రాచీన కావ్యాల్లో అప్ప, అప్పప్ప అనేవి 'అబ్బ, అబ్బబ్బ' అనే అర్థంలో ప్రయోగించబడినాయి.[5]

అయ్యో :- అయ్య అంటే తండ్రి. ఇది 'ఆర్య' శబ్దభవం. ఇదీ తండ్రిని తలచుకోవడమే దీనికి 'అయ్యయ్యో'అనే ద్విరుక్తరూపం ఉంది. "అయ్యయ్య య్యయ్యో" తరచుగా వింటున్న మాటే మరి

అయ్యారె :- ఇది ప్రాచీనకావ్యాల్లోనూ[6] పాతతరహా నాటకాలలోనూ బహుళంగా కనిపిస్తుంది. అత్యంత గభీరంగా అభినందనాత్మకమైన ఆశ్చర్య రేఖను ప్రకటించడం దీని నైజం. ఎంత గాంభీర్య ప్రకటనం ఉన్నా ఈ పిలక ఆ "తండ్రి" పాములో పుట్టిందే కదా! దీనికి "అయ్యరే" అనే రూపాంతరం కూడా ఉంది.

ఓరి నాయనో ! :- ఇది పితృస్మరణ సంబంధియైన ఆశ్చర్యార్థక పదంగా బహుళ ప్రయుక్తం.

బాపు ! :- హిందీ, మరాఠీ ఉర్దూభాషలలో "బాప్" అంటే తండ్రి. "బాప్‌రే" అని మరాఠీలోనూ "బాప్‌రె బాప్" అని హిందీ ఉర్దూల్లోనూ ఈమాట నిత్యం వినిపిస్తుంది. ఆ "బాప్" ఈ "బాపు"గా రూపు దిద్దుకుంది. దీనికి ప్రాచీన కావ్యప్రయోగమూ[7] ఉంది. పదానికి 'రే' అనుప్రయుక్తంకాగా 'బాపురే' ఏర్పడింది.

3. సోదర సోదరీ వర్గం :-

అన్నా :- 'అన్నా ! ఎంతపని జేసిండు వాడు' వంటి వాక్యాలలోని "అన్న" ఆశ్చర్యాన్ని ప్రకటించేదే.

---

5. "అప్పా యెప్పురిం జెప్పనొప్పదురు" (రాజవాహన విజయం)
"అప్పప్ప భవత్ప్రభావవిభవాఢ్యత యేమని సన్నుతింపగన్"
(సారంగధర చరిత్రం. 1 ఆ.)

6. అయ్యారే ! చెలువెక్కడ అయ్యారే గెలువజాలు నంగజు నారిన్
(విజయవిలాసం. 1 ఆ.

7. "లేమనగవు చూపు, లేమననగు బాపు !" (విజయవిలాసం. 1 ఆ.)

అన్నన్న : :- ఈ ద్విరుక్తి విస్మయాధిక్య సూచి ఇది వాడుకలోనూ వుంది. ప్రాచీన కృతుల్లోనూ కనిపిస్తుంది.

అక్క : :- ఇది సమకాలీన వ్యవహారంలో ఆశ్చర్యార్థకంగా ప్రయుక్తం కాకున్నా ప్రాచీన కావ్యాల్లో విరళంగా అగుపిస్తున్నది.

ఓచెల్ల : :- ఇదీ ప్రాచీన కావ్యప్రయోగమే.[10] ఐతే ఇందులోని ఆశ్చర్య ప్రకటనంలో కొంత సంతాపచ్ఛాయ గోచరింపకపోదు. విస్మయం ఆనంద సమయంలోనే కాదు ఆపద్వేళ కూడా కలగడం లోకసహజం. ఈ "చెల్ల" అనే పదం ఈనాటి "చెల్లె" "చెల్లి", "చెల్లెలు" ఓ చెల్ల"కు "ఓ చెల" అనే ద్విత్వరహిత రూపాంతరం కూడా ఉంది.[11]

ఇంతవరకు ఆప్తవర్గంలో పేర్కొన్న పదాలు ప్రత్యేకంగానూ, ద్విరుక్తంగానూ, పునఃపునరుక్తంగానూ ఆశ్చర్యార్థకాలుగా రూపొందిన తీరును పరిశీలించడం జరిగింది. అమ్మా, నాన్నా, అక్కా, చెల్లీ విడివిడిగా జ్ఞాపకం రావడం మాత్రమే కాదు. ఒకేసారిగా అమ్మ, అక్క గుర్తుకు వచ్చిన సన్నివేశాలూ ఉంటాయి. అప్పుడుదయించిన ఆశ్చర్యార్థకమే "అమ్మక్క". ఆధునిక వ్యవహారంలో ఇది కనిపించకున్నా కావ్యప్రయోగంగా మాత్రమే మిగిలిపోయింది.[12]

అమ్మా, అక్కా కలిసి మాత్రమే కాదు అమ్మా చెల్లీ కలిసి జ్ఞప్తికి వచ్చిన సందర్భమూ లేకపోలేదు. అలాంటి పట్టున పుట్టిన మాటే "అమ్మచెల్ల.[13]

---

8. అన్నన్న : మొగము వెన్నుని యన్నన్న జయించు" (విజయ విలాసం. 1 ఆ.)

9 అక్క : యిదియేమిచోద్యమో" (శుకసప్తతి : 1 ఆ)
ఇందులోని అక్క 'ఔర' అనే అర్థంలో వాడబడింది.

10. ఓ చెల్ల : విరహిణీ వధమే చతురత నీకు–మను చరిత్ర 3ఆ.

11. "ఓ చెల: హస్తాంబురుహాంగుళీమయ మహాసిద్ధౌషధీపల్లవాంచలముల్ (శృం. నై. 5 ఆ)

12. అమ్మక్క : యని సతు లక్కజంబంద' (ద్విపదరామాయణం– బాలకాండ)

13. "అమ్మచెల్ల యిటు లనకుము" (భార. శాంతి. 3 ఆ.)

ఆప్తవర్గీయ పదాలన్నిటిలో అత్యంత చమత్కారంగా సంఘటితమైన పదం "అమ్మకచెల్ల". స్థూలంగా విన్నప్పుడు ఇది ఏ ధ్వన్యవస్థావాచక శబ్దమో అనిపిస్తుంది. కానీ ఇందులో ముగురు మూర్తులు ముప్పిరిగొని స్మృతి రంగంలో సాక్షాత్కరిస్తున్నారు అలా రూపొందిందే ఈ "అమ్మక చెల్ల" పదం. (అమ్మ+అక్క+చెల్లియ ≫అమ్మ+అక్క+చెల్లి ≫అమ్మ+అక+ చెల్ల.) ఇందులోని చిత్రం "చెల్లియ" "చెల్లి"గా మారడం కాదు "అక్క" లుప్తద్విత్వమై "అక"గా రూపొందడం. ఈ "అమ్మకచెల్ల" కూడా నిత్యవ్యవహారంలో నేడు గోచరించదు. ప్రబంధకాలంనాటికి ఇది వ్యవహారంలో ఉన్న సజీవ పదమే అయిఉంటుంది. ప్రస్తుతం మనుచరిత్ర, విజయవిలాసంవంటి ప్రబంధాలలో ఇంతలేసి కళ్లతో సహృదయ పాఠకులను చూస్తూనే ఉన్నది[14]. తనలో ఇమిడి ఉన్న ఆప్తత్రయాన్ని మీరైనా గమనించండి అంటూ మౌనభాషలో రహస్యాన్ని ప్రబోధిస్తూనే ఉన్నది.

14. "అమ్మకచెల్ల! వారి నయనాంబకముల్ శతపత్రజైత్రముల్"
(మ. చ.)

"అమ్మకచెల్ల నా హృదయ మమ్మక చెల్లదు వీని కీయెడన్"
(వి. వి. 1 ఆ)

# రతంలో శాంతరస సాధన పరిశీలనలో మరొక వివేచన

—డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

శాంతానికి రసస్థితి నంగీకరించే లాక్షణికులలో ప్రధానంగా వినవచ్చే వాదాలు రెండు. ఒకటి శాంతం నవమరస మని వివేచించేది.[1] మరొకటి శాంతం ప్రకృతిరస మని ప్రతిపాదించేది.[2] రసస్థితి నంగీకరించటంలో ఈ రెండూ సంవదించినా సాధనలో వీటిమధ్య కొంత అంతరం కనపడుతుంది శృంగారాది రసాలవంటిదే శాంత మని చెప్పే పద్ధతి మొదటిది. శృంగారాదులను వికృతి రసాలుగా వివేచించి వాటి ఉదయానికీ, ఉపశాంతికీ వెనుక మూలకందమైన నిర్వికార చిత్తస్థితిని ప్రకృతిరసంగా భావించేది రెండవది. సహజమైన ఈ భేదాన్ని ఆరస సమన్వయ మార్గాలలో పాటించవలసిన అవసరాన్ని గుర్తించటం పరిశీలకుల కర్తవ్యం.

ఈ పర్యాలోచనలో రసం సహృదయనిష్ఠ మన్న సత్యం నిర్వివాదాంశం. 'యేషాం కావ్యానుశీలనవశా ద్విశదీభూతే మనోముకురే వర్ణనీయతన్మయీభవన యోగ్యతా తే హృదయసంవాదభాజః సహృదయాః' అనే ధ్వన్యాలోక సహృదయ లక్షణం ప్రమాణం. కావ్యంలో నాయకాదుల నాశ్రయించి ప్రతీయమాన మయ్యే స్థాయిభావాదులను[3] తన్మయీభవనయోగ్యతతో హృదయసంవాద

---

1. 'నిర్వేదస్థాయిభావాత్మకః శాంతోఽపి నవమోరసః'- కావ్యప్రకాశము

2. 'భావా వికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతే ర్జాతః పున స్తత్రైవ లీయతే॥
స్వం స్వం నిమిత్త మాసాద్య శాంతా ద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయే శాంత ఏవ ప్రలీయతే॥ నాట్యశాస్త్రము-6.107, 108 (అభినవభారతీ సహితము)

3. 'రసస్తు కథానాయకాశ్రయః తద్విపక్షాశ్రయో వా'–ధ్వన్యాలోకము.

భాక్కులై అనుభవించేవారు సహృదయులు. వారిఅనుభవం నాయకాదులతో నైన సమరూప చిత్తవృత్తి రూపమైన భావసంవాదం. అందువల్లనే

'య స్తుష్టౌ తుష్టి మాప్నోతి శోకే శోక ముపైతి చ
క్రోధే క్రుద్ధో భయే భీరు స్స శ్రేష్ఠః ప్రేక్షక స్మృతః'[4]

అని పేర్కొనటం. నాయకాశ్రిత మైనది రతి అయితే సహృదయానుభవ నిష్ఠ మయ్యేది శృంగారరసం. నాయకాశ్రితమైన స్థాయిని వ్యవహారసౌలభ్యం కోసం రస మంటారు కాని రసం సామాజికనిష్ఠ మైనదే. 'ఆశ్రయ' (ఆలంబన) 'నిష్ఠ' శబ్దాలను సమానార్థకాలుగా భావిస్తే అన్వయంలో అపార్థం చోటుచేసుకొనే ప్రమాదం రావచ్చు. ఇంత ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే 'ఆంధ్రమహాభారతము-అంగిరసము'[5] అన్నవ్యాసంలో నేను పైఅంశాలను పేర్కొంటూ 'నాయకుడు వీరరసాశ్రయు డైనచో సామాజికుడు వీరరసానందమునే పొందును' ఇత్యాది వాక్యాలను వ్రాయగా వాటిని డా॥ శలాక రఘునాథ శర్మగారు తమ సిద్ధాంత వ్యాసంలో సమీక్షిసూ-నేను రసము అనుకార్యనిష్ఠ మని భావించినట్లు తలంచినారు.[6] అట్టిప్రమాదం మరలా పాఠకులకు కలుగకూడ దని ఈవివరణ.

శాంతం ప్రకృతిరసమన్న వాదాన్ని స్థాపించినవాడు అభినవగుప్తుడు. నవమరసంగా ఆరసాన్ని సాధించటంలో కానవచ్చే కొన్ని అనుపపత్తులను తొలగించటానికీ, శాంతరస స్థాయిభావ కోలాహలాన్ని శాంతింప జేయటానికి ఒక మహామంత్రంగా ఆయన ఆ క్రొత్తబాటను నిర్మించాడు. అది ఒక రస సమీకరణవాదంలా రూపొందింది

అభినవగుప్తుడు శాంతరసానికి తత్త్వజ్ఞానం స్థాయిభావ మని ప్రతిపాదించి స్థాపించినతీరు పరమరమణీయం, పరమప్రమాణం। ఆయన 'శాంతరసప్రకరణ' ప్రవచనాన్ని మనం రెండంశాలుగా విభజించుకొని ఇక్కడ పరిశీలిద్దాం 1 స్థాయిభావ స్వరూప స్వభావ విచారం 2. శాంతరసాస్వాద విధాన విచారం.

---

4. **భావప్రకాశము-శారదాతనయుడు.**
5. **నవ్యాలోకము డా. జి వి. సుబ్రహ్మణ్యం పుటలు 1-47.**
6. **కవిత్రయమువారి ఆంధ్రమహాభారతము-ధ్వనిసిద్ధాంత సమన్వయము సిద్ధాంతవ్యాసము (వ్రాతప్రతి)- పుట 673.**

1. తత్త్వజ్ఞాన స్వరూప సంభావాలు

1. తత్త్వజ్ఞానమే మోక్షసాధనం కాబట్టి తత్త్వజ్ఞానమే స్థాయి. తత్త్వజ్ఞాన మంటే ఆత్మజ్ఞానమే. జ్ఞానానందాది విశుద్ధ ధర్మయుక్త మైనదీ, పరికల్పిత విషయోపభోగ రహిత మైనదీ అయిన ఆత్మయే శాంతానికి స్థాయి. దీన్ని స్థాయి అని వేరుగా చెప్పవలసిన పనే లేదు.[7]

2. తత్త్వజ్ఞానం సకలభావాంతర భిత్తిస్థానీయం. సర్వస్థాయి భావాల కంటె అది స్థాయితమం. రత్యాది చిత్తవృత్తులన్నీ దానికి సంచారులు. అందువల్ల అది నిసర్గ మైన సిద్ధస్థాయిభావం.[8]

3 రత్యాదులకూ తత్త్వజ్ఞానానికి భేదం ఉంది. రత్యాదులు చిత్తవృత్త్యంతర సంపృక్తాలై కలుషితా లౌతవి వాటికి లౌకికప్రతీతి ఉంది. తత్త్వజ్ఞానం చిత్తవృత్త్యంతరానుసంధానం కలిగినా అవికల రూపంగా ఉంటుంది. దానికి లౌకికప్రతీతి ఉండదు. లోకంలో ఇది కొంత భాసించినా, రత్యాదిస్థాయి భావాల్లాగా దీన్ని పరిగణించటానికి వీల్లేదు. సాధ్యరసాలైన శృంగారాదుల్లో సిద్ధరస మైన శాంతానికి ఉపయోగం లేదు. తత్త్వజ్ఞాన మెప్పుడూ సంచారి భావంలాగా లక్షణీయం కాదు.[9]

---

7. 'కస్తర్హ్యత్ర స్థాయీ? ఉచ్యతే-ఇహ తత్త్వజ్ఞాన మేవ తావన్మోక్ష సాధన మితి తస్యైవ మోక్షే స్థాయితా యుక్తా. తత్త్వజ్ఞానం చ నా మాత్మజ్ఞాన మేవ...తేన ఆత్మైవ జ్ఞానానందాది విశుద్ధధర్మయోగీ పరికల్పితవిషయోపభోగరహితోఽత్ర స్థాయీ. న చాస్య స్థాయితయా స్థాయిత్వం వచనీయం'-అభినవభారతి-పరిష్కృత శాంతరస ప్రకరణమ్ Number of Rasas- Prof. V. Raghavan- పుట 97)

8. తత్త్వజ్ఞానం తు సకలభావాన్తరభిత్తిస్థానీయం, సర్వస్థాయిభ్యః స్థాయితమం. సర్వా రత్యాదికాః చిత్తవృత్తీః వ్యభిచారిభావయన్ నిసర్గత ఏవ సిద్ధస్థాయిభావ మితి తన్నవచనీయమ్.- పరిష్కృత శాంతరసప్రకరణమ్. N. O. R. పుట. 98.

9. న హి రత్యాదయ ఇవేతరాసంపృక్తేన వపుషా తథావిధ మాత్మరూపం లౌకికప్రతీతిగోచరః. స్వగత మపి అవికల్పరూపం వృత్త్యా నావసరేఽనుసంధీయమానం చిత్తవృత్త్యంతరకలుష మేవావభాతి. భాసతాం వా లోకే తథా, తథాపి న సంభవన్మాత్రస్థాయినాం గణనమ్, రసేషూక్తేషు అనుపయోగాత్; అపి తు వ్యభిచారిత్వేన లక్షణీయత్వం విజ్ఞాయతే, నేతరథా'- ప. శాం.ప్ర. N. O. R. పుట. 98.

**2. శాంత రసాస్వాద విధానం :-**

1. తత్త్వజ్ఞాన బీజ సంస్కార భావితులే ఇందు హృదయసంవాదాన్ని పొందగలుగుతారు.[10]

2 తత్త్వజ్ఞానం, శమం- సర్వం ఆత్మరూపమే. రత్యాదులు ఆత్మలోని కాలుష్యోపరాగ విశేషాలు. తత్త్వజ్ఞానసిద్ధుడైన సహృదయుడు రత్యాదులను అనుగమించినా, సమాధినుండి వ్యుత్థితచిత్తుడైనా అవ్యవధానంగా సమాధిబలం చేత దాన్ని అధిగమించి, ప్రశాంతచిత్తుడౌతాడు.[11]

3. శాంతం సర్వరసప్రకృతి. ఇతరరసాలు సంస్కారాంతరాలతో ఉంటాయి. శాంతం సర్వసంస్కారమూలప్రకృతి. విషయవిపరివృత్తివలన సర్వరసాలూ పర్యంతాన శాంతంగానే ఆస్వాదనీయా లౌతున్నాయి.[12]

4. తత్త్వాస్వాద స్వరూపం- రత్యుత్సాహాదు లన్నీ ఉపరాగాన్ని కలిగిస్తాయి. దానివలన ఆత్మస్వరూపం ఉపరంజితమై వాటియందు అనుభూతమౌతుంది. విరళంగా కూర్చబడినరత్నాలలో సితతరంగా నిర్భాసించే సూత్రంలాగా ఉపరంజకాలైన రత్యాదులలో ఆత్మస్వరూపం గోచరిస్తుంది. రత్యాదులేవీ ఉపరంజకాలుగా లేకపోయినా ఆత్మవలె తత్త్వజ్ఞానం భాసిస్తుంది. అలా, భాసమానమైన తత్త్వజ్ఞానం విషయపరాఙ్ముఖత్వంవల్ల సకల దుఃఖరహితమై, పరమానందలాభంతో సంవిదేకరూపమై ప్రకాశిస్తుంది. కావ్యప్రయోగబంధాల

---

10. హృదయ సంవాదోఽపితథావిధ తత్త్వజ్ఞానబీజసంస్కారభావితానాం భవత్యేవ- ప. శాం. ప్ర. N. O. R. పు. 103.

11. త దిద మాత్మస్వరూప మేవ తత్త్వజ్ఞానం శమః, తథా చ తత్కాలుష్యోపరాగవిశేషా ఏవాత్మనే రత్యాదయః. తదనుగమేఽపి శుద్ధమస్యరూపం అవ్యవధాన సమాధిబలాద్ అధిగమ్య వ్యుత్థానేఽపి ప్రశాంతతా భవతి- ప. శాం. ప్ర. N. O. R. పుట 99.

12. తత్ర సర్వరసానాం శాంతప్రాయ ఏవాస్వాదః, విషయేభ్యో విపరివృత్త్యా. తన్ముఖ్యతాలాభః కేవలం వాసనాన్తరోపహిత ఇతి. అత్ర సర్వప్రకృతిత్వాభిధానాయ పూర్వ మభిధానమ్. ప. శాం. ప్ర. N. O. R. పు. 104.

వలన సాధారణరూపంతో నిర్భాసించి, అంతర్ముఖావస్థా భేదంతో లోకోత్తరానందా న్నిచ్చి సంవిన్మయమైన హృదయసంవాదాన్ని కలిగిస్తుంది.[13]

పైఅంశాలను క్రోడీకరించుకొని శాంతరస సమాలోచనం సాగింపవలసి వచ్చినపుడు విమర్శకు లీక్రిందివిధంగా వివేచించుకోవలసివస్తుంది.

1. నిసర్గసిద్ధమూ, స్థాయితమమూ, ఆత్మజ్ఞానరూపమూ, సర్వరస ప్రకృతిభూతమూ అయిన స్థాయివలన కలిగే రససిద్ధి వికృతిరససిద్ధికంటె విశిష్టమై ఉండాలి.

2. రత్యాదులు వికృతులైతే ప్రకృతి అయిన ఆత్మజ్ఞానం నిర్వికారంగా నిలిచేది అయి ఉండాలి. అయితే అది ప్రాగభావం కాకుండా ప్రధ్వంసాభావ మని తృష్ణాక్షయసుఖస్థాయివిచారంలో అభినవగుప్తుడు నిర్దేశించాడు.[14]

3. రత్యాదులు సహృదయులకు రసానందాన్ని కలిగిస్తే, స్థాయితమ మైన తత్త్వజ్ఞానం జ్ఞానానందాది విశుద్ధధర్మమైన ఆత్మస్వరూపంతో అభిన్నం కాబట్టి, దానివలన కలిగేది జ్ఞానానంద మని నిర్దేశింపవచ్చు.

---

13. తత్త్వాస్వాదోఽన్య కీదృశః - ఉచ్యతే–ఉపరాగదాయిభిః ఉత్సాహ రత్యాదిభి రుపరక్తం యదాత్మ స్వరూపం తదేవ విరళోంభిత రత్నాంతరాళ నిర్భాసమానసితతర సూత్రవద్ యదాహిత తత్స్వ రూపం సకలేషు రత్యాదిషు ఉపరంజకేషు తథాభావేనాపి సకృద్విభా తోఽయ మాత్మేతి న్యాయేన భాసమానం పరాఙ్ముఖతాత్మక సకల దుఃఖజాలహీనం పరమానందలాభ సంవిదేకత్వేన కావ్యప్రయోగ బంధాభ్యాం సాధారణతయా నిర్భాసమానం అంతర్ముఖావస్థాభేదేన లోకోత్తరానందానయనం తథావిధహృదయం విధత్త ఇతి' – ప. శాం. ప్ర. N.O.R. పుట 106.

14. అన్యేతు స్వంస్వం నిమిత్త మాసాద్య...ప్రలీయతే ఇతి భరతవాక్యం దృష్టవన్తః సర్వరససామాన్యస్వభావం శాన్తమాచక్షాణా అనుపజాత విశేషాన్తరం చిత్తవృత్తిరూపం శాన్తస్య స్థాయిభావం మన్యన్తే. ఏతచ్చ నాతీవాస్మత్పక్షా ద్దూరమ్. ప్రాగభావప్రధ్వంసాభావకృతస్తు విశేషః. యుక్తశ్చ ప్రధ్వంస ఏవ తృష్ణానామ్ – లోచనవ్యాఖ్యా. ధ్వన్యాలోకః, నిర్ణయసాగరప్రతి- 1935 - పుట 220.

4. శాంతరసాస్వాది యైన సహృదయుడు సహజంగా తత్త్వజ్ఞానబీజ సంస్కారభావితుడుగా ఉండాలి కాబట్టి వీతరాగుడైన జిజ్ఞాసువే ఈరససిద్ధికి తగినఅధికారి. జిజ్ఞాస మోక్షదాయకం కాబట్టి మోక్షపురుషార్థనయ మైనదే శాంతం.[15]

5. రసం సామాజికనిష్ఠంకాబట్టి సహృదయుని తత్త్వజ్ఞానమే శాంతానికి స్థాయి.

6. మోక్షపురుషార్థసాధనైకవృత్తి గల సహృదయునికి కావ్యరసాస్వాదనప్రవృత్తియే ఒకవికృతి. ఆవికృతి నాశ్రయించి అతడు ముందుకు సాగినా అతని ఆత్మతత్త్వజ్ఞానం రత్నహారంలో దారంలాగా ఉపరంజిత మైనా, కాక పోయినా స్వస్వరూపప్రకాశంతో నివృత్తిరూపంగా శోభిస్తూ ఉంటుంది.

7. రత్యాదులు శకుంతలా దుష్యంతాదు లైన విభావాదుల నాశ్రయించి ప్రతీయమాన మౌతుంటే వాటిని సహృదయుడు తన్మయీభవనయోగ్యతతో హృదయసంవాదాన్ని భజించి ఆస్వాదిస్తాడు వికృతిరసవివేకంలో. కాని. ప్రకృతిరసవివేకంలో తత్త్వజ్ఞానం నాయకాశ్రితం కావచ్చు, కాకపోవచ్చు. అసలు కావ్యంలోని రత్యాదిరసభావాలు కావు ప్రకృతిరసాస్వాదనపరుడైన సహృదయునికి ప్రధానం మోక్షదాయక మైన తత్త్వజ్ఞానమే ముఖ్యం. అందు వల్ల కావ్యంలోని తత్త్వజ్ఞానోపదేశమే అతనికి స్థాయి. ప్రకృతిరస మెప్పుడూ కావ్యగతశాస్త్రరూపమైన తత్త్వజ్ఞానాన్ని ఆశ్రయించే స్థాయిత్వాన్ని భజిస్తుంది.

8. ప్రకృతిరసప్రతీతి సహృదయుని ఆత్మస్థితమై ఉండటంచేత తత్త్వజ్ఞానం ప్రధానంగా ఆత్మరతిరూపంగానే భాసిస్తుంది. నిజానికతడు తనతోనే తాను తాదాత్మ్యం పొందుతాడు. తన ఆత్మజ్ఞానంతోనే సంవదిస్తాడు. కావ్యార్థాలతనికి నిమిత్తమాత్రాలు; కారణమాత్రాలు. పర్యంతంలో నిలిచే స్వస్వరూపసంవిదాత్మక మైన సమాధిస్థితియే అతని రసస్థితి.

9. ఈదృష్టితో వివేచిస్తే రత్యాదిస్థాయిభావాలవలన సహృదయుడు పొందేది రసానందం; స్థాయితమ మైన తత్త్వజ్ఞానంవలన వీతరాగులు సవికల్ప

15. **తతః త్రివర్గఫలకరసానంతరం మోక్షఫలక శ్శాంతః- అభినవ భారతి-నా, శా, 24అధ్యా,**

మయ్యే నిర్వికల్పతను సాధించే చిత్తవృత్తియందు అంతర్ముఖావస్థలో పొందేది జ్ఞానానందం; బహిర్విషయవిముక్తుడై నిర్వికల్పసమాధిలో బ్రహ్మానుసంధానం వలన యోగి పొందేది బ్రహ్మానందం. మొదటిది అలౌకికరసానందం; రెండవది లోకోత్తర పరమానందం. మూడవది నిర్వికల్ప బహ్మానందం.

10. శాంతం నవమరస మని అంగీకరిస్తే దానివలన కలిగేది రసానంద మే; ప్రకృతిరస మని వివేచిస్తే మోక్షసాధక మైన జ్ఞానానంద మౌతుంది. రసానందం బ్రహ్మానంద సబ్రహ్మచారి మాత్రమే. జ్ఞానానందం మోక్షోపస్కా రకంకూడా. ఇక బ్రహ్మానందమే సాక్షా న్మోక్షస్థితి. ఈ విధమైన వివేచనం లక్షణవిరుద్ధం కాదు. దీనికి దృష్టాంతం మహాభారతంలో శాంతరససాధనం.

## ఆనందవర్ధనుని శాంతరసప్రస్తారం- అభినవగుప్తుని పరిష్కారం:-

శాంతరసాభావవాదాన్ని ఖండిస్తూ ఆనందవర్ధనుడు తృష్ణాక్షయసుఖ స్థాయి అయిన శాంతాన్ని అంగీకరించాడు. కాని దానిని ప్రకృతిరస మని కాని స్థాయిని స్థాయితమ మని కాని నిర్దేశించలేదు అయితే అందరికీ తృష్ణాక్షయసుఖ చిత్తవృత్తి అలవడటం సాధ్యం కాదనీ, ఏకొద్దిమంది మహాపురుషులలోనో అది సిద్ధమైనా దానిని శాంతరస మని అంగీకరించటంలో అభ్యంతర ముండకూడ దనీ కూడా పేర్కొన్నాడు.[16] దీనినిబట్టి ఆనందవర్ధనుడు శాంతాన్ని నవమ రసంగా మాత్రమే అంగీకరించినా డని స్పష్టమౌతుంది. ఆనందవర్ధనుని యీ వాక్యాలపై వ్యాఖ్యానిస్తూ లోచనకారుడు (అభినవగుప్తుడు) శాంతానికి విభా వాలుగా జనకాదిరాజర్షులు సముచితంగా ఉంటారని సూచించాడు. 'శృంగారాదే రపి ఫలభూమావవర్ణనీయ త్రైవ పూర్వభూమౌతు ప్రశాంతవాహితా' 'సంస్కా తా న్తశ్చి దేషు ప్రత్యయా న్తరాణి సంస్కారేభ్యః' ఇతి సూత్రద్వయ నిత్యా చిత్రాకారా యమనియమాది చేష్టా వా రాజ్యధరోద్వహనాది లక్షణా వా శాన్త స్యాపి జనకాదే ర్దుష్టైవేత్యనుభవ సద్భావాద్యమనియమాది మధ్యా సంభావ్యమాన భూయో వ్యభిచారి సద్భావాచ్చ ప్రతీయత ఏవ"[17] - ఇత్యాది వాక్యాలవలన నాయకాశ్రితమైన స్థాయి శాంతరసకావ్యంలో ఎలా పోషింపబడటానికి వీలుందో

16. ధ్వన్యాలోకః- తృతీయోద్యోతః- పుట 219-220. (లోచనవ్యాఖ్యా సహితం-నిర్ణయసాగర ప్రెస్ప్రతి 1935)

17. లోచన వ్యాఖ్యా- ధ్వన్యాలోకః- తృతీయోద్యోతః - పుట 220.

తెలుసుకోవటానికి అవకాశం కలుగుతోంది. అది నవమరసవాదాని కనుకూలమైన శాంతరసచర్చకు ఉపయో' పడుతుంది.

ఆనందవర్ధనుడు ప్రబంధాలలో ఏదో ఒకరసం అంగిగా పోషింపబడాలని నిర్దేశిస్తూ రామాయణభారతాల్లోని అంగిరసాలను నిర్ణయించాడు. ఆరెండూ రెండుత్రోవల నడిచాయి. వాల్మీకి 'శోకః శ్లోకత్వ మాగతః' అని కరుణరసాన్ని సూచించి, సీతాత్యంతవియోగపర్యంతంగా తన ప్రబంధాన్ని నిర్మించి తద్రసాన్ని పోషించా దని రామాయణరససాధనవిధానాన్ని పేర్కొన్నాడు[18] ఈపద్ధతినిబట్టిచూస్తే రామాశ్రితమైన శోకస్థాయియే సహృదయ హృదయసంవాదంలో కరుణరసమయి సిద్ధిస్తుందని స్పష్టమౌతున్నది. మరి-మహాభారతరసచర్చలో నాయకాశ్రిత మయిన స్థాయి యేదీ చెప్పబడలేదు. ఆకావ్యాన్ని శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయిగా నిర్దేశించి శాస్త్రనయా న్ననుసరించి పరమపురుషార్థమైన మోక్షం, కావ్యనయా న్ననుసరించి తృష్ణాక్షయసుఖ పరిపోషణాత్మకమైన శాంతం ప్రధానవివక్షితా లైనట్లు స్పష్టంచేశాడు. భారతంలో శాంతరసాస్వాదన విధానాన్ని నిరూపిస్తూ వృష్ణిపాండవవిరసావసాన కథార్థాలవలన సహృదయునికి విషయవైమనస్యం కలిగి వైరాగ్యం జనిస్తుం దనీ, అది మోక్షమూలం కాబట్టి గీతాదులలో నిబంధింపబడిన పరమపురుషార్థసాధకమైన పరిజ్ఞానాన్ని ఆశ్రయించి విరతుడైన సహృదయుడు సనాతనుడైన శ్రీకృష్ణ బ్రహ్మతత్త్వాన్ని ఉపాసిస్తాడనీ, అవిద్యాప్రపంచరూపమైన పాండవాదులచరిత్రలన్నీ నిస్సారాలని గ్రహించి, వాటియందు అభినివేశం పూనకుండా పరమార్థతత్త్వాన్నే ఆస్వాదిస్తా డనీ, తదాస్వాదనజన్యమైన రసమే శాంత మనీ ఆనందవర్ధనుడు పేర్కొంటాడు. భారతాంతంలో హరివంశవర్ణనంవల్ల సాంసారికవృత్తిరూపమైన మహాభారతకథార్థాలలో సంసారాతీతతత్త్వ మైన వాసుదేవపరబ్రహ్మమే వివక్షితమని ప్రబంధధ్వనిగా వివేచిస్తాడు.[19]

ఆనందవర్ధనుని భారతశాంతరససాధన సహృదయునివివేచనపై ప్రధానంగా ఆధారపడి ఉంది. భారతతత్త్వోపదేశమే అతని చిత్తవృత్తికి వైరాగ్యదాయకమై క్రమంగా శాంతరససిద్ధిని కలిగిస్తుం దని నిరూపింపబడింది. ఈ వైరాగ్యం స్థాయిగా ధర్మరాజాదులనుగాని, శ్రీకృష్ణాదులనుగాని ఆశ్రయించి

18. ధ్వన్యాలోకః - చతుర్థోద్యోతః - పుట 298
19. ధ్వన్యాలోకః - చతుర్థోద్యోతః - పుటలు 2 8-300

ప్రతీయమాన మయ్యేది కాదు. ప్రబంధార్థ తత్త్వజ్ఞాన చర్వణంవలన సహృదయుడు సాధించేది. ఈవిధమైన విమర్శలో భారతశాంతరసాస్వాదన రామాయణ రసాస్వాదనలాంటిది కా దని ఆనందవర్ధనుడు వాచ్యం చేయకుండా వ్యంగ్యంగా సూచించాడు.

ఇక్కడ వివేచనాపరులకు ఒకసత్యంమాత్రం స్పష్టమౌతుంది. శాంతాన్ని శృంగారాదులవలె నవమరస మని భావించిన ఆనందవర్ధనుడు తద్రసాస్వాదన విధానంలో ప్రకృతిరసవివేచనమార్గా న్ననుసరించా డనటంలో అనుమానం లేదు. నిజానికి అతని ప్రవచనా న్ననుసరించి చూస్తే కావ్యనయమైన తృష్ణాక్షయసుఖాత్మకస్థాయిభావాన్ని కావ్యనాయకాదుల నాశ్రయించి వివేచింపవలసి ఉంది. కాని, ఆపని ఆయన చేయలేదు. దానిని నాయకాశ్రితంగా సమన్వయించటం భారతంలో సాధ్యం కా దని ఆయన వ్యంగ్యమార్గా న్ననుసరించి అంగీకరించా డని భావింపవచ్చు అయినా, ఆధునికులామార్గాన్ని ప్రస్తరించి చూపించారు.[20] కాని, అదంతా ఆనందవర్ధనుని మతాన్ననుసరించి అవిద్యామూలకమై భాసిస్తున్నది. శాంతరసకావ్యాలలో జనకాది జీవన్ముక్తుల చరిత్రలు వర్ణించినప్పుడే అది నాయకాశ్రితమై ప్రతీయమానమౌతుందన్న అభినవగుప్తుని వివేచనం గమనించటం ముఖ్యం. ధర్మజుడు ధీరశాంతు డని గానీ, తత్త్వజ్ఞాని అనిగానీ, జీవన్ముక్తుడనికాని నిరూపించటానికి భారతంలోకూడా అవకాశంలేదు[21] అందువల్ల భారతంలో తత్త్వచింతయేస్థాయి. కాగా, పాండవాదుల వృత్తాంతాలు ఉపరాగమాత్రదాయకాలై సహృదయుని విషయవిపరివృత్తివలన వికృతులై పోతున్నాయి. సంచారులై సమసిపోతున్నాయి. ఇట్టిస్థితిలో ఆనందవర్ధన ప్రతిపాదితమైన తృష్ణాక్షయసుఖస్థాయికంటె అభినవగుప్తుని తత్త్వజ్ఞానస్థాయియే భారతశాంతరస సమన్వయంలో సమాశ్రితమౌతున్నది. లోతుగా ఆలోచించి చూస్తే అభినవగుప్తుని ప్రకృతిరసవాదం ఆనందవర్ధనుని శాంతరస ప్రస్థానానికి నిర్దుష్టమైన పరిష్కారం!

---

20, తిక్కన కావ్యశిల్పము- డా॥ కె. వి. రామకోటిశాస్త్రి, పుటలు-129-148 మరియు, 140 పుటలోని 2వ అధోజ్ఞాపికలో చెప్పబడిన శ్రీ పి. యస్. మల్లిక్ బహద్దూర్ వంటి శాంత విమర్శకు లందరూ ఈ మార్గానికి చెందినవారే.

21. శాంతరసపగీత- ఆంధ్రభారతము శాంతపర్వము సమీక్ష పీఠిక డా॥ వి. సుబ్రహ్మణ్యం (ఆం. ప్ర. సా. అకాడమీ వారి ప్రచురణ)

ఆంధ్రభారత శాంతరస విమర్శ :-

శాంతరస చర్చలో నవమరస ప్రకృతిరస స్థితులను విశ్లేషించుకొని విమర్శించకపోతే స్పష్టమైన దర్శనం కలగటం సాధ్యం కాదు. ఆంధ్రమహా భారతంలో అంగిరసంగా శాంతాన్ని సాధించే విమర్శలలో ఇట్టి విశ్లేషణ లోపిం చటంవల్ల సాంకర్యం కనపడుతున్నది. దాన్ని తొలగించటానికి పరిశీలకులు ప్రయత్నం చేయవలసి ఉంది. అందుకు కొన్ని సూచనలు.

1. ఇతిహాసపురాణాలు శాంతరస ప్రధానా లన్న సంప్రదాయాన్ని పాటించి భారతరసాన్ని నిరూపింప దలచుకుంటే అభినవగుప్తుని ప్రకృతిరస మార్గాన్ని అనుసరించటం ఉచితం.

2. భారతంలో నాయకుడు ధర్మరాజనీ, అతని నాశ్రయించి ప్రతీయ మాన మయ్యే స్థాయి శమ మనీ సాధించే మార్గం ప్రకృతిరస వివేచనంలో పొసగని ప్రస్థానం. అయితే, శాంతం నవమరస మనే వాదాన్ని ఆశ్రయిస్తే ఆ మార్గం ఉపాదేయమే.

3. ఆంధ్రభారతం సంస్కృతభారతంకంటె విలక్షణమైన స్వభావాన్ని సంతరించుకున్నది. మూలభారతం శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి; ఆంధ్ర భారతం కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయి. ఈ మార్పు కవిత్రయంవారి కావ్య కళాదృష్టివలన ఏర్పడింది. తిక్కన్నగారు 'ధర్మాద్వైత స్థితి'ని పేర్కొన్నారు దానికి ధర్మముయొక్కయు, అద్వైతముయొక్కయు స్థితి అని శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు వ్యాఖ్యానించారు.[22] అట్లయినప్పుడు కావ్యనయమున సాధిం పబడేది నాయకాశ్రితమైన ధర్మస్థితి-అంటే ధర్మవీరం; శాస్త్రనయమున అద్వైత స్థితి-అంటే తత్త్వజ్ఞానం. సూక్ష్మవివేచన నాశ్రయిస్తే సమన్వయ సౌలభ్యం కలుగుతుంది. తత్త్వజ్ఞానమే స్థాయి అని అంగీకరిస్తే పకృతిరసవాదాన్ని అను సరించి సహృదయుడు పొందేది శాంతరస మౌతుంది. కాని, కవిత్రయ ప్రణాళికలో కావ్యరసానికి తత్త్వజ్ఞానం అంగం. అందువల్లనే భగవద్గీతాదులు తెలుగులో తావన్మాత్రంగానే నిలిచాయి. కావ్యరసాన్ని కొనియాడటంలో[23] నవమరసంగా శాంతాన్ని అంగీకరించే దృక్పథం ఉంది. అప్పుడే కావ్యనాయక

**22. తిక్కయజ్వ హరిహరనాథతత్త్వము - పుట 13**

**23. ఆంధ్రమహాభారతము- విరాటపర్వము- 1ఆ. 15 ప.**

జీవితానికి ప్రాధాన్యం వస్తుంది. హరివంశాన్ని భారతభాగంగా అనువదించక పోవటంలో ఆంతర్యం కూడా అదే ధర్మజుడు ధర్మవీరుడు కాని జనకశుకాదుల్లాగా జీవన్ముకుడు కాడు ఆయనజీవితంలో కొంద రన్నట్లు నిర్వేదం స్థాయి కాదు.[24] ఆతడు విరక్తుడూ కాడు. అందువల్ల శాంతరసాశ్రయుడుగా ఆయన జీవితంలో స్థాయి ప్రతీయమానం కావటానికి వీల్లేదు. 'యమధర్మరాజునంశముగా భూలోకమునకు వచ్చి మరల నాతనిలో లీన మగుట[25]' మోక్షం కాదు. అస లాచివరిఅవస్థ కాదు స్థాయిని నిర్ణయించేది. నాయక జీవితప్రవృత్తి నిరూపిస్తుంది. యమునిలో లీనం కావటానికి ఆయన జీవితమంతా కృషి చేయలేదు. అట్లని జీవన్ముక్తస్థితిలో నిలిచి జీవితాన్నంతా ఉపరాగంగా భావించలేము. అంతే కాదు స్వర్గంకోసం కూడా ఆయన తాపత్రయపడనూ లేదు. అతని ధర్మస్థితికి ఫలం స్వర్గం. అంతే. అతడు ధర్మాచరణ ప్రమాణాన్ని లోకానికి నిరూపించి చూపటానికి పుట్టిన కారణజన్ముడు. అతనిస్థితి మోక్షస్థితి కాదు; ధర్మస్థితి. భారతంలోని బహుశాస్త్రవిషయాలలో మోక్షవిషయ మొకటి. అది జ్ఞానదీప్తిని కలిగించేది. జ్ఞానదీప్తి ధర్మస్థితికి ఉద్దీప్తిని కలిగించేది. అలా అంటే శాంతం ధర్మవీరాని కంగంగా ఉండటం ఉచితం కాదని ఒకశంకి రావచ్చు[26] ఆనందవర్ధనాదులు శాంతాన్ని మరొకరసంలో అంతర్భావింపచేయవద్దన్నారు కాని, మరొకరసానికి అంగంగా నిలపటానికి అంగీకరించారు. కవిత్రయంవారి మతం కూడా అదే. దాన్ని గుర్తించి విమర్శ సాగించాలి

4. భారతంలోని తత్త్వజ్ఞాన విషయాలకే ప్రాధాన్య మిచ్చి, పాండవ వృష్ణివంశ విరసావసానాన్ని సహృదయుడు భావించి, వాటి అవిద్యామూలకత్వాన్ని వివేచించి వాసుదేవ తత్త్వాన్ని ఆవిష్కరిస్తే - శాంతరసస్థితి నిరూ

24. కవిత్రయము వారి ఆంధ్రమహాభారతము-ధ్వనిసిద్ధాంత సమన్వయము (వ్రాతప్రతి) పుట. 675

25. కవిత్రయము వారి ఆంధ్రమహాభారతము-ధ్వనిసిద్ధాంత సమన్వయము పుట. 677

26. 'ప్రవృత్తిధర్మమునకు నివృత్తి ధర్మము మెఱుగులు పెట్టుననుట అసంగతము' క.ఆం. ధ్వ న పుట 878

పిత మౌతుంది.[27] అది నన్నయగా రన్నట్లు అధ్యాత్మవిదులు వేదాంత మని భారతాన్ని చూచే చూపు. నిజానికి కావలసింది కవివృషభులు మహాకావ్య మని ప్రసరించే దృక్పథం. ఆంధ్రభారతం ముందుగా మహాకావ్యం; ఆతరువాత శాస్త్రం. శాస్త్రభాగంలో ధర్మవేదాంత నీతిశాస్త్రాలకు మరలా అంతర్విభాగ ముంది. అంగా లెన్ని ఉన్నా అంగి కావ్యత్వం. ఆంగిరసం ధర్మాద్వైతా లలో మొదట నిర్దేశింపబడిన ధర్మవీరమే. ఆ ద్వంద్వంలో ఉత్తరోత్తరాలు బలీయా లని ఆశంకించవచ్చు. దోషం లేదు. బలమైన అంగం అంగికి కార్యసాధకం. శాంతరసవాదం శాస్త్రరూపమైన సంస్కృతభారతానికి వర్తించి నట్లు కావ్యరూపమైన ఆంధ్రభారతానికి వర్తింపదు.

5. ఆంధ్రభారతాన్ని కావ్యేతిహాసంగా వివేచించే పద్ధతికూడా ఉంది [28] అందులోకూడా అంగిరసం నాయకప్రవృత్తి నాశ్రయించే ఉన్నదని భావింపబడు తుంది.[29] అది కావ్యవిమర్శకూ, నవమరస వాదానికీ అనుగుణంగా ఉంది.

---

27. డా॥ శలాక రఘునాథశర్మగారు ఈమార్గాన్ని అనుసరించటానికి యత్నించారు. కాని, భారతకవితలో రసభావధ్వనులను వివరించ డంలోనే వారి కృషి కేంద్రీకరింపబడింది. ఏతాదృశ రసనిరూపణాన్ని సమగ్రవిస్ఫూర్తితో ఆవిష్కరింపలేకపోయారు. కొంతమేరం ఉభయ మార్గాల నాశ్రయించి నడచి దేనికీ న్యాయం చేయలేకపోయారు. (చూడు : వారి సిద్ధాంతవ్యాసం- వ్రాతప్రతి-పుటలు 664_671)

28. 'సంస్కృతభారతమును శాస్త్రేతిహాస మనియు, ఆంధ్రమహాభారత మును కావ్యేతిహాస మనియు అనుకొనవచ్చును. ఇక నీగ్రంథమున నాంధ్రమహాభారత మట్లే, ఈ దృష్టితో విమర్శింపబడును.' తిక్కన కావ్యశిల్పము డా॥ రామకోటిశాస్త్రి పుట 129

29. 'ధర్మజుని ప్రవృత్తి శాంతమున కభిముఖమై సాగినందున భారతమున నంగిరసము శాంతమగుచున్నది. తి. కా. శి. పు. 141. 'నాయ కుని యనుభవమున కైనది స్థాయి' (పుట141) అను రామకోటి శాస్త్రి గారి అభిప్రాయము సంప్రదాయబద్ధం. 'నాయకుని యనుభూతి కిని రసనిష్పత్తిమునకును సుదృఢమైన సంబంధము లేదు.' (పుట682) అను రఘునాథశర్మగారి అభిప్రాయం రసమార్గ విరుద్ధం. రసము సహృదయనిష్ఠ మని చెప్పటానికి ఇంతమాట అనవలసిన అవసరం కానరాదు.

అయితే అందులో 'ఇతిహాస రసస్థితి'ని ప్రత్యేకంగా ప్రతిపాదించుకోవలసి వచ్చింది. 'భారత మితిహాస మైనందున రససాంద్రత తక్కువగా నుండును... ఆంధ్రభారతము కావ్యేతిహాస మగుటవలన ప్రధాన కథాసంబంధి యౌచిత్యము, పాత్రోన్మీలనము మొదలైనవి లెస్సగా పాటింపబడినవి. మొ త్తముమీద శాంత మాస్వాద్యమగునట్లుగా ప్రధానకథ నిర్వహింపబడినది.'[30] అని చెప్పుకొని కావ్య త్వానికి ఇతిహాసత్వాన్ని అనుసంధానం చేసుకోవలసి వచ్చింది. ఈ మార్గంలో శాంతం నవమరసంగా భావించి శృంగారాదులవలె నిరూపించే పద్ధతి ప్రచురంగా కనపడుతున్నది. కాని స్పష్టమైన ప్రస్థానం కాకపోవటంచేత సమన్వయించుకో వలసిన విషయాలు మరికొన్ని అలాగే మిగిలిపోవలసి వచ్చాయి.

భారతంలోని శాంతాన్ని ప్రకృతిరసంగా వివేచిస్తే నాయకాశ్రితమైన స్థాయి భావచర్చ అసంగత మౌతుంది. నవమరసంగా శాంతాన్ని అంగీకరించి నాయకచర్చ చేస్తే సహృదయుడు హృదయసంవాదంవల్ల పొందే తత్త్వజ్ఞానం – లేక – జ్ఞానానందావి విశుద్ధ ధర్మయుక్తమైనదీ, పరికల్పిత విషయోపభోగ రహితమైనదీ అయిన ఆత్మయే – ఆత్మజ్ఞానమే – నాయకునియందు ప్రతీయ మాన మౌతున్నట్లు వివేచింపవలసి ఉంటుంది. ఆంధ్రభారతానికి సంబంధించి సంతవరకు ప్రకృతిరసవాదం సమగ్రంగా సమన్వయించదు. నవమరసవాదాన్ని ఆశ్రయించి నాయకాశ్రితమైన స్థాయిభావాన్ని నిరూపించటం ఇంతవరకూ విమర్శకులకు విశేషంగా సాధ్యం కాలేదు. భారతంలో ధర్మవీర మంగిరస మని అంగీకరిస్తే కావ్యరూపమైన భారతానికి సగౌరవమైన రసస్థితి కలుగుతుం దని నా నిశ్చయం.

ఏమైనా, భారత శాంతరస సాధనలో ఈ వ్యాసంలో విశ్లేషింపబడిన రెండుమార్గాలనూ విస్పష్టంగా వివేచించి విమర్శను సాగించవలసిన అవసర ముందని తోస్తున్నది. లేకపోతే రెండుకళ్ళచూపు లోపిస్తుంది.

30. తిక్కన కావ్యశిల్పము – పుట 148.

# భాషలో నవ్యకల్పన

—డా॥ శ్రీమతి నాయని కృష్ణకుమారి

'ప్రవాహినీ దేశ్యా' అన్న వాక్యానికి అర్థం అంద రెరిగినదే. ప్రవహించే నదితో భాషను పోల్చడంలో ఎంతవరకు ఔచిత్యం ఉన్నది? ప్రవహించే నదికి అనుక్షణమూ మార్పుకలుగుతున్నట్లుగా భాషకు కూడా మార్పుకలుగు తూనే ఉన్నదా? కలిగేమార్పు నదికి కలిగినంత చురుకుగా, వేగంగా కలుగు తున్నట్లు, ఇక్కడ కనిపిస్తున్నదా?

ఏ భాషనైనా సరిగా పరిశీలించి చూస్తే, అదిరెండు పొరలలాగా కనపడు తుంది. అవి (1) బాహ్య నిర్మాణానికి సంబంధించిన పైపొర (2) ఆంతర నిర్మాణానికి సంబంధించిన లోపలిపొర. ఒకభాషలోని వర్ణాలూ, పదాలూ మొదటి విభాగానికి చెందినవైతే, నుడికారమూ, వాక్యనిర్మితీ, రెండవ విభాగా నికి సంబంధించినవి. భాష ధ్వనులలోనూ పదాలలోనూ మారినంత చురుకుగా వేగంగా నుడికారాల విషయంలోనూ వాక్యనిర్మాణం విషయంలోనూ మారదు. అనగా పరభాషలనుండి కొన్నిభాషాధ్వనులూ, పదాలూ యథాతథంగా ఒకభాష లోనికి ప్రవేశించడం సాధ్యం కాగలదు గాని ఒకభాషకు సంబంధించిన నుడికారం మరోభాషలోనికి యథాతథంగా రాదు. అట్లాగే వాక్యంకూడా అంతసులువుగా ప్రవేశించదు. ఒక భాష మరోభాషమీద ఏకారణాల వలననైనా ఎక్కువ ప్రభా వాన్ని చూపించేదయితే అటువంటప్పుడు మాత్రమే స్థల కాల పరిస్థితులకు లోనై మాండలికమైన అంశంగానే ఒక్కొక్కప్పుడు వాక్యాలుకూడా మరో భాషలోనికి అనూదితాలై చొరబడవచ్చును.

హైదరాబాద్‌లో ఇద్దరు తెలుగువాళ్ళు తమ సంభాషణను ముగించే సంద ర్భంలో ఒకరు రెండవ వారితో, "మంచిది మళ్ళి గలుస్తాం" అనడం వినిపించ వచ్చు. అంటే "అచ్ఛా ఫిర్ మిలేంగే" అన్న ఉర్దూ వాక్యానికిది అనువాదమే.

అదేవిధంగా కళాశాలల్లో అధ్యాపకురాండ్ర దగ్గర ఉండే ఆయాలు 'టీచరమ్మకు అన్నం దినిపిచ్చొస్తా' అన్నా, ఒక విద్యార్థి మరో విద్యార్థితో 'ఇప్పుడు నాకు ఛాదాగిపియ్యాలె నువ్వు'' అన్నా ఆవాక్యాలు అనువాద వాక్యాలే. ఖానా ఖిలానా, చాయ్ పిలానా, అనే వాడుక ఉర్దూవాడుకే గాని తెలుగువాడుక కాదు. ముఖ్యంగా, ఇంగ్లీషు ఉర్దూ భాషలు ధారాళంగా మాట్లాడుకునే అలవాటు కలవారు తప్పిదారి తెలుగులో మాట్లాడ వలసివచ్చినప్పుడు, ఇటువంటి అనువాద వాక్యాల్ని సునాయాసంగా తయారు చేసుకోగలరు — ఇప్పుడే మా అబ్బాయి తన స్నేహితులతో మాట్లాడడం గమనించగా, నాకు దొరికిన ఒకవాక్యం; వాక్యాన్ని చూడండి: "ఈ రోజు నేను కాలేజికి వద్దామనుకున్నా, ఈ లోప లేమని దెలిసిందంటే కాలేజి లేదని!" ఉర్దూ వాక్యచ్ఛాయ ఇందులో ఉంది. వాక్యాలలో ఇటువంటి కొత్త ప్రయోగాలు కేవలం మాండలికమైనవిగానే నిలిచిపోవడం సంభవిస్తుంది.

ఈ రకంగా ఇతర భాషల ప్రభావాలవల్ల జనవ్యవహారంలోకి ఇటువంటి వాక్యాలు చొచ్చుకు రావడం ఒకపద్ధతి. ఇది కొంతవరకు సహజంగా జరుగుతుంది. (Natural innovation) ఇదికాక ఉద్దేశపూర్వకంగా సాంస్కృతిక కారణాలవల్ల నవ్యకల్పన జరుగవచ్చు (Purposive innovation) ఇది రెండవ పద్ధతి సాధారణంగా, జనం, తాము ఇంట్లో మాటాడుకునే భాషకంటే భిన్నమైన భాషను వేదికలెక్కి ఉపన్యాసాలు ఇచ్చేటప్పుడు మాటాడవచ్చు. వార్తాపత్రికలు, రేడియో, టెలివిజన్‌వంటి ప్రచార సాధనాలలో ఉపయోగించే భాషకూడా అటువంటిదే. ఇక్కడ వక్త వెలిబుచ్చవలసిన భావం వివిధరంగాలకు చెందినది. రకరకాల సాంకేతికవిజ్ఞానాన్ని వెల్లడించేది; మనుష్యుడి జీవితానికి ఉపయోగకరమైనదే అయినా సాంకేతిక పదజాలంతోనూ, ఇతరభాషలనుండి గ్రహించిన పదజాలంతోనూ నిండిఉండేది; ఇటువంటిచోట్ల భావాన్ని చాలా సందర్భాలలో ఇంగ్లీషు, హిందీ వంటి పరభాషలనుండి తర్జుమా చేసుకోవలసిన అవసరం కూడా ఉంటుంది. ఈ అనువాద ప్రక్రియవల్ల, తెలుగులోఏర్పడే వాక్యాలు, మామూలు తెలుగు వాక్యాలుగా ఉండవు. తెలుగువాక్యాలు సహజంగా చిన్నవైనప్పుడే ఎక్కువఅర్థస్ఫోరకతను కలిగి ఉంటాయి. వాటిలో సూటిదనం అప్పుడే వస్తుంది. కాని, ఇంగ్లీషులో మాట్లాడే టప్పుడు వాక్యాలు చిన్నవిగా కనిపించినా వ్రాతలో పెద్దవాక్యాలే ఉంటాయి. ఎంత పెద్దవాక్యం వ్రాసినా అర్థబోధకతలో

అన్వయక్లిష్టత ఆభాషలోఉండదు. తెలుగులో అట్లా సంశ్లిష్ట వాక్యాలు వ్రాస్తే అన్వయక్లిష్టత తప్పకుండా ఏర్పడుతుంది.

ఉదాహరణకు ఈ క్రింది వాక్యాన్ని పరిశీలిద్దాం ఇది ప్రజాశక్తి (1-2-1978) నుండి ఉద్ధరింప బడిన వాక్యం.

"మితవాద కమ్యూనిష్టుపార్టీ, (ఏకవచనం) ఏ పార్టీతో తాము ఏకమవడానికి నిశ్చయించుకున్నారో, (బహువచనం) ఆ పార్టీకెల్లా వామపక్ష ప్రజాతంత్ర ముద్రలు తగిలించే, మన మితవాదకమ్యూనిష్టు నాయకుల రాజకీయాలు (బహువచనం) ఎంతదివాలాకోరు రాజకీయాలో (బహువచనం) వెల్లడవుతుంది," (ఏకవచనం). వాక్యం ఇంతపెద్దదిగా తయారయినందు వల్ల ఏకవచన, బహువచనాలు తారుమారయినాయి. వాక్యానికి కర్తృత్వంవహించే వాక్యభాగం అయోమయంలో పడిపోయింది.

మరొక వాక్యాన్ని పరిశీలిద్దాం. ఇది ఆంధ్రప్రభ (1-2-1978) నుండి గ్రహించింది.

"చిలకలూరిపేట నుండి పోటీ చేయడానికి అభ్యర్థిగా నిన్నరాత్రి ప్రకటించిన ఆంధ్రాయూనివర్సిటీ మాజీ వైస్ ఛాన్సలర్ శ్రీఎల్. బుల్లయ్య ఎన్నికలలో పోటీచెయ్యడానికి విముఖత తెలియజేసి నందువల్ల శాసనసభ్యుడు శ్రీ పీటర్ పాల్‌కు ఈ నియోజకవర్గంనుండి పోటీచెయ్యడానికి కాంగ్రెస్ టికెట్ ఇస్తున్నట్లు ముఖ్యమంత్రి నేడు పత్రికావిలేకరులగోష్ఠిలో ప్రకటించారు." ఇది చాలా పెద్దవాక్యం. ఇందులో అన్వయసౌలభ్యం లేదు. దీన్ని మూడువాక్యాలుగా విభజిస్తే అర్థబోధ బాగా జరుగుతుంది.— చూడండి—

1. చిలకలూరిపేట నుండి పోటీ చెయ్యడానికి ఆంధ్రయూనివర్సిటీ మాజీ వైస్‌ఛాన్సలర్ శ్రీ ఎల్. బుల్లయ్యను అభ్యర్థిగా నిన్నరాత్రి ప్రకటించారు.

2. ఆయన ఎన్నికలలో పోటీచెయ్యడానికి విముఖత తెలియజేశారు.

3. అందువలన శాసన సభ్యుడు శ్రీ పీటర్‌పాల్‌కు ఈ నియోజకవర్గంనుండి పోటీచెయ్యడానికి టికెట్ ఇస్తున్నట్లు ముఖ్యమంత్రి నేడు పత్రికా విలేకరుల

గోష్ఠిలో తెలియజేశారు.— అన్వయ సౌలభ్యంకోసం అనువాదవాక్యాలను చిన్న విగా విడగొట్టుకోవడం తప్పనిసరి— కాని పత్రికల భాషతో ఇటువంటి వాక్యాలు కుప్పలు తిప్పలుగా తెలుగు భాషలోనికి జొరబడుతూనే ఉన్నవి. పత్రికా పఠనం చేసేవారు అటువంటి వాక్యాలను చదవడానికి, తర్వాత తాపీగా అర్థం చేసుకోవడానికి మెల్లిమెల్లిగా అలవాటు పడిపోతున్నారు. ఈ క్రింది వాక్యాన్ని గమనించండి—

ఈనాడు— 30-1-78:-"మన దేశంలోని వినిమయ సరుకుల ధరల పెరుగుదలకు దారితీయకుండా మనభారీ కీలక పరిశ్రమలోని గరిష్ఠ ఉత్పాదక శక్తి వినియోగంలోకి వచ్చేరీతిలో మన ముడిసరకులవల్ల ఇతర దేశాలు అధిక మైన లాభాలు పొందని పద్ధతిలో మనదేశపు ఎగుమతుల విధానంలో వెంటనే ప్రాతిపదిక స్వరూపపు మార్పులను తీసుకు రావలసిన అవసరం ఉందని గడచిన రెండు దశాబ్దాల అనుభవం వివరిసున్నది" ఈ వాక్యాన్ని ఒక్క సారి చదివి అర్థం చేసుకోవడం అంత సులువైన పనికాదు. అయినా జనం తప్పనిసరిగా చదివి తంటాలుపడి అర్థం చేసుకుంటున్నారు. పత్రికల భాషలోని వాక్యరచన యిలా వాంఛనీయం కాని క్రొత్త దారులు త్రొక్కుతున్నట్లే, ఇతర ప్రచార సాధనాలలోని వాక్యాలు కూడా కొత్త రూపాల్ని సంతరించు కొంటున్నాయి.

1-2-78 నాడు, టెలివిజన్‌లో చూపించిన గ్రామస్థుల కార్యక్రమంలో ఈ వాక్యాలను నేను గుర్తించడం జరిగింది. ఈ కార్యక్రమం చెఱకు పెంప కాన్ని గురించి. గ్రామస్థులకు వివరించిచెప్పే కార్యక్రమం. ఈ క్రింది వాక్యా లను వాళ్ళు ఎంతవరకు అర్థం చేసుకోగలరో నాకు సందేహమే.

1. మొక్కలు కింద పడకుండా నిటారుగా నిలబడి రోగములు తక్కువ వచ్చు అవకాశము లభించును

2. గాలిదుమారం లేని ఎండ బాగుగా ఉన్న రోజున ఎరువులు చల్లాలి.

3. పుష్కలపంట నీళ్ళల్లో కలిపిన ఎరువులవల్ల తప్పదు.

ఈ వాక్యాలలో నిర్మాణ పరమైన దోషాలను మనం గుర్తించవచ్చును.

వీటిని చిన్న చిన్న మార్పులతో, అర్థబోధకాలుగా ఉండేట్లు చేయడం కష్టం కాదు. చూడండి.

1. మొక్కలు కిందపడకుండా నిటారుగానిలబడి(తే)(వాటికి) రోగములు తక్కువ వచ్చు అవకాశము లభించును.

2. గాలి దుమారం లే(నప్పుడు) ఎండ బాగుగా ఉన్న రోజున, ఎరువులను చల్లాలి.

3. పుష్కల (మైన) పంట "నీళ్ళల్లో కలిపిన ఎరువులు" వేయుటవల్ల తప్పదు.

ప్రచారసాధనాలలో భాషను వాడేవాళ్ళు తెలుగు వాక్య నిర్మాణంపట్ల కించిత్తు శ్రద్ధ చూపితే ఇటువంటి అర్థక్లిష్టత గల వాక్యాలు కొత్తగా భాషలోనికి చొరబడకుండా జాగ్రత్త పడవచ్చు. ఉద్దేశ్యపూర్వకంగా తెలుగు భాషలోనికి ఇటువంటి వాక్యాలను నిర్మించి ప్రవేశపెట్టడం జరుగుతున్నా, ఇవి ప్రజల వ్యవహారంలో స్థిరస్థానాన్ని సంపాదించలేవు. ప్రాచీన గ్రాంథిక భాషకువలె ఇటువంటి భాషకూడా జన జీవితంలో మనిషి మనిషికీ వ్యాప్తిని పొందదు. జనులు కేవలం పత్రికలు చదివేటప్పుడూ, రేడియో వినేటప్పుడూ, మాత్రమే ఈ రకమైన వాక్యరచనను పరిమితం చేసుకుంటారు.

ఏ భాషలోని పదజాలమైనా చాలా వేగంగా మార్పును కోరుతూ, స్వీకరిస్తూ ఉంటుంది. పదజాలంలో కలిగే మార్పుల్ని రెండు రకాలుగా విభజించుకోవడానికి వీలున్నది.

1) ఇతర భాషలనుండి ఆదానక్రియ (Borrowing) వలన కలిగే మార్పు.

2) అవసరాన్ని బట్టి, ఒక భాష తనంతట తానుగా వర్ణనాత్మకంగా పదాల్ని నూతనంగా సృష్టించుకోవడం వలన కలిగే మార్పు. దీన్నే నవ్యకల్పన (Innovation) అనవచ్చును. ఈ నవ్యకల్పనను కొన్ని తెగలుగా విభజించవచ్చును.

1. దేశ్యమైన పదజాలం యొక్క సహాయంతో, వర్ణనాత్మకంగా, అవసరానికి తగిన పదాల్ని సృష్టించుకోవడం :— ఉదా॥ జానపదుల భాషలో మగపిల్లవాడు 'తనింటి దీపం' — ఆడపిల్ల 'పరింటి దీపం.'

| | |
|---|---|
| చంకచాటు | = చంటిపిల్ల |
| మనసాల | = నలుగురూ ఉండేచోటు |
| పడుసాల | = పడకటిల్లు |

ఇతర భాషలనుండి పదాలను గ్రహించవలసి వచ్చినప్పుడు, ఆ పదాలను మక్కికి మక్కి పదానువాదాలను తన భాషలోనికి తీసుకురావడం.

| | |
|---|---|
| Black Market | = నల్లబజారు |
| Dearness Allowance | = కరువు భత్యం |
| Evening College | = సాయం కళాశాల |
| Certified School | = ధ్రువీకృత పాఠశాల |
| Fountain Pen | = ఊట కలం |

ఇతర భాషలనుండి పదాలను సమాసాలుగా తీసుకురావలసివచ్చినప్పుడు, అందులో ఒకభాగాన్ని తనభాషలోదొరికే పదాలతోనూ, మరొకభాగాన్ని, అది యే భాషకు చెందిందో ఆ భాషలోని పదాలలోనూ కూర్చడం.

| | |
|---|---|
| Petromax Light | = పెట్రమాక్సు దీపం |
| Kerosene Oil | = కిరసనూనె |
| Motor Car | = మోటారు బండి |
| రేల్ గాడీ | = రైలుబండి |
| కాఫీ పౌడర్ | = కాఫీ పొడి |
| టీ పౌడర్ | = టీ పొడి |

క్రొత్తభావాన్ని సూచింపవలసి వచ్చినప్పుడు, ఇదివరకు భాషలో వేరే అర్థంలో వాడుకలో ఉన్న పదాలను అందుకు ఉపయోగించుకోవడం.

| | |
|---|---|
| Notice | = శ్రీముఖం |
| Air hostess | = ఆకాశకన్య |
| A. I. R. | = ఆకాశవాణి |
| Secretariat | = సచివాలయం |
| Vice-Chancellor | = కులపతి |

| | |
|---|---|
| Convocation | = స్నాతకోత్సవం |
| Professor | = ఆచార్యుడు |

ఒక భాషలో జనించిన పదాన్ని ఎటువంటి అనువాదమూ లేకుండా స్వీకరించి వ్యవహారంలో దాన్ని స్థిరం చేయడం.

| | | |
|---|---|---|
| Instalment | = ఇన్స్టాల్‌మెంట్ | (వాయిదా) |
| Principal | = ప్రిన్స్‌పాల్ | (ప్రాధ్యాపకుడు) |
| Student | = స్టూడెంట్ | (విద్యార్థి) |
| College | = కాలేజి | (కళాశాల) |
| Politics | = పాలిటిక్స్ | (రాజకీయాలు) |
| Vote | = ఓటు | |
| Candidate | = కాండిడేటు | (అభ్యర్థి) |

ఇటువంటి పదాలకు అనువాదాలు జరిగినా. (కుండలీ కృతాలు) ఆ అనువాదాల కంటె అసలు పదాలే జనవ్యవహారంలో ఎక్కువగా వినిపించడం జరుగుతుంది.

6. కొన్ని పదాలయొక్క అసలు రూపాల కంటె సంక్షిప్త అక్షర రూపాలే (Abbriviated forms) ఎక్కువ వాడుకలో ఉంటాయి. అవే చివరకు ఆ అరాలకు సంకేతాలుగా మారి కొత్తపదాలై స్థిరపడతాయి.

| | | |
|---|---|---|
| Dearness Allowance | = డియ్యే | (D. A) |
| Road Transport Corporation | = ఆర్టీసీ | (R. T. C.) |
| Television | = టీవీ | (T. V.) |
| Overtime | = ఓటీ | (O. T.) |
| All India Radio | = ఏ అయ్యార్ | (A. I. R.) |

7. కొన్నిపదాలకు ఒక భాషలో అనువాదాలు కావలసివచ్చినప్పుడు, ఆభాష కేవలం పదానికి పదంగా అనువదించుకోకుండా మొత్తం భావాన్ని ప్రతిబింబించేటట్లు భావానువాదాన్ని గ్రహిస్తుంది.

Indira wave ఇందిరా ప్రభంజనం

| | |
|---|---|
| Hijack | దారి మళ్ళింపు |
| Running Commentary | ప్రత్యక్ష వ్యాఖ్య |

ఇట్లు సూక్ష్మంగా పరిశీలిస్తే భాషలోనికి ప్రవేశించే కొత్త పదాల తీరు తెన్నులను ఖచ్చితంగా నిర్ధారించవచ్చును.

భారతీయభాషలన్నీ సంకేతపదజాలాన్నీ, శాస్త్రవిషయక పదజాలాన్నీ, పర్షియన్ అరబిక్ భాషలనుండీ, ఆంగ్లభాషనుండీ గ్రహిస్తున్నాయి. సంస్కృతం ఏ భారతీయ భాషలోనైనా అంతస్స్యూతంగా ఇమిడే భాష. అందువల్ల భారతీయ భాషలలోనికి ప్రవేశించే క్రొత్తపదాలు, చాలావరకూ పోలికలు కలిగిఉండడం కనిపిస్తుంది. పత్రికల్లో వాడే నవ్యకల్పనల్ని [1] క్షుణ్ణంగా పరిశీలిస్తే ఈ అంశం స్పష్టమౌతుంది.

[ ప్రక్క పేజీలో ఉన్న పట్టిక చదవండి ]

ఇట్లా ఇంచుమించు భాషలలోనికి జొరబడిన సాంకేతిక పదజాలాన్నంతటినీ ఉదాహరించవచ్చును.

పదాలనూ, వాక్యాలనూ. ఒకభాషలోనుండి గ్రహించేటప్పుడు, గ్రహించే భాషకు సంబంధించిన నిర్మాణపు మెలకువల్నీ, ఒదుగుసూ, గుర్తించి ఆ పద్ధతుల్లో గ్రహిస్తే అవి జనవ్యవహారంలో స్థిరత్వాన్ని వహించి అల్లుకొనిపోగలవు. నవ్యకల్పన అనే లక్షణం పెరిగే భాషలో విధాయకంగా ఉండే లక్షణం. ✶

1: ఫిబ్రవరి 1, 2, 3 తారీకులలో ఉస్మానియా యూనివర్సిటీ లింగ్విస్టిక్ శాఖవారు భారతీయ ప్రచార సాధనాలలోని భాష – ఆధునికత అనే అంశంపై జరిపిన గోష్ఠిలో ప్రసంగవశాత్తు అన్ని భాషలలోని నవ్యకల్పనల్ని చర్చించడం జరిగింది. ఈ పట్టిక అక్కడ అందించబడిన సమాచారం వల్ల కూర్చబడ్డది. అందుకు వారికి కృతజ్ఞతలు.

| ఇంగ్లీషు | తెలుగు | కన్నడం | మరాఠీ | హిందీ |
|---|---|---|---|---|
| Time Capsule | కాలనాళిక | కాలనాళ | కాలకుపీ | కాలపాత్ర |
| Rolling Plan | చక్రప్రణాళిక | ఆవర్త యోజనె | ఆవర్త యోజనా | ఆవర్తిత్ యోజనా |
| Black money | నల్లడబ్బు | కప్పుహణ | కాలాపైసా | కాలాధన్ |
| Agitation | ఆందోళన | ఆందోళనె | ఆందోలన్ | ఆందోలన్ |
| Heavy Water Project | భారజల ప్రణాళిక | భారజలయోజనె | జడజలప్రకల్ప | భారజల్ ప్రకల్ప |
| Inter continental missile | ఖండాంతరక్షిపణులు | అంతర్దేశీయక్షిపణి | అంతర్దేశీయ క్షేపణాస్త్ర | అంతర్దేశీయ క్షేపణాస్త్ర |
| Family Planning | కుటుంబ నియంత్రణ | కుటుంబయోజనె | కుటుంబనియోజన్ | పరివార నియోజన్ |
| United Nations | సంయుక్త రాష్ట్రాలు | సంయుక్తరాష్ట్ర | రాష్ట్రసంఘ | రాష్ట్రపుంజ్ |
| Plan | యోజన | యోజనె | పరికల్పన్ | యోజన |
| Requisition | అభ్యర్థన | బేడికె | అభియాచన | అభియాచన్ |
| Air hostess | ఆకాశకన్య | గగనసఖి | హవాయిసుందరీ | ఆకాశకన్య |
| Secretariat | సచివాలయం | మంత్రాలయ | సచివాలయ్ | సచివాలయ |
| Social Welfare | సాంఘిక సంక్షేమం | సమాజకల్యాణ్ | సమాజ్ కల్యాణ్ | సమాజ్ కల్యాణ్ |
| Hunger Strike | నిరాహారదీక్ష | నిరశనదీక్ష | భూక్ హర్తాళ్ | అనశన్ |
| Air Conditioned | వాతానుకూల | వాతానుకూల | వాతానుకూలిత | వాతానుకూల్ |

# 1977 లో తెలుగు శాఖ
# ఉస్మానియా విశ్వవిద్యాలయము



తెలుగుశాఖలో జరిగిన పరిశోధన రంగవిస్తరణం ఈ సంవత్సరంలో ప్రత్యేకంగా పేర్కొనదగిన అంశం. విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘంవారు 'Faculty Improvement Programme' క్రింద 'Teacher Fellowship Programme' ను విస్తరింపచేస్తూ తెలుగులో పరిశోధన ప్రణాళిక నిర్వహించ టానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని మనతెలుగుశాఖను గుర్తించడం ముదావహమైన విషయం. ఈ ప్రణాళిక క్రింద భారతదేశంలో ఏ కళా శాలలోనైనా తెలుగుభాషాసాహిత్యాలను అధ్యాపనం చేసే ఉపన్యాసకులు, 5 సంవత్సరాల కనీసపు సర్వీసు అనుభవం ఉన్నట్లయితే, దరఖాస్తులు పంపు కోవచ్చు. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని దేశం నలుమూలలనుండీ ఆధ్యా పకులు అభ్యర్థనపత్రాలను పంపుకున్నారు. మొత్తం 16 దరఖాస్తులు వచ్చినవి. అంతకు ముందే క్రిందటి సంవత్సరం కోటాలో నలుగురు అభ్యర్థులు సరాసరి ఎన్నికైనారు. పై 16 మంది అభ్యర్థులలో నుండి ఏడుగురు ఈ సంవత్సరం కోటాలో ఎన్నికైనారు. మొత్తం ఈకార్యక్రమం క్రింద 11 మంది ఫెలోలు ప్రస్తుతం తెలుగుశాఖలో పరిశోధన నిర్వహిస్తున్నారు. వీరిలో 3 సం॥ల ఫెలో షిప్పువారు (Long Term Fellowships) 1 సం॥ ఫెలోషిప్పువారు (Short Term Fellowships) ఏడుగురు ఉన్నారు. ఆ వివరాలు ఇవి:-

| | అధ్యాపకుని పేరు | ఫెలోషిప్ | చేరినతేది |
|---|---|---|---|
| 1. | శ్రీ జి. హరిహరనాథ్, ఆంధ్రోపన్యాసకుడు N. M. ఆర్ట్స్&సైన్సుకళాశాల, జోగిపేట | 3 సం॥ | 28-5-1977 |
| 2. | కుమారి ఆర్.వసంతలక్ష్మి, తెలుగుట్యూటర్ వై. ఏ. ప్రభుత్వ మహిళాకళాశాల, చీరాల | 3 సం॥ | 23-6-1977 |

| | అధ్యాపకుని పేరు | ఫెలోషిప్ | చేరినతేది |
|---|---|---|---|
| 3. | శ్రీ వి. బుచ్చారెడ్డి, ఆంధ్రోపన్యాసకుడు, ఆర్ట్స్& సైన్సుకళాశాల, మహబూబ్‌నగర్ | 3 సం॥ | 1-9-1977 |
| 4. | శ్రీ వి.వి. యన్. శర్మ, తెలుగు ట్యూటర్ ప్రభుత్వ కళాశాల, గద్వాల్ | 1 సం॥ | 17-10-1977 |
| 5. | శ్రీ యం.శ్రీరంగాచార్య, తెలుగు అసిస్టెంట్ లెక్చరరు S.K.N.R. ప్రభుత్వ కళాశాల జగిత్యాల. | 1 సం॥ | 7-11-1977 |
| 6. | శ్రీ కె. రాజన్న. ఆంధ్రోపన్యాసకుడు, సర్దార్‌పటేల్ కళాశాల, సికింద్రాబాదు | 1 సం॥ | 9-11-1977 |
| 7. | శ్రీ ఆర్. మాధవరావు ఆంధ్రోపన్యాసకుడు న్యూసైన్సు కళాశాల హైదరాబాదు | 1 సం॥ | 9-11-1977 |
| 8. | శ్రీ కె వి నరసింహాచార్య. తెలుగు-అసిస్టెంట్ లెక్చరర్, ప్రభుత్వ కళాశాల, శ్రీకాకుళము | 3 సం॥ | 16-11-1977 |
| 9. | శ్రీమతి కె. యన్, ఇందిరాదేవి, తెలుగు-అసిస్టెంట్ లెక్చరర్, వై. వి. ప్రభుత్వ మహిళాకళాశాల, చీరాల. | 1 సం॥ | 21-11-1977 |
| 10. | శ్రీ కె. వెంకటేశ్వరరావు, ఆంధ్రోపన్యాసకుడు S.K.B.R. కళాశాల, అమలాపురం | 1 సం॥ | 23-11-1977 |
| 11. | శ్రీ డి. క్రిష్ణంరాజు, ఆంధ్రోపన్యాసకుడు J.V.R. ప్రభుత్వ కళాశాల. సత్తుపల్లి ఖమ్మంజిల్లా | 1 సం॥ | 8-12-1977 |

ఈ విధమైన సౌకర్యం అధ్యాపకులకు తెలుగులో కలగటం, ఆ కార్యక్రమం తెలుగుశాఖ ఆధ్వర్యంలో నిర్వహింపబడటం మనశాఖకు అబ్బిన ప్రత్యేక

గౌరవం. ఈ అవకాశాన్ని అర్హులైన అధ్యాపకులు ప్రతిసంవత్సరం వినియోగించుకొని ప్రయోగాన్ని విజయవంతం చేస్తారని ఆశిస్తున్నాము.

యు. జి. సి. వారు ఈసంవత్సరం జూన్ నెలనుంచి పూర్వపు M. Phil కోర్సుకు మారుగా M. Phil/Ph.D. integrated Course ను ప్రవేశపెట్టినారు. దాన్ని మనశాఖ అమలుజరుపుతున్నది. ఈ కోర్సులో ఎన్నిక చేయబడినవారు ఒక సంవత్సరంపాటు రెండు సెమిస్టర్లలో నాలుగు కోర్సులు చదివి మొత్తం 500 మార్కుల పేపర్లకు సమాధానం వ్రాయవలసి ఉంటుంది. దాన్ని మొదటి భాగంగానూ, వారు సిద్ధంచేసి సమర్పించే పరిశోధనవ్యాసాలు–లేక–సిద్ధాంత వ్యాసాలను రెండవభాగంగానూ పరిగణిస్తారు.

మొదటిభాగంలో ఉన్న కోర్సులు –

1. మొదటి సెమిస్టరు

| | |
|---|---|
| 1 వ కోర్సు – Methodology of Research | 100 మార్కులు |
| సెమినార్ – | 25 మార్కులు |
| 2 వ కోర్సు – Theory and Practice of Literary Criticism – I | 100 మార్కులు |
| సెమినార్ – | 25 ,, |

2. రెండవ సెమిస్టరు –

| | |
|---|---|
| 3 వ కోర్సు – Forms of Literature | 100 మార్కులు |

ఇందులో ఈ క్రింద అంశాలలో ఏదో ఒకటి తీసుకోవాలె

1. Forms of Poetry in Telugu
2. Forms of Prose in Telugu
3. Forms of Drama in Telugu
4. Study of Language in Telugu
5. Folk Literature
6. Telugu Grammar

| | |
|---|---|
| సెమినార్ – | 25 మార్కులు |
| 4 వ కోర్సు – Theory and Practice of Literary criticismII లేదా Technology of Teaching | 100 మార్కులు |
| సెమినార్ | 25 మార్కులు |
| మొత్తం | 500 మార్కులు |

రెండవభాగం-అభ్యర్థి పరిశోధనాంశం పై సిద్ధంచేసి సమర్పించే సిద్ధాంత-పరిశోధన- వ్యాసం.

సరాసరి పి. హెచ్. డి., కోర్సులో ప్రవేశం పొందినవారు మొదటి సంవత్సరంలో నిర్దేశింపబడిన పాఠ్యప్రణాళిక ననుసరించి ప్రీ. పి. హెచ్. డి. పరీక్ష (రెండు పేపర్లు - Broad Field and Narrow Field) ను ఇవ్వవలసి ఉంటుంది. నిర్ణయించినగడువులో సిద్ధాంతవ్యాసాన్ని సమర్పింపవలసి ఉంటుంది.

గతసంవత్సరం తెలుగుశాఖ సర్వసభ్య సమావేశం తీసుకున్న నిర్ణయాల మేరకు 'తెలుగు సాహిత్య సదస్సు' మరలా సమావేశాలను నిర్వహించటం ప్రారంభించింది. ఆ వరుసలో ఈసంవత్సరంలో ఒకసమావేశం 1-10-1977 నాడు జరిగింది. అందులో డా॥ యం. కులశేఖరరావు 'బిరుదుగద్య' మీదా, డా॥ అమరేశం రాజేశ్వరశర్మ 'అప్పకవీయంలో ప్రాకృత వ్యాకరణసూత్రాలు' అను అంశంమీదా పరిశోధనవ్యాసాలు సమర్పించినారు. సభ్యులు చర్చలో పాల్గొన్నారు. ఆ వ్యాసాలు 'వివేచన' రెండవసంచికలో ప్రచురింపబడినవి.

ఈ సంవత్సరం డిసెంబరు 17వ తేదీన జరిగిన తెలుగుశాఖ సర్వసభ్య సమావేశంలో ఈ క్రింది అంశాలమీద సభ్యులు ప్రత్యేకమైన ఆసక్తిని ప్రకటించి నిర్ణయాలు తీసుకున్నారు.

1. తెలుగుశాఖలో సామూహిక పరిశోధన ప్రణాళికలు నిర్వహింప బడవలసిన అవసరం ఉన్నది.

2. డిగ్రీ తరగతుల బోధనా విధానాన్ని మెరుగుపరచటానికి తగినంత సాధన సాహిత్యం (Class-work and Desk-work material) సందర్భ సాహిత్యం (Reference material) తయారు చేయవలసిన అవసరం ఉన్నది.

3. యు. జి. సి., వారికి తెలుగుశాఖ సమర్పించిన COHSIP కార్యక్రమం, 'సమ్మర్ స్కూల్' ప్రతిపాదనలు అమలుజరిగేటట్లు కృషిచేయగలందులకు మన విశ్వవిద్యాలయాధికారులను కోరటమైనది.

4. ప్రాంతీయభాషాధ్యయనానికి డిగ్రీతరగతులలో వారానికి ఇప్పుడున్న

నాలుగు పీరియడ్లకు బదులు 6 పీరియడ్లు కేటాయించవలసిన అవసరం ఉంది

5. అంతర్విశ్వవిద్యాలయ అధ్యాపక సదస్సు ఒకటి ఏర్పడవలెననీ, దాని వలన అన్ని ప్రాంతాల్లో పనిచేస్తున్న తెలుగు అధ్యాపకులకు సమన్వయ వేదిక ఒకటి సాధింపబడటానికి వీలౌతుందనీ, సదస్సు పక్షాన ఒకపరిశోధన పత్రిక ప్రచురింపబడవలెననీ భావించటం జరిగింది. దాని కనుగుణంగా ఆచార్య బి. రామరాజుగారిని తగిన సారధ్యయత్నం సాగింపవలసిందిగా కోరటం జరిగింది.

6. ప్రాంతీయ, అధికార భాషలహోదాలలో ఉన్న తెలుగుకు విశ్వవిద్యాలయ పాఠ్యప్రణాళికల్లో సముచితమైన గౌరవస్థానం కల్పించవలెననీ, విద్యార్థులందరూ దీనిని అవశ్యపఠనీయాంశంగా గ్రహించేటట్లు చేయవలెననీ సర్వసభ్యసమావేశం భావించింది. ఈ కార్యక్రమానికి అనుగుణంగా ప్రజాభిప్రాయాన్నీ, ప్రభుత్వాభిప్రాయాన్నీ, విశ్వవిద్యాలయాభిప్రాయాన్నీ మలచటానికి తగిన కార్యక్రమాన్ని రూపొందించే నిమిత్తం 'తెలుగు అధ్యాపకుల సంఘం' పునరుద్ధరింపబడింది. అది మొదట ఒక సంఘటితసమావేశాన్ని (Convention) ఏర్పాటు చేయవలెనని కూడా నిర్ణయం తీసుకున్నది. ఆచార్య బి. రామరాజు, ఆచార్య సి. నారాయణ రెడ్డి, డా॥ కె. సంపత్కుమారాచార్య, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గార్లతో ఒక సారధ్యసంఘం ఎన్నుకొనబడింది.

7. డిగ్రీస్థాయి పాఠ్యప్రణాళికలో గ్రూపుల్లో ఒక విషయంగా Practical Telugu ను చేర్చవలెనని భావించటమైనది. [ఇది Modern Language అన్న విషయంకంటే భిన్నమైనది.] ప్రాంతీయ–అధికారభాషగా తెలుగు అమలు జరుగుతున్న నేటిరోజుల్లో ఆ భాషావ్యవహారాలకు సంబంధించిన సమస్యలను విద్యార్థులు పఠించే విషయంగా ఇది రూపొందుతుంది.

8. ఎం. ఏ., ఎం. ఓ. యల్., పాఠ్యప్రణాళికల్లో లింగ్విస్టిక్స్‌ను ఐచ్ఛిక విషయంగా మాత్రమే ఉంచాలనీ, నిర్బంధమైన కోర్సుగా గానీ, విషయంగాగానీ, దానిని ఉంచరాదనీ, నిర్ణయించటమైనది.

9. ఫ్రెంచి, జర్మని, తదితర పాశ్చాత్యభాషలకు రెండవభాషలతో (Second Languages) సమానస్థాయి ఉండకూడదనీ, పాఠ్యప్రణాళికలోకాని, పఠనవిధానంలోకాని వాటిమధ్య ఉండే సహజవిస్తృతమైన తారతమ్యంవల్ల అది హేతువాదదూరమౌతున్నదనీ భావించటం జరిగింది.

10. తెలుగు శాఖలో పరిశోధన చేస్తున్న విద్వాంసులందరూ కలిసి ఒక సంఘముగా ఏర్పడవలెననీ, ఆసంఘానికి ఆచార్య బి. రామరాజు గారు రూపురేఖలు దిద్దవలెననీ, శ్రీ బుచ్చారెడ్డి గారు సమావేశకర్తగా వ్యవహరించవలెననీ నిర్ణయించుటయైనది.

ఉద్యోగవిరమణంచేసిన అధ్యాపకుల సేవలు వినియోగించుకొనే యు. జి. సి. ప్రణాళిక క్రింద ఈ క్రింది అధ్యాపకులు మా తెలుగుశాఖలో పరిశోధన చేస్తూ ఉండటం ముదావహమైన విషయము.

1. డా॥ బొడ్డపాటి కుటుంబరాయశర్మగారు. (1-4-1972 నుండి 1-9-77 వరకు)
2. డా॥ పల్లా దుర్గయ్య గారు. (21-10-1976 నుండి)
3. డా॥ యన్. వి. ఆర్. కృష్ణమాచార్య గారు (16-4-1977 నుండి)
4. డా॥ దివాకర్ల వేంకటావధాని గారు (25-6-1977 నుండి)

ఓరుగల్లులోని ఆర్ట్సు అండ్ సైన్స్ కళాశాల సాయంకళాశాలలు కాకతీయ విశ్వవిద్యాలయానికి అనుబంధింపబడటంవల్ల ఆ కళాశాలల్లో ఉన్న తెలుగు విభాగాలు మాతృసంస్థ నుండి విడివడినవి. ఓరుగల్లు కళాశాలలో M. Phil., పర్యవేక్షకులుగాఉన్న డా॥ హరి శివకుమార్ గారు కాకతీయ విశ్వవిద్యాలయంలో సభ్యులైనారు. హైదరాబాదు సాయంకళాశాలలో పనిచేస్తున్న డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు ఈసంవత్సరం M. Phil., పర్యవేక్షకులుగా గుర్తింపబడినారు.

ఈయేడు తెలుగుశాఖలో 5 గురు పరిశోధకులు Ph.D., డిగ్రీలను, 8 మంది పరిశోధకులు M.Phil., డిగ్రీలను పొందినారు. ఆ వివరాలు ఈక్రింద పొందుపరుపబడుతున్నవి.

## (1) 1977 లో Ph.D., డిగ్రీ పొందిన పరిశోధకులు

| | పేరు | విషయం | పర్యవేక్షకులు | డిగ్రీవచ్చిన తేది |
|---|---|---|---|---|
| . | డా॥ శ్రీమతి ముదిగంటి సుజాతారెడ్డి | మనుచరిత్ర-వసుచరిత్ర-తులనాత్మక పరిశీలనము | ప.దు. | 8-2-1977 |
| 2. | డా॥ శ్రీమతి యం. దీనావతి | గ్రంథావతారికలు-ఆంధ్ర చరిత్రసామగ్రి(1600వరకు) | బొ.కు.రా. | 9-3-1977 |
| 3. | డా॥ జి. రామకృష్ణరాయణం | పింగళి సూరన-అతని రచనలు | ది.వేం. | 28-6-1977 |
| • | డా॥ పోరంకి దక్షిణామూర్తి | తెలుగు కథానిక స్వరూప స్వభావములు | సి నా.రె. | 25-7-1977 |
| . | డా॥ యన్. జి. రామానుజాచార్యులు | ఆంధ్రాలంకారశాస్త్ర సాహిత్య చరిత్ర | ప.దు. | 24-10-1977 |

## (2) 1977లో M. Phil డిగ్రీ పొందిన పరిశోధకులు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీమతి కన్నూరి ఉదయభాస్కరలక్ష్మి | తెలుగులో విషాద రూపకములు | సి.నా.రె. | 10-1-1977 |
| 2. | శ్రీమతి జె. బాలాత్రిపురసుందరి | తెలుగులో అవధాన కవిత | అ.రా.శ. | 19-2-1977 |
| 3. | శ్రీమతి యన్. జ్యోతిర్మయి | తెలుగులో తాత్త్విక జానపద గేయాలు | కె.గో.రా. | 1-6-1977 |
| 4. | శ్రీ టి. రామనరసయ్య | తెలుగు సామెతలలో సమాజం | వే.ఆ.మూ. | 11-7-1977 |
| 5. | శ్రీమతి కె. హరిప్రియ | పానుగంటి వారి సాక్షివ్యాసాలు-సాంఘికదృక్పథము | జి.వి.సు. | 17-8-1977 |
| 6. | శ్రీ యన్. సత్యనారాయణ శాస్త్రి | సాహిత్య వ్యాసకర్తగా శ్రీశ్రీ | కే.గో.రా. | 31-8-1977 |
| 7. | కుమారి సి. హేమ | మొల్ల రామాయణము | కు.శే.రా. | 30-9-1977 |
| 8. | శ్రీ యం. నరహరి | శ్రీశ్రీ కవితలో సామాన్య మానవుడు | కు.శే.రా. | 24-10-1977 |

ఈయేడు ఆగస్టు నెలలో Ph.D., M Phil., కోర్సులలో ప్రవేశం పొందిన పరిశోధకుల వివరాలు :

1977 ఆగస్టు లో Ph.,D కోర్సులో ప్రవేశం పొందిన పరిశోధకులు.

రీ–రిజిస్ట్రేషన్

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమతి డి. లక్ష్మీనరసమ్మ | తెలుగులో ఏకాంకికలు | ప. దు. |
| 2. | శ్రీ వి. వి. తిరుపతయ్య | అచ్చతెనుగు–యయాతి చరిత్రము | కే. గో.రా. |
| 3. | శ్రీ టి. వెంకటేశ్వరశర్మ | ఆంధ్రమహాభాగవతము–ధ్వని సిద్ధాంత సమన్వయము | ప. దు. |

క్రొత్త రిజిస్ట్రేషనులు

| | | | |
|---|---|---|---|
| 4 | శ్రీ యం. అనంత కుమారశర్మ | దోమకొండ సంస్థాన కవులు–వారిరచనలు | కే. గో.రా. |
| 5. | శ్రీ కె. ఎ. సింగరాచార్యులు | ఆంధ్రమహాభారతములో కృత్తులు, తద్ధితములు–ఒకపరిశీలన | అ.రా.శ. |
| 6. | శ్రీ కె. రుక్నుద్దీన్ | జానపదసాహిత్యంలో అలంకార పోషణ విధానము. | నా.కృ.కు. |
| 7. | వై. బి. యస్. ప్రసాదరావు | కీ. శే. తాపీధర్మారావు జీవితము–రచనలు | యస్వీరా. |
| 8. | శ్రీ జి. వెంకటాచార్య | రంగనాథ–వాల్మీకి రామాయణములు – తులనాత్మక పరిశీలన | జి.వి.సు. |
| | శ్రీ యం. రాజారావు | గురజాడఅప్పారావు జార్జిబెర్నార్డ్‌షా– తులనాత్మక పరిశీలనము | సి.నా.రె. |

| | | | |
|---|---|---|---|
| 10. | శ్రీ డి. క్రిష్ణంరాజు | శ్రీశ్రీ కవిత్వము–మనో విశ్లేషణాత్మక వివేచనము | కే.గో.రా. |
| 11. | శ్రీ కె. వి. నరసింహాచార్య | త్యాగరాజు జీవితము–కృతులు–ఒకపరిశీలనము | సి.నా.రె. |
| 12. | శ్రీ ఆర్. మాధవరావు | మునిమాణిక్యం నరసింహారావు జీవితము–రచనలు | బి.రా.రా. |

1977 ఆగస్టులో M. Phil, కోర్సులో ప్రవేశం పొందిన పరిశోధకులు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వి. వీరనారాయణ | ఆంధ్రమహాభారత– ఉద్యోగ పర్వంలో శ్రీకృష్ణప్రాముఖ్యం, పాత్రచిత్రణం | కు. శే. రా. |
| 2. | శ్రీ యం. రంగాచారి | తెలుగు కథానిక–బుచ్చిబాబు | ఎం. శి. ప్ర. |
| 3. | శ్రీమతి కె శ్రీలక్ష్మి | రామాయణ జానపదగేయాల్లో స్త్రీ పాత్రలు–ఒకపరిశీలన. | నా.కృ.కు. |
| 4. | శ్రీ పి. మాణిక్ ప్రభు | పైడిమఱ్ఱివెంకటపతి చంద్రాంగద చరిత్రము–ఒకపరిశీలనము. | అ.రా.శ. |
| | శ్రీ పి, శివరామశర్మ | విశ్వనాథవారి చారిత్రక కావ్యాలు–వాని రచనావిధానము | .వి.సు. |
| 6. | శ్రీమతి కె. రాజలలిత | క్షేత్రయ్యపదములు–సాహిత్య సంగీత అభినయపరిశీలనము | వి.సీ.క. |
| | శ్రీ యం. రంగాచారి | ఆంధ్రమహాభారతము–ప్రకృతి వర్ణన | కే.గో.రా. |
| 8. | శ్రీ కె. విఠలాచారి | తెలుగులోగొలుసుకట్టుకథలు | ఇ.కృ.మూ. |
| 9 | శ్రీ ఎ. వెంకటరావు | తెలుగు అభ్యుదయకవిత్వంలో ఇమేజరీ | అ.విశ్వం |

| | | | |
|---|---|---|---|
| 10. | శ్రీ పి. లచ్చయ్య | నల్లగొండ జిల్లాలోని వ్యావసాయిక గీతాలు | కు.శే.రా. |
| 11. | కుమారి జి. సీతమ్మ | తెలుగులో వరాహపురాణము-ఒక పరిశీలనము | పి.య.రె. |
| 12. | శ్రీ యన్. రాజేశం | కరీంనగరం జిల్లా జానపదగేయాలలో సాంఘిక జీవనం | యస్వీరా |
| 13. | శ్రీ ఎ. విష్ణువర్ధన్ | మాలపల్లి-సమగ్రపరిశీలనము | ఇ.కృ.మూ. |
| 14. | శ్రీ యం. శ్రీరంగాచార్య | క్రీడాభిరామము - సంస్కృతి సాంఘిక పరిస్థితులపరిశీలనము | కు.శే.రా |
| 15. | శ్రీమతి కె. యస్. ఇందిరా దేవి | ఆంధ్రమహాభారత విరాటపర్వములో ద్రౌపది పాత్రచిత్రణము | జి.వి.సు. |
| 16. | శ్రీ కె. వెంకటేశ్వరరావు | విశ్వనాథ రామాయణ కల్పవృక్షముపై తిక్కన రచనాప్రభావము. | జి.వి.సు. |